శ్రీరస్తు

# శ్రీ పోతులూరి
# వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్ర




గ్రంథకర్త:

**చిరువెళ్ళ సుబ్బరామయ్య**

W 3/606, లక్ష్మీపురం,

శెట్టిగుంటరోడ్డు, నెల్లూరు-524 002.

# SRI POTULOORI VEERABRAHMENDRA SWAMY CHARITRA



By

Chiruvella Subbaramaiah

First Edition : July 1991

Copies : 1000

Price : **Rs. 20-00**

This book is published with the financial assistance given by THE TIRUMALA TIRUPATI DEVASTHANAMS Under their scheme 'Aid to publish religious books.'

Copies can be had from
CHIRUVELLA SUBBARAMAIAH
W 3/606, Lakshmipuram,
Settygunta Road - NELLORE-524 002

Printed at
SAIRAM PRINTERS
14/204, Kapu Street, Nellore-1

శ్రీ వేంకటేశాయ నమః



# అంకితము

వీరబ్రహ్మ చరిత్రమున్ మధురమాధ్వీసార నిస్యంద సం
పూరంబై చెలువొందఁ గూర్చితి, మహామోదంబుఁ జేకూర్పఁగన్
ధీరోదాత్తులకున్, రసజ్ఞులకు; తండ్రీ! సప్తశైలాధిపా!
నీరేజాక్ష! యొసంగి తంకితము దీనిన్ నీకుఁగైకోగదే!

—గ్రంథకర్త

# అంజలి

ఎలుకతేజి నెక్కి యెల్ల లోకంబుల
సంచరించు నట్టి చల్లనయ్య
ప్రమదగణ విభుండు పాలించు నన్ దయ
గౌరి ముద్దుబిడ్డ గజముఖుండు 1

జగముల కాధారంబై
నిగమంబుల సంచరించు నిఖిలేశ్వరి, యా
భగవతి వాణీ సతి న
న్నగణితముగ బ్రోచుగాత మనవరతంబున్ 2

గంగాధర! శివ! శంకర!
సంగీతవిలోల! సర్వజగతీపాలా!
భృంగీగణ సంసేవిత!
అంగజ గర్వా పహరణ! అగజాభరణా! 3

గజ చర్మాంబరధారీ!
భుజగాభరణా! సమస్త భువనాతీతా!
రజితాద్రి నిలయ! శశిధర!
సుజనావన! నన్ను కరుణఁ జూడుము సతమున్ 4

హరి! నారాయణ! కేశవ!
పరమాత్మ! వికుంఠవాస! భక్తావన! యో
గిరిధర! దానవమర్దన!
కరివరదా! నన్నుదయను గావుము తండ్రీ! 5

పావన మాతృమూర్తి, భవబంధ విమోచని, భవ్యరూపి, ర
క్షోవన దావకీలి, గుణ శోభిత, ఆశ్రిత కల్పవల్లి, భ
క్తావన లోకమాత, రజితాచలవాసిని, శంభురాణి నన్
బ్రోవవె నీ పదద్వయిని పూర్ణమతిన్ భజయింతు నెప్పుడున్ 6

పరమ పావన చరితుండు, భవ్యయశుఁడు
మహిత మహనీయ వేదాంత మార్గగామి
శిష్యలోక ప్రపూజ్యుండు, చిన్మయుండు
శ్రీ వీరాట్ పోతులూరార్య చేరి కొలుతు 7

నిరతాన్నదానములతోఁ
బరమేశ్వరు నెపుడు మదిని ప్రార్థించెడు స
చ్చరితుల నా తలిదండ్రుల
చరణమ్ముల మది దలంతు సద్భక్తి మెయిన్ 8

పరసజనాభినందితుఁడు, శాంతమనస్కుఁడు ధర్మచింతనా
పరుఁడు, పరోపకారగుణవంతుఁడు, ఆశ్రిత కల్పశాఖి నన్
పెరిమనుచెంతఁ జేర్చుకొని స్వీయ కుమారుని భంగిఁజూచు మ
ద్గురుఁడగు వేంకటేశ్వరుని కూరిమిమీర నుతింతునెప్పుడున్ 9

కవి పండిత రసికులకున్
భువి నుత్తమ గాయకులకు, పుణ్యాత్ములకున్
ప్రవిమల భక్తాదులకున్
సవినయముగ నంజలింతు సద్భక్తి మెయిన్ 10



# -: పరిచయము :-

శ్రీవేమనయోగి పద్యముల వలె నీ రాజయోగి తత్త్వములు గూడ బహుళ ప్రచారము నంది యున్నవి. ఈ తత్త్వములు భవిష్యత్తును సూచించునట్లు రచింపబడియుండుటయే గాక, అవి నిత్యసత్యములని ప్రచారమునందియున్నవి.

అగ సాలెకుల కలశవారాశి సుధాకరుడు పరిపూర్ణాచార్యుడు తన కులకాంత ప్రకృతాంబతో పురములను, పుణ్య తీర్థములను సేవించుచు వారణాసికిం జనిరి. నవమాసములు నిండిన నా యిల్లాలు సరస్వతీ నదీ తీరమున చక్కని మగబిడ్డను గన్నది. ఆ వారణాసి యందు వారు విశ్వేశ్వరుని, విశాలాక్షి అన్నపూర్ణాదేవిని సేవించుచు వారే కొన్ని దినములటనుండ నిశ్చయించుకొనిరి. ఇంతలో పరిపూర్ణాచార్యుడు జ్వరపీడితుడై మరణించెను. ప్రకృతాంబ భర్తతో సహగమన మొన రింప నిశ్చయించుకొనెను.

ఆ సమయమున స్నానాదులకయి సరస్వతీ నదీతీరమునకు అత్రిమహాముని యరుదెంచెను. ఆతనిని గాంచి మహానంద భరితు రాలయి ప్రకృతాంబ శీతభానుని వోలె ప్రకాశించుచున్న తన పుత్రుని సంరక్షింపుమని యత్రి కొసంగి, తాను సహగమన మొనరించెను. కృతయుగము నందలి అత్రి మహామునికిని కలియుగము నందలి యగసాలె కులీనురాలగు ప్రకృతాంబకును సమాగమము ఎట్లు జరిగెనో యించుక సంశయాస్పదమును కలిగించుచున్నది. ఈ మహాఋషి "అత్రి" యను పేరుగల మరియొకరయి యుండవచ్చును.

కొంత కాలము గతించిన పిమ్మట నందికొండ పాపాగ్ని మఠా ధ్యక్షుండు వీరభోజాచార్యుడు భార్య వీరపాపమాంబతో సంతానాభిలాషి

యయి తీర్థాభిగమనంబు చేయుచు దైవికముగా నత్రిమహాముని యాశ్రమంబు చేరుకొనిరి. అమ్మహాముని తన వద్ద పెరుగుచున్న నా బిడ్డను వారి కొసంగెను.

వారు మహానందముతో నా బిడ్డను గైకొని స్వగ్రామమున కరుదెంచి, ఆ బిడ్డకు వీరంబొట్లయ్య అను నామంబిడి పెంచుచుండిరి. వారా బాలుని యేడవ యేట గురువు చెంత చేర్చిరి. మేధావి యగు నా బాలుడు పదునారేండ్లకే సర్వశాస్త్ర పారంగతుడయ్యెను.

కొంత కాలమునకు వీరభోజాచార్యుడు దివంగతుడయ్యెను వీరపాపమాంబ భర్తతో సహగమన మాచరింపక బిడ్డను సంరక్షించు చుండెను. కొన్నాళ్ళు గతించిన పిమ్మట వీరంబొట్లయ్య పుణ్యతీర్థాభి లాషియయి తల్లి సెలవడిగెను. వీరపాపమాంబ పలుకులను ఈ కవి యెంత కరుణాతరంగిత చిత్తముతో మధురమార్దవముగా రచించెనో చవి చూడుడు.

“పతి దేవుతోడబోవ-గతి నీకు నెవ్వరనుచు
బ్రతికితిని నిన్నువలన-వెతలంద జేయకయ్యా!
పాపాగ్ని మతమునకును-ప్రభుడవౌదనుచునుంటి
ఈ పగిది జేతువనుచు-ఏ నెఱుగలేకపోతి

సరియైన కన్య నరసి-పరిణయముజేసి నీకు
మురిపెమున నుండ మీరు-ముదమంద దలచినాను
నీపైన నాశలెన్నో-నిలబెట్టుకొంటి తనయా?
నా యాశలన్ని ద్రోసి-నను గుందజేయదగునా?”

తల్లి యనుజ్ఞ తీసికొని తీర్థయాత్రలు చేయుచు “బనగానపల్లె” చేరుకొని గరిమరెడ్డి అచ్చమాంబగారి యింట పసుల కాపరియై కొంత కాలముండి, అట నుండి కడప జిల్లా బద్వేలు తాలూకా కందిమల్లయ్య

పల్లెలో వడ్రంగము చేయుచు జీవయాత్ర సాగించుచుండెను. ఆ సమయమున "పెదకొమర్ల" గ్రామమందలి శివకోటయ్య కుమార్తె గోవిందమాంబను వివాహమాడెను. ఆ దంపతులకు సిద్దలింగయ్య, గోవిందాచార్యులు, శివరామయ్య, పోతులూరయ్య, ఓంకారయ్య అను కుమారులును, వీరనారాయణమ్మ అను పుత్రికయు గలిగిరి.

కానీ వీరు అచ్చమాంబగారి ప్రాపున నుండి నప్పటి నుండియే కాలజ్ఞాన తత్వముల రచించుచుండిరి. అప్పటికే శ్రీ వీరబ్రహ్మేంద్రుల వారి పేరు తెలుగు నేల నాలుగు చెరగులకు వ్యాపించెను. వీరెన్నియో మహాద్భుత కార్యము లొనరించినట్లు వారి చరిత్ర చెప్పుచున్నది.

వీరికాలజ్ఞానముల రీతి ననుకరించి యీ గ్రంథమున వ్రాయబడిన కొన్నింటి నిందు పొందు పరచుచున్నాను. వీరి శైలి కడుంగడు రమణీయమని చెప్పక తప్పదు.

"వావివరుసలను దప్పి నడచెదరు-పరుల సొమ్ములకు ప్రాకులాడెదరు
చోరరోగములు, నుపద్రవంబులు-ఘోరాగ్ని భయంబులు నధికంబగు
అందని కోర్కెల కట్టులు చాతురు-అతి పాపంబుల నాచరించెదరు
దురాశ చేతను, భ్రమల చేతను-పరకాంతావ్యామోహము చేతను
విరివిగ ద్రవ్యము కొల్లలాడుచును-దరిద్రులై చెడిపోదురు జనములు
చోళమండలము నష్టంబగును-శుభ శిల్పంబులు కండలు గ్రక్కును
చాల గద్ద లా కండల దినుటకుకు వాలి తూలుచును గుంపుగ జచ్చును"

వీరి కాలజ్ఞానములు ఆనాటికే పరిసర గ్రామాదుల యందు ప్రచారము నందుట వలన వీరి యొద్ద చాలమంది శిష్యులు చేరిరి. వారిలో ప్రసిద్ధుడు సిద్దయ్య. ఈ శిష్యుడు గురువుగారగు శ్రీ వీరబ్రహ్మముగారి చెంత కరుగుదెంచి—

"సర్వస్వమును వీడి మీ చరణసాన్నిధ్యంబున నుండదలంచితి
ఉర్విలోన మీరె నాకంతటి కున్న యట్టి యాధారభూతులన
అంత స్వామి సిద్ధయ్యగారితో ననియె నీదు తలిదండ్రులెవ్వారు?
ఇంతకు నీ కుల మెయ్యది? నీ యూరేది? తెల్పుమన నతడు
దయామయా! 'ముడుమాల'నాది-ఆదంబి-పీరుసాహెబు తలిదండ్రులు
నయగుణ!దూదేకుల కులజుడ, ధనమ్ము తనువు భోగము లస్థిరమని
తలచి, మీ పాదసేవచేసి నే తరించుటకు మీ సన్నిధి జేరితి"

ఇట్లు ఈ గ్రంథ మంతయు యతులు తొలంగనీక, ప్రాసభంగము రానీక, యీ సుందర గేయ రచనసాగినది. కథనంతయు గేయ రూపమున మలచుట అలతియైన పనిగాదు. విపుల ప్రచారముననున్న పాటల ననుసరించి కాలజ్ఞానముల వ్రాయుట కళావాణికి యొక క్రొం గ్రొత్త భూషణము నలంకరించుటయినది. ఇట్టి పూజనీయ గురుచరిత్ర వ్రాసిన శ్రీ చిరువెళ్ల సుబ్బరామయ్యను అభినందించుచున్నాడను.

చిరువెళ్ల శరధి చంద్రుని
వరవీరబ్రహ్మ చరిత వ్రాసిన ప్రోఢన్
ధర సుబ్బరామ నాముని
శరనిధిశయనుండు బ్రోచు సౌఖ్యమ్ములతోన్

20-7-91 బుధజన విధేయుడు

నెల్లూరు-2 **విద్వాన్ జక్కా వేంకటేశ్వరుడు**

# విన్నపము

ఈ లోకమున ధర్మము నశించి అధర్మము పెచ్చు పెరిగినపుడు యుగ యుగంబున, భగవంతుని యాదేశంబున కొందఱు మహాత్ములు భువి నవతరించి దుష్టశిక్షణ-శిష్టరక్షణ కావించి లోకకల్యాణము నొనర్చు చుందురని వేదముల మూలమున మనకు తెలియుచున్నది. అట్టి మహామనీషుల కోవకు చెందినవారే శ్రీ మద్విరాట్ పోతులూరి వీర బ్రహ్మేంద్రస్వాములవారు. ఆయన సంఘ సంస్కర్త. కుల మత వ్యత్యాసాది భేదరహితుడు. సర్వ మానవ సమానత్వ, సముచిత, ప్రభోదాత్మక సాధుహిత భూత దయాభిమాని. నిస్వార్థ, నిజతత్త్వ నిష్కళంక నిగమార్థ నిర్వికార జ్ఞానతేజో విరాజిత మహిమాన్వితుండు. ఎన్నో యేండ్లకు ముందుగా జరుగబోవు భవిష్యత్కాల విషయముల నెఱింగించిన యేకైక జ్యోతిష్యుడు. అంతటి మహాపురుషుని చరిత్ర మును వ్రాయ బూనుట నా బోటి యల్పజ్ఞునకు కడు దుస్సాధ్యమైన పని. ఐనను "చెఱకునకు వంకబోయిన చెడునె తీపి" అను నార్యోక్తి ననుసరించి నాకు వారిపై గల అపారమైన భక్తి భావనయే నన్నీ కావ్య రచనకు పురికొల్పినది.

నేను కవినిగాను. కవితాభంగిమము లెట్టివో తెలియని వాడను. దైవభక్తుడను, నా గురుదేవుడు బహు గ్రంథకర్త, అద్యత నాంధ్ర మహాకవుల ప్రశంసల నందుకొన్న మధురకవి బిరుదాంకితులు విద్వాన్ శ్రీ జక్కా వేంకటేశ్వరుని సహాయమే యీ గ్రంథ రచనకు మూల కారణము. నా సంకల్పం బెఱించినంతనే నిరుత్సాహపఱచక, నా బోటి యల్పజ్ఞుని ప్రయత్నమున జోక్యము కలుగజేసికొనుట తనయున్నతికి భంగమని తలంపక, మధుర వాత్సల్యముతో సంతోషమున నంగీకరించి, శ్రమయని తలంపక, దోషముల తొలగించి పరిష్క రించిన నా గురువర్యుని పాదపద్మముల కంజలించు చున్నాడను.

నా ప్రియమిత్రుడు, శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారి నిత్యారాధకుడు శ్రీ తిరువాయిపాటి నరసయ్యగారి ప్రేరణయే యీ వీరబ్రహ్మముగారి చరిత్ర రచనకు నాంది.

దీనిని కార్యరూపమున పయనింపవలసినదిగా నన్నాదేశించి అన్నివిధముల నా కండదండయై నిలచిన వీరికి నా హృదయపూర్వక ధన్యవాదము లర్పించుచున్నాను.

నెల్లూరు పట్టణ వాస్తవ్యులు ప్రముఖ న్యాయవాదులు, సుప్రసిద్ధ సాహిత్యవేత్తలు, రసజ్ఞులునైన శ్రీ మాడభూషి సుందరాచార్యుల వారిని దర్శించుటకయి మా గురువుగారు పోవుచున్నప్పుడు వారి వెంట నేను పోయితిని. అప్పుడు మాటల సందర్భమున మా గురుండీ కావ్య రచన విషయము శ్రీ ఆచార్యుల వారికి తెలుప, వారు సంతసించి నన్నుగని, నాయనా! నీవు కావింపబోవు రచన పశువుల కాపరులకైన యర్థమయ్యే శైలిలో వ్రాయవలసినదిగా నన్నాదేశించిరి. వారి యాశయము నాకు శిరోధార్యంబయ్యెను. పవిత్రమైన సలహా నొసంగి ప్రోత్సహించిన ఆచార్యులవారికి నా హృదయపూర్వక నమోవాకములు.

నా రచన యందెట్టి లోపములున్నను మన్నింప రసిక లోకమును వేడుకొనుచున్నాడను.

బుధజన విధేయుడు

**చిరువెళ్ల సుబ్బరామయ్య**



# ఈ కావ్య ముద్రణకు సహకరించిన దాతలు

| | | |
|---|---|---|
| శ్రీ మన్నెపల్లి యానాదయ్యగారు | రూ. | 600-00 |
| శ్రీ జంధ్యం రమణయ్యగారు E. O. ఎండోమెంటు డిపార్టుమెంటు | రూ. | 268-00 |
| ఒకసాహిత్యాభిలాషి | రూ. | 200-00 |
| శ్రీ మన్నెపల్లి వేంకటాద్రి M.A., B.Ed., గారు | రూ. | 250-00 |
| శ్రీమతి మన్నెపల్లి సరోజనమ్మగారు | రూ. | 250-00 |
| శ్రీ జంధ్యం యశోదమ్మ భర్త గంగయ్యగారి జ్ఞాపకార్థం | రూ. | 116-00 |
| శ్రీ చేపూరు రమణమ్మగారు | రూ. | 116-00 |
| శ్రీ బండి రమణారెడ్డిగారు నిర్మలా కంట్రాక్టరు | రూ. | 116-00 |
| శ్రీ బండి కొండారెడ్డిగారు నిర్మల వక్కపొడి | రూ. | 116-00 |
| శ్రీ బండి రామస్వామిరెడ్డిగారు నిర్మల కాఫీపొడి | రూ. | 116-00 |
| శ్రీ ఆర్. రామచంద్రయ్యనాయుడుగారు | రూ. | 116-00 |
| శ్రీ కారెంపూడి రామిరెడ్డిగారు - అలగానిపాడు | రూ. | 116-00 |
| శ్రీ పొట్టేటి వేంకటస్వామిగారు | రూ. | 116-00 |
| శ్రీ బిరుదవోలు చంద్రశేఖరరెడ్డిగారు అలగానిపాడు | రూ. | 58-00 |
| శ్రీ వంగాలి పెద్దిరెడ్డిగారు | రూ. | 58-00 |
| శ్రీ గున్నం ఆదెపరెడ్డిగారు | రూ. | 58-00 |
| శ్రీ కొండా సత్యనారాయ గుప్తగారు | రూ. | 58-00 |
| శ్రీ వాయుగుండ్ల చెంచునారాయణరావుగారు | రూ, | 58-00 |
| శ్రీ చల్లగుండ్ల రామచంద్రయ్యగారు | రూ. | 58-00 |

# శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్ర

## -: ప్రథమాశ్వాసము :-

హిందుస్థాని తోడి - ఆదితాళం

వినండి జనులారా మదిగనండి నరులారా ఘనుండు వీరబ్రహ్మచరితమును ॥వి

మనోరంజితము, మంజులాస్పదము మానవాతీత మహిమాస్పదమ్ము ॥వి

భూతలమున భరతావని యందున పుణ్యస్థలము బ్రహ్మాండపురంబున
ఖ్యాతిగనిన విశ్వబ్రాహ్మణకుల కాపురంబు గలదందగణ్యమై ॥వి

పరిపూర్ణాచార్యుం డను నాతడు ప్రకృతాంబయను మహాసాధ్వియును
సరిదంపతులు, సద్గుణసంపన్నులు సర్వేశ్వరు పాదాభిసేవితులు ॥వి

ఆదంపతులకు సంతతిలేమిని నాసర్వేశ్వరు వేడుచు మనమున
పాదయాత్ర తీర్థాభిలాషులయి పరచిరొక్క శుభ ముహూర్త వేళను ॥వి

వారణాశికిం జని విశ్వేశుని జేరి మొక్కులిడి వరాలందుకొని
కూరిమితో నా దేవుని దరినే కొన్నాళ్లుండి, తిరిగి పయనించి
క్షేత్రములను నచటచట గాంచుచును జేరి సరస్వతి నదీతీరమును
పూర్ణగర్భవతి ప్రకృతాంబ గనె, పుత్రునొకని తేజోమయరూపుని ॥వి

అంతలోన పరిపూర్ణాచార్యు డస్తమించి సర్వేశుని జేరెను
కాంత దుఃఖవారాశిని మున్గి తనకాంతునకై విలపించు చుండెనట.
అంతలోన నానదీతీరమున కత్రిమహాముని యచటికి రాగా
స్వాంత మలర తన పసికందుని యా స్వామిచేతులందుంచి, యంజలిడి
వరపుత్రుడు, వీనిని గాపాడు మటంచును గత విషయంబులం దెలిపి
పరమసాధ్వి సహగమనము జేసియు దరిసె భర్తతో పరమపదమ్మును ॥వి

మన్ననతో శివునాజ్ఞగ గైకొని మౌని యరిగి తన నిజాశ్రమంబున
కన్నసుతుని బలె గోక్షీరంబుల కరుణ మీర గాపాడుచు నుండెనట.
ఇది యిట్లుండగ నందికొండ పురమందు విశ్వబ్రాహ్మణ కులోద్భవుడు
సదయుడు పాపాఘ్ని మఠాధ్యక్షుడు సదసద్వివేక గుణసంపన్నుడు
వీరభోజయాచార్యుండనగను విలసిల్లుచు తనసహచారిణియౌ
వీరపాపమాంబని యెడు సాధ్వితో యింపు దనర వసియించుచుండెను

వారికి బిడ్డలు లేకపోవుటచే వాపోవుచు సంతాన ప్రాప్తికై
క్షేత్రరాజములు సేవించుకొనుచు చేరిరి యత్రిమునీంద్రు కుటీరము
ఆ పుణ్యాత్ముడు వారి గాథ విని యానందంబున తను బెంచెడి యా
పాపని కథ వినిపించి, వారలకు ప్రసాదించె నద్బాలుని నాతడు

బ్రహ్మానందము నొందుచు వారలు పరమాత్ముడె తమ కొసంగె ననుకొని
అమ్మునీంద్రునకు ప్రణామంబు లిడి యరుగుందెచిరి తమ నివాసగేహము
వీరభోజయాచార్యదంపతులు గారవమున నా బాలుని బెంచుచు
వీరబొట్లయ్యను నామంబిడి విలసిల్లిరి యానందమునందుచు

వీరబొట్లయ్యను తలిదండ్రులు విడిచిరి బడిలో నేడవ యేడున
మీరి యందలి బాలుర మేటిగ మిక్కిలి గణనకుసెక్కెన్
పదునాల్గేడుల ప్రాయంబుననే చదివె సర్వ వేదాంత శాస్త్రములు
మది నుప్పొంగగ తల్లిదండ్రులకు మహానంద మొనగూర్చుచుండెనట
అంతలోనె నా వీరభోజ ఆచార్యుడు పరమపదించె భార్య య
త్యంత చింతనావృతయై పొరలుచు చెంతనున్నతన బాలుని గన్గొని
వాని రక్షణార్థము సహగమనము మాని, పతికి పరలోకక్రియ లొసగి
దీనబాంధవుని దలచుచు బాలుని ప్రాణముగా గాపాడుచునుండెను

అంత తల్లితో వీరంబొట్లయ యనియె నిట్లు తల్లీ! క్షేత్రంబుల
వింతలన్ని దిలకించి వత్తు సెలవిమ్మనంగ నాయమ చింతితయై

## సింధుభైరవిరాగం - తిశ్రయేక తాళం

నినుబాసి బ్రతుకగలనా? తనయా! ఒక నిముసమైనా!
నిను జూచుకొనుచు నేనూ మనియుంటి నింతవరకూ
నను వీడిపోవ నీకు మనసెటుల గల్గెనయ్యా!
పతిదేవు తోడ బోవ, గతి నీకు నెవ్వరనుచూ
బ్రతికితిని నిన్ను దలచి, వెతలందజేయకుమా! ॥ని

పాపాగ్ని మఠమునకునూ ప్రభుడ వౌదనుచు నుంటి
ఈ పగిది జేతువనుచూ ఏ నెఱుగ లేకపోతీ॥
సరియైన కన్య నరసి, పరిణయము జేసి నీకూ
మురిపెముగ నుండ మీరు ముదమంద దలచినాను ॥ని

నీ పైన నాశలెన్నో నిలబెట్టుకొంటి తనయా!
నా యాసలన్ని ద్రోసి, నను గుందచేయ దగునా? ॥ని

అని యీ విధమున సుతునెడ బాటున నాయమ కడుచింతితయై యుండగ
గని యా బాలుడు వీరంబొల్లయు, కడు వినయమ్ముగ తల్లికి నిట్లనె,
జననీ! యెందులకీ యీవేదన, సరిగాదిది నిను వంటి వారలకు
వినలేదా? యిది యంతయు భ్రమ యని వేదాంతుల వచనంబు లెప్పుడు ॥ని

## సింధుభైరవి రాగం - ఆదితాళం

ఎందుకు వగచెదవమ్మా! బంధములివి గనుమమ్మా! జననీ!
బంధములివి గనుమమ్మా! ॥ఎం
మోహాకుల సంసారజలధిలో మునుగుచు తేలుచు నీనరులు
ఇదంతయు నిజమని మదిని దలంచుచు దరి గానక చెడిపోయేరూ ॥ఎం

నా బిడ్డలు, నా సంసారంబని నా సంపదలని మురిసేరూ
అంతా వట్టిది. భ్రమయే కానీ యంటదు జీవున కేదియునూ॥
తలంచి చూచిన నంతా మోసము, తల్లీ! జగమే మాయనాటకము
ఫలంబు దక్కునె? యీ వ్యామోహపు బంధములను సడలింపక యున్నను ॥ఎం

మలమూత్రపు దుర్గంధ పూరితము మాంస రుధిరముల యెముకల గూడిది
కలుగ నేటికి దేహముపై భ్రమ? కనవే సత్యము మాయమ్మా!
నమ్మగరానిది, యెపుడో, యెచటనో, యే విధముననో నాశము జెందును
అమ్మా! ప్రాణమె యాశారహితమని, నమ్ముము నిదియే శాశ్వతమైనది ॥ఎం

సంసారమె శాశ్వతమని నమ్ముచు హింసాకృతులౌ మానవులూ
అహంకార మమకారాదులచే, నన్యాయార్జన జేయుచునూ
కాలమంతయును వృథా జేసికొని కడకా కాలుని దరిజేరి
నరక యాతనల బడి కొన్నాళ్లట, తిరిగి హీనజన్మంబు లెత్తెదరు ॥ఎం

అని పల్కిన యా బాలుని మాటల కాయము విస్మయమందీ,
మనమున నీతడు సామాన్యుడు గాడని తలచెను ముదమందీ,
అప్పుడు బాలుడు తల్లితో ననియె నింకను నెంతో యున్నది
చెప్పెద విను మీ దేహోత్పత్తి విశేషము లిప్పుడు సావధానముగ ॥వి

మనుజులు భుజించు నన్నపానముల మదము గల్గి స్త్రీపురుషులు గలియగ
శుక్ల శోణితము లేకంబై, బహు శుద్ధిగ నరపది దినాల్లుండి యట
పది దినంబులకు కోడిగ్రుడ్డు వలె పరగుచు నుండియును నెలకు గట్టిపడి
పదిలంబుగ నేర్పడు రెండునెలలకును బాహులు పదములు ప్రారంభంబగు ॥వి

నెలలు మూడరుగ కడుపును నాలుగు నెలలకు నిరు పార్శ్వంబులుం గలిగి
నెలలైదునకు కాళ్లు చేతులకు నెగడును పదపడి వ్రేళ్లు.
ఆరవ నెల నాశిక, కర్ణంబులు, నవయువ రంధ్రము లేర్పడియూ
ఆరయ నేడవ నెలలో దేహంబున నమరు కొనును జీవుండు.
అప్పుడు పిండము నూర్ధ్వముఖంబునునై మాయ యనెడి పొరచే
గప్పబడి యుండు తొడుగు మాదిరిగ నాపై దేహము నందు ॥వి

ఎనిమిది - తొమ్మిది నెలలకు గల్గును తన పూర్వజ్ఞానమ్ము
అనుకొను నప్పుడు మలమూత్రంబుల గనలుచు తనలో తాను
అయ్యో! యెంతటి యవివేకిని, నేనన్నియు పాపములే యొనర్చితిని
చేయరాని పనులెన్నో జేసి నే చెఱచితి నెందఱి కుటుంబాలనో

నమ్మక ద్రోహము చేసి కొందఱిని నాశమొనర్చితి స్వార్థచింతనను
నమ్మికొంటి నీ భోగభాగ్యములు నావి నావి యని తలచి,
ధనార్జనమునకు జీవితమంతయు ధారబోసితినె గానీ
కనంగలేకనె పోతి, దైవహిత కార్యంబుల నేనెపుడున్
ఇమ్మహిలో నొక మంచి పని చేయు టెరుగ నైతి నయ్యయ్యో!!
నమ్మి చెడితి మదమాత్సర్యంబుల నాశంబైతిని కడకు ॥వి

ఈ దుర్గంధపు నరకకూపమున నెనసి బైటపడినంత
ఏ దుర్గుణములు లేక మనెద, సర్వేశుని పదముల చెంత
ఈ మూత్రద్వారమ్మున నుండి నేనెప్పుడు వెడలుదునా యని యుండగ
ఆ మాత బాధపడ నా నిసు గప్పుడు నల్లిన బయటకు వచ్చి "క్యావు" మను
అప్పుడు కలినీళ్లను జల్లెద రా బిడ్డ పయిన్ నచ్చటి వారు,
తప్పక యప్పుడు పూర్వజన్మస్థితి తలపునకు రాదు శిశువునకున్
ఎఱుగ వలసినది యింకొకటున్నది, యింకను దెల్పెద వినవమ్మా!
జరుగుచున్న యీ సృష్టిభేదములు చాల విచిత్రము తల్లీ!
పురుష శుక్లమది యెక్కువైనపుడు పురుషశిశువు జన్మించు
తరుణి శోణితం బధికమైనపుడు తరుణి గానె జన్మించు
రెండును సమమైనప్పుడు నపుంసకుండుగ బుట్టు నిజంబు
వెండియు దెల్పెద సాంఖ్యంబును వినవే జననీ! యని బల్కెన్ ॥వి

ఆకాశము పృథివీ జలంబులును నగ్ని, వాయువులు నైదున్
అంతఃకరణము లనునవి నాలుగు నాకాశముచే గల్గెన్
దాన పంచప్రాణంబులు వాయువు దరిసె నింక తెలియంగన్
జ్ఞానేంద్రియములు, అగ్ని, భూతముచె గల్గెను పంచన్మాత్రలు జలముచె
కర్మేంద్రియములు పృథివి, భూతముచె గల్గె ననుచు తామరియు
స్థూల సూక్ష్మ కారణ శరీరములు చూడ త్రిగుణములు అరిషడ్వర్గలు
సర్వేంద్రియ తత్త్వంబులచే నీ శరీరమ్ము నేర్పాటౌ చుండును ॥వి

కాన నింద్రియ వికారము లంటక కనుగొని జీవుడె శాశ్వత మనుకొని
మానక యా పరబ్రహ్మము నెప్పుడు మది నెఱుగుటయే మోక్షదాయకము
అని పల్కిన యా బాలుని మాట కానందంబున తజ్జనని
తనయా! నాకా పరబ్రహ్మమును గనెడి మార్గమును జూపుమని యడుగ
అప్పుడు నాతండానందంబున ననియె తల్లికిన్ నిటుల
చెప్పెద నిక "తారకయోగంబు"ను శ్రద్ధగ వినుమో జననీ!
పద్మాసనుడై, ముకుళితాక్షుడై మనసును పరుగులిడనీక,
పద్మాసనునిన్ భావమందునిచి, భద్రత నేకాగ్రతతోన్
నేత్రద్వయ దృష్టిని నేకముగా నిల్పి, యధోముఖంబునను
నాసికంబుపై చూపును చక్కగ నడుపుచు నిర్మల భ్రూమధ్యమందు
నాదబిందుకళాత్మకంబునగు నవ్యమాణిక్యమణుల
కోటిసూర్యతేజోమయమై వెలుగొందు నా పరంజ్యోతి
అదియే "బ్రహ్మము" అదియే శాశ్వత మదియే పరమపథమ్ము
ముదమున నయ్యానంద వారిధిని మున్గి తరింపుము తల్లీ!
అని యా బిడ్డడు సాంఖ్యతారకములను నుడివిన నాతల్లి,
విని, యానంద తరంగడోలికల మని, మది దిగ్భ్రమనంది.
అజ్ఞానంబున నీతడు నా కొడుకని తలంచితిని గానీ
ప్రజ్ఞానిధి కారణజన్ముండని భావింపగ లేనైతీ

అని తలంచి యా తల్లి కుమారుని తన యొడిలో గూర్చుండ బెట్టుకొని
తనువు పరవశమునొంద ముద్దాడి తగ ముంగురులను దువ్వుచు నిట్లనె
తనయా! మా పూర్వపుణ్యవశమున జనియించినావు మా గర్భంబున
ఘనుడ వీవు నిన్నే విధంబుగా గొనియాడగలము తండ్రీ! ఇంకను
అత్రిమునీంద్రుడు చెప్పె నీదు చారిత్రమంత నా దినము
పుత్రభ్రాంతిలో బడి మఱచితి నీ పూర్వకథాసుచరిత్ర

కావున తండ్రీ! యిక నాకుండెడు గత సందియమును గూడ
భావయుక్తముగ దీర్చి బ్రోవుమని బల్కుచు నిట్లనె నామె

పరిపూర్ణంబుగ బోధించియు నా పరమాత్ముని దయనంద
ఎరిగింపుము నిక "ఐక్యసంధానంబ"నుచు వేడ
బాలుండప్పుడు తల్లి కోరికకు పరమానందంబొంది
ఆలకింపు పరిపూర్ణభావమని యాయమ కిట్టుల బల్కె

మనసేకాగ్రత నిల్పి, బాహ్యమును మఱచి యచలస్థితి నొంది
మనమున సర్వము బ్రహ్మమయంబని మది ప్రణవాక్షరి నంది
అర్ధ నిమీలిత నేత్రద్వయమున నా బ్రహ్మంబును గాంచి
సిద్ధి నొందుమని వీరంబొట్లయ చెప్పగ నాయమ మహానందముగ
మహానుభావా! దైవతేజ! నీ మహత్మ్యంబు గనలేక యుందనుక
మోహభ్రాంతిని బడి కుమారునిగ యూహ చేత గనలేక పోతి నిను

కనుక నన్ను నీ భక్తురాలుగను కటాక్షింపు మని కండ్లు మూసికొని
వినతి జేయు తల్లిని కరుణించియు వీరంబొట్లయ తల్లికి నాదట
విశ్వరూప సందర్శన చేయ విస్మయానందతన్మయాంగియై
కొంత తడవునకు తెప్పరిల్లి యత్యంత భక్తితో పుత్రునింగాంచి
అండపిండబ్రహ్మాండ భాండముల నన్నియు గాంచితి నీలో
తండ్రీ! యిక నీ విశ్వరూపమును తడయక చాలింపుము యని వేడ,
అంతట బాలుడు యధారూపమున గనుపింపగ నా తల్లి
స్వాంత మలర చేతులు జోడించియు చాలగ నుతించెనపుడు

## ద్వితీయాశ్వాసము

తల్లి సెలవంది వీరంబొట్లయ తగ దేశాటనజేయ
యుల్లమలర దేహంబుపై నున్న యెల్ల తొడవులను దీసి
తనువున విభూతిరేఖలన్ దీర్చి తగ రుద్రాక్షపుమాలల దాల్చి
పొనుపడ కాషాయాంబరంబులను పొలుపుగ ధరించి బాలకుడు
దండకమండలముల నొక కేలను దాల్చి రెండవ కరంబునను
నిండు జపమాలనూని కదలె, తా నిశ్చల స్థితి, పశ్చిమాభిముఖుడై

మహానంది, యోంకారంబులను మహిత శ్రీశైల పుణ్యక్షేత్రముల
విహరించుచు నందందు భక్తులకు వేదాంతోపన్యాసము లిచ్చుచు
దక్షిణాభిముఖుడై యేతెంచియు ద్వారవతి, మధుర, శ్రీరంగంబును
చిదంబరము, రామేశ్వరంబు, గయ మొదలగు క్షేత్రములను దర్శించుచు
అచ్చటచట భక్తాళిని గాంచుచు నద్వైతంబును బోధ జేయుచును
నిశ్చలమతులౌ మహాజ్ఞానులతో నెయ్యము సల్పుచు నుత్తరముఖుడై
హరిహరపురమను నొక గ్రామంబున కరిగి యందు నొక నిర్జన స్థలమున
పరమపావనుడు గూర్చొని సూర్యోపాసనపరుడై యుండె ॥వి

కాశీపురమండల పాలకుడును, పరమేశ్వరాంశ సంభూతుండును
వాసి గల్గినటువంటి ఆనందభైరవయోగి యనంబడు నాతడు
కాశిపట్టణము నుండి వేటకై గదలి సఖులతో మహారణ్యముల
ఆస దీర వేటాడుచు నందఱు నందందున సెలయేళ్ల నీదుచు
ప్రొద్దుబుచ్చి నా రాత్రి యట నుండ బుద్ధి గల్గి యొక మహావృక్షంబు
వద్ద కేగి యట బరుండి యందఱు నిద్దురించి మరునాడు
ప్రొద్దుననే దినచర్యలం గడపి పెద్దపెద్ద మృగములను వేటాడి
మధ్యాహ్నమునకు నొక సరోవరము వద్ద మఱ్ఱివృక్షంబునుం గాంచి,
ఎండ వేడిమికి తాళలేక యపుడందఱు యా వటవృక్షమును జేరి
యుండి విశ్రాంతి దీసికొనుచు నొగి సంభాషణలందు నుండి రట ॥వి

అంతట నొక గోవా సరస్సునకు నరుదెంచెను నీరంబు ద్రావుటకు
పంతగించి యొక బెబ్బులి ధేనువుపై బడనుండగ రాజు గమనించి
నా యావును గాపాడ నెంచియు అమ్మును వింటను సంధించి
ఆ వ్యాఘ్రముపై వేయ గురితప్పి యది యావునకుం దగుల నేలబడి
ఆ ధేనువు 'నంబా'యని యఱచుచు నాక్రందించుచు ప్రాణముల్ విడిచె. ॥వి
ఆ దృశ్యము గని రాజు నిర్విణ్ణుడై యుండగ సఖు లతని దరికేగి
స్పృహ గల్గించియు కారణం బడుగ జరిగిన దంతయు జెప్పి వారలకు
మహాపాపమును జేసినాననుచు మరిమరి దుఃఖము జెందుచు నాతడు
వారల దోడ్కొని పోయి యావు కడ వాపోవుచు వారల కిట్లనియెన్ ॥వి

దారుణ కర్మము జేసినాడ, నీ ఘోరపాపమును బాపుకొనుటకై
పుణ్యక్షేత్రముల సేవించుకొనుచు, పూజనీయులౌ తాపసోత్తముల
పుణ్యబోధలను వినుచు వారి పదములకు మ్రొక్కుచును దీవనలందుచు
కొంతకాల మటులుండి వచ్చెదను సొంత నిలయమగు వారణాశికిన్
చింతలుడిగి యెదురేమియు జెప్పకను స్వంత స్థలముల కేగుండనియెను
ఈ సంగతి మా తల్లిదండ్రులకు నెరిగింపుండని వారల బంపి ॥వి

ఆ సమయంబున నాతడు గదలియు ననేక క్షేత్రములను సేవించుచు
అందందును నిష్ఠాగరిష్ఠులౌ నచల తపోధనులను దర్శించుచు
ముందుగ వారి పదద్వయంబులకు మ్రొక్కి వారి దయ నందుచు నటుపై
హరిహరపురంబునకు జేరియు తా నచటి క్షేత్రముల సేవించుకొనుచు
మరియు నిర్జన స్థలమున గూర్చొని మహాదీక్షతో నున్న తేజస్వి
వీరంబొట్లయ్యను దర్శించియు విస్మయంబొంది, ప్రణామంబులిడి
చేరువనే గూర్చుండియుండె, నా క్షితినాథుడు ముకుళితహస్తుండై ॥వి

అంతట వీరప్పయ్యాచార్యుండా నిష్ట నుండి మేల్కాంచి,
చెంతనే ముకుళితహస్తుడై యున్న క్షితినాథుని దిలకించి,
ఎవ్వడవయ్యా! నీవు? దీనుండవై యిటు రా గతమేమి?
అవ్విషయంబుల నన్ని దెల్పుమన నప్పుడు భైరవయోగి
స్వామీ! నే కాశీపుర మేలెడి క్షత్రియ సంయమి సుతుడ,
నీమము దప్పక ప్రజాపాలనము నీతిగ జేయుచునుంటి
ఇచ్ఛగల్గి యొకనాడు మిత్రులతో నేగితి వేటకు కాననంబునకు
అచ్చట జరిగిన సంగతి నంతయు నా మహనీయున కెరిగించె ॥వి

పాప పరిహరణంబునకై నే బయలుదేరి క్షేత్రములను గాంచుచు,
తాపసోత్తముల సందర్శించుచు తమ సన్నిధికిం జేరుకొంటి నిట
తాపసేంద్ర! మిము గాంచి నంతటనె దైవసముడవని దోచె నా మదికి
పాపము నా యీ కర్మం బనుచును పదములపై బడి వేడ
ఆచార్యులు దివ్యజ్ఞానంబున నాతని విషయం బెరిగి
చూచి భూపతిని వాని కిట్లనియె క్షోణినృపాలా! నీవు

కారణజన్ముండవు, సుజ్ఞానివి, కావున నెఱిగితి నీ చరితంబు
తీరదు చేసిన పాపము నెంతటి వారికైనను అనుభవింపకను
కావున నేనిట కొన్ని రోజులిక గడపి కందిమల్లాయపల్లెకున్
బోవనున్నాడ గాన, నీవు నిక పొమ్ము కొలది కాలంబునకున్
మహమ్మదీయ కులంబునం బుట్టి మచ్ఛిష్యాగ్రణివై చరించుచును
మహాజ్ఞానివై లోకంబునకును మహోపకారమ్మును గావింపుము

అద్దాని వలన తావక గోహత్యాపాతకమును నశించియును
సిద్ధుడవై వెలుగొంది లోకమున సిద్ధినొంది దివ్యత్వమందెదవు
అని యా నృపునకు మహామంత్రమును అనుగ్రహించియు మరియు
అనయము నియ్యది నిశ్చల బుద్ధితో మననము జేసికొనుమనుచు
ఆ రాజును దీవించి, నీవు నిక నరుగుము నీ పురి కనిన
ఆ రాజేంద్రుడు స్వామి పాదముల నంటి మ్రొక్కులిడి కదలెను కాశికి

అచ్చట నుండియు వీరప్పయ్యాచార్యు లపుడు పయనించి
ఇచ్చ గల్గి బనగానిపల్లెకున్ నేగి ప్రొద్దువోవంగ
గరిమరెడ్డి యచ్చమ్మ యను నామె కలదు నా గ్రామమందు
విరివిగాను ధనధాన్యసంపదల విలసిల్లెడు నాయమ్మ
ఆమె యింటి వాకిలి ముంగిట నొక యరుగుపై జేరి యపుడు
ఆ మహనీయుడు బరుండియుండెను, ఆ రాత్రి వేగ నచట
మరుసటి రోజున నుదయంబుననే మహలు డిగ్గి యచ్చమ్మ
అరుగు మీద తల వాలిచి యుండెడి నమ్మహనీయుని గాంచి
ఈతండెవ్వరో? మహానుభావుని భాతి నుండె ననుకొనుచు
ఆతని దగ్గఱ కేగి వినయమున నయ్యా! మీరెవరనుచు,
ఇట నుండుటకును కారణంబేమి? యెఱిగింపుడు మీ వివరంబులునన
అటులనే యనుచు నా మహనీయుం డామెతో నిట్టుల ననియెన్

అమ్మా! చెప్పెద బ్రహ్మాండపురం బనియెడ గ్రామము మాది
సమ్మతితో నను వీరప్పయ్యాచార్యులందు రండఱును
నా తలిదండ్రు లదెవ్వరో గాని నాకు దెలియ దోయమ్మా!

ఏ తగలాటము లేనివాడ నే నెల్లపు డొంటరివాడ,
అని పల్కుచు తన చరిత్రమంతయు నాయమ్మకు వచియించి
వినయం బొప్పగ మఱియు నిట్లనియె వినుము తల్లీ! నాదగు కోర్కె
మీ గోవుల గాపాడుచు నుండెద మీకిది సమ్మతమైన
ఆ గోక్షీరము తవ్వేడు పట్టెండన్నమిడిన నా కదియే చాలును
అని యా బాలుండనగ అందులకు అచ్చమ్మ సమ్మతించి
వినయంబున నింటిలోనికి రమ్మని విశ్రాంతి స్థలము జూపి
ఆ రోజున శ్రీ స్వాములవారికి నాహారముగా గోక్షీరము నొసంగి
తీరుబడిగ నంతఃపురంబునకు జేరి, పవళించి యిట్లు దలంచెను ॥వి

పదహారేండ్లను నిండనట్టి యీ బాలుని గాంచి నప్పటి నుండియు
ఎదియో తెలియని యనుబంధము నా మదికి దోచె ననుకొనుచు నిదురించె,
మరుసటి దినమున బాలు డావుల మంద దరికి జేరగను
వరుసగ ధేనువు లన్నియు స్వాముల వద్ద మూగి నిలబడియె
ఆ దృశ్యంబును గాంచి అచ్చమ్మ అయోమయస్థితి నొంది
యేదైనను గానిమ్మటంచు తా నేగి గృహంబున కపుడు
రాగిసంకటిని మూటగా గట్టి యోగపురుషునకు దెచ్చి యందించి
సాగనంపె బాలకుని ఆవులను స్వాధీనం బొనరించి ॥వి

అట్టుల బాలుడు నావుల దోలుక యడవి సమీపము నొక చోట
గుట్టగ దోలియు గీతగీచె నా గోవుల చుట్టును నటుపైన
తాను నప్పుడొక తాళవృక్షమ్ము దాపునకు నేగి నిల్వ
ప్రమాణవంగె పిమ్మటను నొక మంచి మట్టను న్నెంచి కోసికొని
అడవి ముండ్ల కొన్నింటి దీసికొని యాదరి రవ్వలకొండను జేరియు
కడు రయమున నొక గుహను జొచ్చి తా కాలజ్ఞానము వ్రాయంబూనెను ॥వి

సాయంకాలమునకు ధేనువులను స్వామి తోలుకొని యింటికి వచ్చుచు
ఆయన వ్రాసెడి కాలజ్ఞానము నచ్చమ్మగారి యింటి ప్రక్కననె
పాడుపడిన యొక గోతిలో వేసి, పైన నొక బండ వైచి యెవ్వరుం
జూడకుండునటు జేయుచుండె ఘనశోభితుండు ననుదినము ॥వి

ఆ విధముగ కొన్నాళ్లు గడువంగ నప్పుర జనులొకనాడా
త్రోవను వచ్చుచు పడుకొనియుండెడు గోవులమందను జూచి
కాపరులెవ్వరు నట లేకుండుట గాంచి యబ్బురమునంది
దాపునకు జేరి వారు గోవులను లేప ప్రయత్నింపగను
కదలక మెదలక నెమరులు వేయుచు మొదవులన్ని యట నుండ
వదలక యెంతయు నదలించినను వృథయై పోవుట కాక
వారికి చూపులు పోయె, వ్యాకులతనంది, ధేనువులు చుట్టునున్నయా
గిరను దాటియు నీవలకు రాగ వారికి చూపులు వచ్చెన్ ॥వి
అచ్చెరువందుచు నీ సంఘటనకు నావు లెవరివో? తెలిసికొని

అచ్చమ్మగారి యింటికిని వారలతి రయమున నేతెంచి
అచ్చట జరిగిన సంగతులన్నియు నాయమ్మకు వినుపింప
అచ్చమ్మగారు వారలం బంపి అది స్వయముగ గననెంచి
మరుదినమున నాచార్యులు మునుపటి మాదిరి నయ్యావులను దోలుకొని
యరుదేరగ, అచ్చమ్మ స్వాములకు నగుపడకుండగ దాగుచు నేగుచు
వెంబడించి యరుదెంచుచు నుండెను, సంబరమున నా దృశ్యము జూడగ
డింభకుని వెనుక పాదచారియై డెందంబున నేమేమొ తలంచుచు
నెప్పటి యట్టుల నా మహనీయుడు నేగె యావులను దోలుకొని
చప్పున చుట్టును గీతగీచి తా చయ్యన నేగియు తాటిచెట్టు కడ
నొప్పుగ నిల్వగ మ్రానువంగె నొక యున్నతంబైన మట్ట గోసికొని
గుప్పిటి నిండుగ ముండ్లనేరుకొని గుహలోనికి జని వ్రాయుచు నుండెను ॥వి

మరుగు నుండి యచ్చమ్మగారు తన్మహత్వమంతయు గాంచి
పరవశించి గుహ వద్దకు నేగియు పరికించె నొదిగియుండి
గుహ యంతయు దేదీప్యమానముగ కోటిరత్నకాంతులతో
బహు విధముల వెలుగొందుచు నుండెడి భాగవతుని దిలకించి
హృదయములోనె నామహనీయుని పదపద్మంబుల దలచి
కదలెను ఇంటికి వీరప్పయ్యకు కనుపింపకనే యపుడు ॥వి

ఇల్లు జేరుకొని స్వామి రాకకై యటునిటు దిరుగుచు పిచ్చిదాని వలె
తల్లడిల్లుచును నేదియు దోపక తలచుచుండె నా ఘనుని
సాయంసమయంబునకు యథావిధి స్వామి గోవుగమి యింటికి రాగనె
ఆ యమ్మ స్వామి పాదంబుల బడి అయ్యో! యెంతటి యజ్ఞానమతిని
ఇన్ని నాళ్లు నీ మహత్వంబు నేనెఱుగలేక కడు మూర్ఖురాలనై
యున్న నన్ను కరుణించి బ్రోవుమో యన్న! యనుచు నావేదన జెందుచు
ఆలకాపరిగ నిన్ నియమించియు చాల దోషంబు చేసిన దానను.
జాలి జూపి నా తప్పులన్నియును క్షమించు మనుచును మఱిమఱి వేడుచు
స్వామీ! నీ వా భగవంతుడవే సంశయింప పనిలే దిసుమంతయు
సామాన్యుండవు గావు నీవనుచు స్మరణ జేయుచును నిలబడి యుండగ
వీరప్పయ్యాచార్యుం డంతట వినయమ్మున నచ్చమ్మకు నిట్లనె,
ఊరక నన్నీ విధమున బొగడుట యుచితము గాదు గదమ్మ! ॥వి

లెక్కకు మీరిన ధనికురాలవయి దిక్కులేని నా వంటి వారలకు
దిక్కై యుండెడు నీ కంటెను నే నెక్కువవాడను గాదోయమ్మా!
అని ఊరట వచనంబులు జెప్పగ నంత యచ్చమ్మగారు
మనమున నీతడు పరమాత్ముడె యని మహదానందంబంది
దేవా! నా తప్పులను మన్నించి, దివ్యబ్రహ్మోపదేశమిచ్చి-నను
పావనచరితను జేయుమటంచును ప్రార్థింపగ విని యతడు
అచ్చమాంబ నిశ్చల స్థితి నెఱింగి యాచార్యులు ముదమంది
ఇచ్చ గల్గి యాగంటిక్షేత్రమున కేగుదము రేపె మనము
అచ్చట తావక మనోసంశయము లన్నియు దీర్చి-బ్రహ్మోపదేశ
మిచ్చెద నని బలుకంగ నాయమ్మ మిక్కిలి సంతసమందె ॥వి

తెల్లవారగనె యచ్చమాంబ తా నెల్లకృత్యములు చక్కబెట్టుకొని
యుల్లమలర నా స్వామి పాదముల కండ్లకద్దుకొని ప్రణామంబులిడి
యా దయామయుని వెంట 'ఆగంటి' కరిగి యచట నాగంటేశ్వరునిన్
మోదమలర దర్శించి యట నుండి అవల నుండిన కొండపై కెక్కె
అచ్చట వారొక చక్కని తలమున నధివసించి యుండంగ

అచ్చమ్మగారు స్వామి పాదముల కభివందన మొనరించి
పుణ్యపురుష! దైవము 'స్త్రీమూర్తియు' 'పురుషమూర్తి'యా? తెల్పుడని వేడ
ధన్యురాల వీవనుచు నామెతో తల్లీ! వినుమని చెప్పదొడంగెను ॥వి

ఒకే మూర్తిలో రెండు నేకమై సకలము నిండియు సత్స్వరూపమై
అకలంకస్థితి నంది లోకముల కధినేతగ పాలించుచు నుండును
కావున భేదము లెంచక, మనసేకాగ్రత నందియు నిశ్చల స్థితిని
భావమ్మున ధ్యానింపు మనుచు తా బ్రసాదించె బ్రహ్మోపదేశమును ॥వి

బ్రహ్మానందము నంది యచ్చమ్మ భక్తిని స్వామి పదంబుల నంటి
బ్రహ్మతేజ! మీ శిష్యురాలనుగ పరిగ్రహింపుం డనుచు వేడికొన
సమ్మతించి యందులకు నాతండు సంతోషంబును జెంది
అమ్మా! తెల్పెద నటు పిమ్మట నీ కద్వైతంబని యనగ అచ్చమ్మ
గురుదేవా! మీ రేదియొ గుహలో గూర్చొని వ్రాయుచు నుంటిరి, అయ్యది
యెఱిగింపుడు, విని వేడుకపడియెద కణామయ! యని వేడ
అమ్మా! అయ్యది-భవిష్య ద్గ్రంథమందలి దేవరహస్యము లన్నియు
ఇమ్మహిలో సామాన్యులు దానిని నెఱుగలేరనుచు మరియు నిట్లనియె, ॥వి

బ్రహ్మజ్ఞానుల కందరికిని నిది బ్రహ్మానందము గూర్చును నీవును
బ్రహ్మోద్యమమున నుంటివి గావున భవిష్యత్తు వినిపించెద వినుమని
కాలజ్ఞానము జెప్ప దొడంగెను కలియుగ వింతల నా ఘనుడు
కేలుమోడ్చి వినుచుండె అచ్చమ్మ చాల భక్తితో నపుడు ॥వి

## కాలజ్ఞానము

హిందుస్తాని తోడి - ఆదితాళం

వినుము-వినుము కాలజ్ఞానంబును వినవే నాతల్లీ!
కనుమా యందలి రహస్యము లన్ని కడు సత్యంబులు జరుగబోయెడివి ॥వి

నుడివెద నిక నాల్గువేల యెనమన్నూట యెనిమిదగు యేండ్లు 'కలియుగము'
గడచిన పిమ్మట ధర్మదేవతయు కడు పుణ్యస్థలముల యందుండును

పాపంబులు నానాటికి బెరుగును తాపంబులు కలహంబులు బుట్టును,
కోపంబులచే నొకరినొకరు కడు గ్రుద్దులాడుకొను చుండెద రెప్పుడు ॥వి

నీచులధికులై యుందురు అధికులు నిల్వరు వారెటు జూచిననూ,
ఆచారంబులు కరవై పోవును, అన్యాయము నుతికెక్కుచు నుండును
అధికాహారులు, అతి వ్యవహారులు అధిక నిద్రితులు నౌదురు జనములు,
వదలి ధర్మమును వాంఛలు మెండై కుదురుగ నొకచో గూర్చొని యుండరు ॥వి

విప్రులు తమతమ ధర్మనియమములు విడచి నీచుల సమాశ్రయించెదరు.
అప్రసిద్ధులై షట్కర్మరహితులై భ్రష్టులునై కడు చెడిపోదురు
రాచధర్మములు వీడి రాజులు దురాగతులౌచు స్వలాభ పేక్షతో
నీచకార్యముల వలన వారు పరదేశంబుల పాలగుచు నుండెదరు ॥వి

సత్యదూరులై శూద్రులు నీచుల సాంగత్యముచే దరిద్రులగుదురు
నిత్యమ్మును ప్రతి జాతి వైరముల నెరపుచు తమ్మిక చచ్చుచు నుందురు
పైర్లు కొద్దిగా ఫలించు గోవులు పాలు కొంచెముగ నిచ్చుచునుండును
నిర్లక్ష్యంబుగ తండ్రీ-కొడుకులు నెపములతో కలహించుచు నుందురు
దేవబ్రాహ్మణులను, గురువులను ద్వేషంబున దూషించుచు నుందురు
వావివరుసలను దప్పి నడచెదరు పరుల సొమ్ములకు ప్రాకులాడెదరు
చోరరోగములు నుపద్రవంబులు ఘోరాగ్ని భయంబులు నధికంబగు
జేరు నడవిమృగములు గ్రామాలలో దారుణముగ ప్రజలదురుకొనియెదరు ॥వి

పంది యేన్గు కడుపున జన్మించును పందికి ప్లవగము జననంబందును
కొందఱు నిట్టి విచిత్రము గన్గొని జెందుచు నుందురు కడు నాశ్చర్యము
అందని కోర్కెల కఱులు చాతురు అతి పాపంబుల నాచరించెదరు
అందదు ఏ పని మంచివారలకు నతి కష్టంబుల బడుచు నుండెదరు
దురాశ చేతను భ్రమల చేతను పరకాంతా వ్యామోహము చేతను
విరివిగ ద్రవ్యము కొల్లలాడుచును దరిద్రులై చెడిపోదురు జనములు ॥వి

చోళమండలము నష్టంబగు శుభశిల్పంబులు కండలు గ్రక్కును
చాల గ్రద్దలా కండల దినుటకు వ్రాలి, తూలుచును గుంపుగ జచ్చును

చచ్చిన నా గ్రద్దలను బట్టుకొని జనులు గంతులను వేయుదురు
హెచ్చుగ కొఱవులు నోట గరచుకొని పిచ్చివారి వలె దిరిగెదరు
బెండులు మునుగును గుండులు తేలుచునుండును జలమున చిత్రముగా
కొండలు మండును పశుమృగజాతులు గుంపులుగుంపులుగా బడి చచ్చును
గ్రహభూతంబుల చేష్ట లధికమగు, కడుపున మంటలు పుట్టి చచ్చెదరు
బహు గ్రంధులు నోటియందు బుట్టుచు బాధ లధికమై పరితపించెదరు ॥వి

నెత్తురు గ్రక్కుచు గుండె లదరి నడి నెత్తి పగిలి మరణింతురు కొందరు
మొత్తము పట్నాలన్నియు నొకడే పెత్తనమున పాలించుచు నుండును
పరదేశీయులు వచ్చి చేరుకొని భరతఖండమంతయు పాలింతురు
మరియు వారి పాలలోన సర్వమానవులు చదువభ్యసించెదరు
నవనాగరికత లధికంబగు వర్ణంబులన్ని యొక్కటిగా మారును,
ప్రవిమలంబుగను సర్వయుగంబుల పాలన కంటెను కడు బాగుండును ॥వి

ఎద్దులు లేకనె బండులు నడచును, శుద్ధజలముచే దివ్వెలు వెలుగును
ఒద్దికతో పులి మేక మిత్రులటు లొక్క రేవుననె నీరుం ద్రావును
జనులు గ్రామముల కలహంబులచే పెనగులాడుచును కొట్టుక చత్తురు
విన వెంపలి చెట్లకు నిచ్చెనలన్ వేసియు నెక్కెడివారు పుట్టెదరు
పరగ గుడుల నిర్మింతురు దేవతాప్రతిష్ఠకులు దేవపూజితులు
అరయ దారిద్ర్య మనుభవించుచును నిరతము బాధల నొందుచుండెదరు ॥వి

విజయనగరంబు కొన్ని దినములకు విఫలమౌను కాశీపట్టణంబు
గజిబిజి నలుబది దినంబు లచ్చట కడు హీనంబుగ పాడౌదురు ప్రజ
కురుక్షేత్రంబున జనులందందున గుంపులు గుంపులుగా బడి చత్తురు
అరయ పన్నెండు దినములు గోదావరినది నిర్జలమై గనంబడును
కాళహస్తీశ్వరుని సముఖంబున ద్వారపాలకులు ముహూర్తకాలము
కాలు దువ్వుచును గ్రుద్దులాడుచును కడు భీభత్సము చేయుదు రప్పుడు
శునకంబులు గుఱ్ఱాలను జంపును కనుపించు పగలు చుక్కలు, వానిని

గనియు కొన్ని గ్రామముల యందుండు జనము నశించును చుక్కలు రాలును
కార్తీక బహుళ ద్వాదశి దినమున గన్పడు నాలుగు మొగముల చుక్కలు
పూర్తిగ నిరువదియైదు వారములు పొల్పరి యుత్తరమున నిలుచును ॥వి

మళయాళములో మందపాలుండు మనుజులతో మాట్లాడును వింతగ
కలుగు తిరుమలకు చక్కని మార్గము కట్టబడును యాత్రికులకు వసతులు
పృథివి నల్లచే తడియును కొండల పొడవున నెముకలు దండిగ రాలును
అధిక భూతప్రేతపిశాచ గ్రహంబులు కోలాహలముగ నాడును
కేకలు వేయుచు ప్రజలు తపింతురు కాకులు వికారస్వరముల గూయును
కూకలిడుచు నక్కలు ప్రతి జామున గోల చేయుటచే కొందరు చత్తురు ॥వి

కొండవీడు నుత్తర భాగంబున నుందు రాతి స్తంభబు గూలు నా
బండక్రింద బడి కొందరు మనుజులు ప్రాణాలను పోగొట్టుకొనియెదరు
కలియుగం బైదువేల వర్షములు గడచిన మీదట వారణాశిలో
జలము గానరాకుండును పట్టణజనులు నీటికై పరితపించెదరు
కంచికామాక్షి గిరగిర చక్రాకారంబుగ నొకజామున దిరుగును
కాంచ "బెళంకామాక్షి" నెత్తురును గ్రక్కు, వేపతరువమృతముగార్చు
మాచర్లలోని రాజులందఱొక మదవతిచే మరణంబు నొందెదరు
మాచర్ల చెన్నకేశవస్వామి మహిమలన్నియును మాయమైపోవు ॥వి

బండలు పగిలియు, రాళ్లుగాలిలో పక్షులమాదిరి నాడుచు నుండును
మెండుగ నెత్తురు వర్షించు, రాతిగుండ్లలో చీము నెత్తురు గారును
మైలారని పసిబిడ్డలు కొందఱు మాటలాడెదరు ఆకాశంబున
భీషణముగ పొగమంటలు పుట్టును భీతితో జనులు దద్దరిల్లెదరు
ఆరుమతంబులు నొక్కటియగును "ఆహా!" యను ధ్వని అధికముకాగా
అర్ధరాత్రి యందున ఘణంఘణంబని గంటల రవములు బుట్టును
శంఖారావంబులు వినంబడును పొంకముగా నాకాశమార్గమున
శంకవీడి యొకరిసొత్తు మరొకరు స్వాహా చేయుచునుందురు కొందరు ॥వి

ఒకరి యాలు వేరొకని పాలగును, నికరమైన పాలకులు వైదొలగి
సకల దేవళంబులు దుష్టులచే చాల వరకు నష్టంబగు చుండును

పుణ్యశాలురును నాదగు మహిమంబులను జెప్పుకొనుచుందు రెప్పుడును
పుణ్యస్త్రీపురుషులు మనియుందురు పుణ్యస్థలములు బాగైయుండును
నిక్షేపంబులు బైటపడుచుండు నిధులు తిరుమలేశ్వరునివి దోతురు
ఈ క్షేత్రంబున బుట్టుదు రారుగురెక్కువ దుష్టగుణంబుల చేతను
తిరువళ్లూరి వీరరాఘవునకు తిరుమజ్జన జేసెదరుగొప్పగా
విరివిగ చెమటలు కుండలాదిగా దొరగుచు కారును విగ్రహము నుండి ॥ఽ

గోదావరి కృష్ణల మధ్య నుండు గోవులు గుంపులుగుంపులుగ జచ్చు
ఏ దిక్కులేక జను లడవుల బడి నేగుదు రొకరిని నొకరు పట్టుకొని
కనుపించును కృష్ణానది మధ్యన కాంచనరథంబు అది గనువారికి
కనులు కనబడవు అశ్వపతిమహలు ఘనమండపమై బరగుచు నుండును
కర్ణాటకదేశమున యవనులచే కలుషితమై చెడు గుడులు ప్రతిమలును
నిర్ణమిత్తముగ నేలవాలి పడు రాతిరథంబులు ఫెళ్లున విఱుగును ॥ఽ

శ్రీశైల భ్రమరాంబ సన్నిధిని రెండు తలల బంగారు మకరంబు
ప్రాశస్త్యంబుగ గనుపించి తిరిగి భ్రమరాంభలోన సైక్యంబందును
వెండియు శివవైష్ణవ దేవళముల పెల్లుగ రక్తము నావరించుకొను
కొండయందున గణగణ ధ్వనులు నిండుగ నలువైపుల వ్యాపించును
ఆకసము నుండి రెండు క్రొంబైడి యంచలు క్రిందికి దిగి వచ్చి
ఏకముగా గను నదులు గ్రామములు నేర్పడి దిరుగుచునుండ
పాపులౌనట్టి జనములు వాటిని బట్టుకొనుటకై ప్రారంభింపగ
రూపులు చెడి గిరగిరదిరుగుచు లక్షోపలక్షలుగ పడి మరణింతురు ॥వి

తూరుపున నుండి పడమర వఱకును తోచు గగనమున చెంగావి
చీరపట్టినటు యోజనము నిడివి తీరిచి దిద్దిన యటుల గన్పించు
అని శ్రీస్వాములు కాలజ్ఞానం బాయమ్మకు వినిపించి
జననీ! యింకను చాలా యున్నది యనుచు నామె కిట్లనియె
వీరభోగవసంతరాయలుగ వెలయుదు నే కలియుగమున మరలా

తీరిపోవు నీ వింతలంతటితొ చేరకుండు ఏ భయము లెవ్వరికి
అప్పటి వఱకును నెన్నో వింత అత్యధికముగ జరుగుచునుండు
చెప్పెద తదుపరి యనుచు బల్కె వీరప్పయ్యాచార్యుండు ||వి

మహదానందంబొందుచు నాయమ మహనీయా! యిక మనము
గృహమున కేగుద మనుచు స్వామితొ గూడి బనగానపల్లె జేరుకొనె
వీరిరువురు నాకంటి కొండపై జేరి ముచ్చటించుటచే నా శిలకు
పేరువచ్చె 'ముచ్చట్లబండ'యని పిలువబడుచుండె నిప్పటికి గూడ ||వి

కొన్ని దినములకు స్వాములు వ్రాసినవన్ని కాలజ్ఞానములు దాచబడి
యున్న గోతిపై చింతచెట్టొకటి యుద్భవించె నచ్చోట పోదిగా
లోమఠంబు గట్టించె నచ్చమ్మ స్వాములవారికి నచట
ఆ మఠంబునందె నయ్యిరువురు తపమాచరించు కొనుచుండ్రి ||వి

మాయాసంసారమోడి వైరాగ్యమానసయై యచ్చమ్మ
ఆయన పదముల చెంత నుండుటకే ఆత్మను నిశ్చయపరచి
పదునాల్గువేల కాలగ్రంథముల భద్రపరచి నటువంటి గోతిపై
నుదయమైనదగు చింతవృక్షమ్ము మొదలు చాలవలయమ్మున నున్నది
యేపుగ బెరిగియు, రెండుపంగలుగ నేబదిమూరల నెత్తున నున్నది
ప్రాపు గల్పించుచుండె నా చెట్టు దాపున జేరుచున్న వారలకు ||వి

ఏడువందల యేడుల నుండియు నిప్పటికిని నది యట్లే యున్నది
జూడగ నా చెట్టు కాయ లోపల మాడినటులుండు తినపని కిరాక
ఆ యూరిజనుల కేదియైన నొక యవాంతరం బొనగూడ నున్నచో
పూవులు పిందెలు ఝల్లున రాలును పూర్తిగ నారేయి వృక్షమ్మునకు
కలరా, జాడ్యంబులు మొదలగునవి గలుగుటకు ముందు నా పంగలలో
కలుగు రక్తంబు మాదిరి, కారుచు గడ్డకట్టి కుంకుమ యటులుండును ||వి

ఈ దృష్టాంతరము లన్నియును గూడ నిప్పటికిని జరుగుచునేయున్నవి
ఆ దృశ్యము గని వృద్ధుల నడిగిన నాది నుండి యిది యింతే యందురు

అత్యధికంబుగ జనములు గొల్వగ నా వృక్షంబున కిప్పటి వఱకును
నిత్యనైవేద్య దీపారాధన లత్యధికంబుగ జేయుచు నుండిరి
స్వామివారు లోమఠంబున నుండి యేమియు దెలియని జ్ఞానశూన్యులకు
ప్రేమతోడ జ్ఞానము బోధించుచు ప్రియభక్తులుగా జేయుచు నుండెను ॥ి

# తృతీయాశ్వాసము

ఒక్కనాడు శ్రీస్వామికి పాదములొత్తుచు ననె యచ్చమ్మ గురువరా!
ఒక్కగా నొక్క పుత్రుండు నాకు వానికి నేత్రంబులు గనుపింపవు
చూచువారలకు మంచికనులవలె తోచుచుండు నే తరియుండ్రైనను
తోచదేమియును? వాని పరిస్థితి జూచినపు డనుచు విన్నవించుకొన
అమ్మా! నా కా బాలుని సంగతులన్నియు తెలియును చెప్పవనిలేదు
రమ్ము బాలకుని దోడ్కొని రేపుదయమ్మున నా యనుష్ఠాన సమయమున
చూపువచ్చు, నా బాలుం డీలోకము జూచెడి యోగంబున్నది వెరువకు
పాపుకొనుము నీ సంశయములని తాపసి యోగసమాధిని మునిగెను ॥ి

ఆ సమయమ్మున బ్రహ్మానందుం డన్నాజయ్యను నామద్వయమున
భాసిల్లెడు దక్షణదిశ శిల్పబ్రాహ్మణ వంశాగ్రజుడు
సన్యసించి తానప్పుడు దివ్యస్థలములు క్షేత్రంబులు సేవించుచు
ధన్యమైన బనగానపల్లె సందర్శించియు నా గ్రామంబంతయు
తిరిగి 'గరిమరెడ్డచ్చమ్మ యింటి కరిగి లోమఠమ్మున నుండెడి
పరమభాగవతునిన్ దర్శించియు, ప్రణామంబులిడి, నిలువబడియుండె, ॥ి

కాలజ్ఞానమును వ్రాయుచున్నయా కరుణామయు డాతని దిలకించి
బాలకుని వినయ ప్రాబల్యమునకు చాల సంతసంబంది నాయనా!
ఎవ్వండవీవు? నీ నామంబెయ్యది? యెందులకై నా దరికి వచ్చితివి?
అవ్విషయంబుల నన్నియు దెల్పుమని యన బ్రహ్మానందుడు తండ్రీ!
ఎన్నగ నే విశ్వబ్రాహ్మణుండ నేర్పడె నాలో వైరాగ్యమ్మది
'అన్నాజయ్య' ని బ్రహ్మనందుడని రెండు పేర్లతో బిలుతురు నను ॥ి

పుణ్యక్షేత్రముల సేవించు కొనుచు పూజనీయ! ఇట మిమ్ము దర్శించితి,
ధన్యమయ్యె నా జన్మ మిము గాంచ తనరెడు నాలో నేమో కోర్కెలు.
మహానుభావా! మీరలేదిటో మహాగ్రంథమును వ్రాసినారలా
మహావాక్యములు దెల్పి నన్ను పావనునిగ జేయుడటన్న నా స్వామి
కాలజ్ఞానం బయ్యది బిడ్డా! చాల రహస్యము లున్నవి దానిలో
ఆలకింపు మిక జరుగబోవు విషయంబుల నని వచియింప దొడంగెను ॥వి

# కాలజ్ఞానము

నాదనామక్రియ - జంపెతాళము

వినుకోవయా! నరుడ! వినుకోవయా!
వినిపింతు నీ లోక వింతలను శ్రద్ధగా ॥వి

వందిత చమూబలంబులు గల్గు భూపతులు భువిని వంశక్షయం బౌతారయా!
పందలై ప్రజలు మతకలహాలలో నెపుడు నందందు కొట్టుకొని చచ్చేరయా!
ఊరూర నొక శక్తి బుట్టగా విశ్వంబు నుధృతంబుగ భయం బొందేనయా!
ఘోరముగ మేకపోతులు రాత్రులం గూయు కొంద ఱద్దాని విని చచ్చేరయా! ॥వి

తిరుపతి కొండ దాపున ధూమకేతు వన బరగు నక్షత్రంబు బుట్టేనయా!
అరయు నా నక్షత్రమును జూచి కొందఱట సరిమిట్టమధ్యాహ్నమున మరణ
మందెదరు
ఉత్తరంబున నుఱిమి దక్షిణంబున మెఱయు నుర్వి పిడుగుల జనంబులు
నష్టమౌతారు
అత్తరిని నదులందు గల జలంబింకును నగ్నిదేవుడు కడు చల్లనై విలసిల్లు
చందురుం డగుపడును పొందుగ నమావాస్య, యపుడు కొందఱు నష్ట
మౌతారయా!
తుందుడుకుచే దుష్టజనులు నా రాకకున్ ముందు దూరంబునై పోతారయా! ॥వి

తల్లులకు బిడ్డలును బిడ్డలకు తల్లులును నొల్లకయె దూరమై పోతారయా!
ఇల్లు వాకిలి వదలి యేకాకులగుచును ఇడుమలెన్నో బడుచు గ్రమ్మేరయా!

కాయగసురుల దినుచు కడుబాధ లందుచును కడకు కొందఱు నష్టమౌతారయా!
రేయింబవళ్లు రేగడిమట్టినిం దినుచు కాయంబులుందూల కొందఱటు చచ్చెదరు
శ్రీశైలమున పుణ్యతీర్థంబు నష్టమగు శ్రీశైలనాథుండు సాక్షాత్కరించి నపుడు
ఆశతో జూచు జనముల నందఱిని గాంచి ఈశుండు మాట్లాడు వింత
గొల్పగ నపుడు

నందికొండకు నుత్తరాన నొక బిలములోనన్ రెండులక్షల గుఱ్ఱమ్ములును
మఱియు

అందహీనులు వికృతాకారులౌవారు వందలాదిగ నచట నుత్పత్తియౌతారు ॥వి

పంచవిధములైన వాద్యంబులుం గల్గి పదియు రెండు గుడార్లు చక్కగనుండు
ఎంచ నా బిలమందు నేవేవొ శబ్దాలు నేర్పడుచు నుండు జనముల విస్మయం
బొంద

మఱియు మార్కాపురమున నేలలో నుండి మెరుగు పుత్తడి యెద్దులను వెలికి
తీయుదురు

సరిగ నైదేండ్లనాగయ్య యను బాలుండు చదువునైదువేదములను నతి
చక్కగా ॥వి

శ్రీశైలమల్లికార్జునుని గుడియందున్న శిలలకున్ ప్రాణంబు గల్గేనయా!
ఆ శిలలు గ్రామగ్రామాన నాట్యంబాడు నధిక పాపులు బాధపడతారయా!
అన్ని దిక్కులయందు నేడేండ్లబాలలకు కొన్ని వ్యాధులు సోకి చచ్చేరయా!
ఎన్నగా నాకాశమందు శబ్దము బుట్టి మేర్పడగ కొందఱటు చచ్చేరయా! ॥వి

కూరుచుండినవారు కూరుచుండిన యటులె యేరికిని తెలియకనె చచ్చేరయా!
దారి నరిగెడి వారు నడచుచునె పృథివిపై నొరిగి ప్రాణాల గోల్పోతారయా!
ఆకాశమున నాల్గు దెసలందునన్ కొన్నియమిత దీప్తితొ చుక్కలగుపడునయా!
ఆ చుక్కలం జూచి అమ్మరో అని యరచి అదరిపడి కొంద ఱటు జచ్చేరయా!
రేయింబవళ్లు గ్రద్దలు గుంపుగా గూడి కూయగా కొందఱట కూలేరయా!
'హా!' యనుచు జలచరము లన్ని బయటకు వచ్చి అవి మేము చత్తుమని
మాట్లాడు చిత్రముగ

శ్రీశైలపర్వతంబున నొక మకరంబు జేరి యెనిమిది దినములుండియుం
బిమ్మటది

తచ్ఛైల భ్రమరాంబ మందిరంబున జేరి తా మేకలా యరచి యంతలో
మాయమగు ॥వి

చెలగి శ్రీశైల శిఖరాన నిప్పులు రాలు కలుగు వెంటనె ధ్వనులు నతి
భయంకరముగా

అల పార్వతీనయనముల బాష్పము గారు జలజలరాలు నీటునికంట
మిణుగురులు

నందీశ్వరుడు 'అంకె'లు వేసి కాల్దువ్వ నభమునన్ వాక్వాక్కనెడి
ధ్వని రణియించు

పొందుగా శివుని జడలెగసి నాట్యంబాడు నందిశిల యుక్కుస్తంభము పైన
నర్తించు ॥వి

తిరుపతికొండపై యవనులు చరిస్తారు మఱియు కపిలధ్వజము శబ్దంబుతోగదలు
గరుడధ్వజమ్ము నాలుగుదిక్కులకు సెగసి కడువింత గొల్పంగ నాదేవయా!
అఱచు నావులు గొఱ్ఱెలాకాశముం జూచు నపుడు భూదేవత రణగొణధ్వనిసేయు
మఱియు తల్లులు బిడ్డలకు జోలపాడంగ, తొరగు రక్తంబు కన్నుల నుండి
వారలకు

ఊరూరికిం బులులు నేతెంచి మనుషులను క్రూరంబుగా కఱచి చంపేనయా!
నోరార వీరభోగ వసంతరాయ చారిత్రమును బాలబాలికలు పాడెదరు
పూలవానలు గురియు నాకసం బెఱ్ఱనగు "భోం"కార శబ్దములు పుట్టేనయా!
రాలలో నంది జన్మించు తేజంబుతో రవిచంద్రులొకసారె యుద్భవించేరయా!
ఎంచగా వేదములు పంచముల పాలగును పంచములు పంచాంగములు
చెప్పుచుండెదరు

మించి బ్రాహ్మణులు చెప్పిన సంగతుల కంటె పంచములు చెప్పినవె కడు
నిజంబగుచుండు

పరజాతి సేవచే బ్రాహ్మణులు జీవింత్రు స్థిరమైన సంపదలు నశియించువారలకు
పరగ నకాలంబునందు వర్షము కురియు మరియు నుల్లిగడ్డ కొక గురు
పేర్పడును

నరయ నీశ్వరనామ సంవత్సరము నుండి సరిగ విక్రమనామ సంవత్సరము
వఱకు

వరుసగా నేడూళ్లకొకగ్రామ మౌతుంది మరియు నేడూళ్ల కొకదొడ్డియౌతుంది
కప్ప కోడికూతగూయు నీశాన్యమున గొప్పవిషగాలి వీచి కొందఱు చత్రు
గుప్పించి సుడిగాలి గొట్టగా కొందరట గుంపుగాబడి నష్టమౌతారయా! ॥వి

నా మఠమ్మున నీశాన్యదిశ పాంచసనమువారి యింటనొకరమణిగర్భముఃపగిలి
ధీమతియగు నొకబాలుండుత్పత్తియగు దిక్కులన్నిటియందు నుత్పాతముఃలు
బుట్టు
ఆ చిన్నవాడె దిగియరుదెంచి దిక్కులకు అనుసు నేనే దేవుడను నన్నుగొల్వుడని
ఆ చిన్నవానిమాటలను నమ్మరు భక్తులైనట్టివారు నతడెన్ని చెప్పినగాని
మక్కామసీదులో నొకపందిజన్మించి మహమ్మదీయు లందరికి వైరముబెట్టు
చిక్కిచిక్కనటుల గన్పించి వారలకు చేజారి పరతెంచు కనుపింప కెవరికిని
ఏడుసంద్రములు నుప్పొంగ వాగులు నదులునేకమై మరల నిర్జలంబగు నపుడె
పోడిమిగ మానవులరక్తంబు వేడిచెడి పొడిదొరగి నశియించి పోతుందయా!॥వి

అప్పటికి భక్తులైనట్టివారలు వత్తులై కీర్తివంతులై నిలిచేరయా!
అప్పట్టునన్ ముప్పదిరెండు వాద్యముల్ గొప్పగా విశ్వమున మ్రోగేనయా!
సోమసూర్యులు వారి దిక్కులను దప్పెదరు భూమి గిరగిరదిగుచు చక్రంబు
కైవడిని
భూమి తలక్రిందులగు నా సమయమున వీరభోగవసంతరాయుండు
కడు తేజమున
బ్రద్దలుగ తత్సమాధిని పగలగొట్టుకొని బయలుపడి దేశము పాలించుటకువచ్చు
అద్దియునుగాక రాతిరి యేడుగడియలకు నారెదొండతీగె నా మఠంబులో బుట్టు
సందులేకను మఠంబంతయును జుట్టుకొని అందు సప్త దినంబులు పూజలేకుండు
కొందరా తీగలను కోసి శుభ్రముచేసి అందఱును హరహరా యనుచు
మరణించెదరు ॥వి

కావేరిపొంగి ఘనమైన సీమలుచెడును కడకుదొమ్మరివారు దొరలుగా మారెదరు
భావింపగన్ దొడ్డవారు చెడెదరు నాదు భక్తులగు వారు నను స్మరణ
జేయుచునుంద్రు
నేను వసంతరాయలుగ వచ్చెడిదనుక నెన్నియోవికృతము లీభువిని నేర్పడును

మానుగ నీవు దైవాంశసంభూతుడవు గాన తెల్పితి కాలజ్ఞానమ్ము మరువకను
ఈ మఠమునందె అచ్చమ్మగారును నీవు ఈశ్వరధ్యానమ్ము సేసికొనుచుండుడని
స్వామి అన్నా జయకు పంచాక్షరిం దెల్పి సరిగ జపియించమని తాను
మౌనము దాల్చె ॥వి

ఆ సమయమ్మున అచ్చమ్మ యంధుడైన తన సుతుని తీసికొనివచ్చి
ఆసనమున నుపవిష్టుడై యున్న నా మహనీయుని దరి జేరి
కొమరుని సాష్టాంగముగ మ్రొక్కించి కూరిమితో ననె యీయనయే నా
కొమరుడు సద్గుణుడు నేత్రదృష్టి గోల్పోయిన వాడని విన్నవించె
అంతట బ్రహ్మానందరెడ్డినిం జెంత జేర్చుకొని నాయనా!
చింతింపకు నీ కన్నులకు దృష్టి శీఘ్రంబుగనే వచ్చు కూర్చొనుము
అని యా బాలుని భ్రూమధ్యంబు తన బొటనవేలు నుంచి
కనులు మూసికొని పదినిముసమ్ములు గడపి తెరువుమని యనిన
అటుల నాతడొనరింప వాని కను లగుపడుచుండెను కొంత మసకగా
పటుతరభక్తిన్ స్వామి పాదముల బడి సంతోషం బతిశయింపగను ॥వి

స్వామీ! నీవు మహానుభావుడవు సామాన్యుండవు గావు దేవుడవు
నా మీదను చెయిబెట్టి నంతటనె నా కన్నులు కన్పడె చాల వఱకు
కావున నా జీవితంబంత మీ సేవజేయ నా కెంతొ సుకృతం
బావరించునో గద స్వామీ! ఇక నన్ననుగ్రహింపుము మీ శిష్యునిగా
అనుచు వేడుకొన స్వామి కరుణించి వినుము నాయనా కొన్ని దినములకు
మునుపటి మాదిరి యథావిధంబుగ కనుపించు నీదు కనులని పల్కుచు
మఱియు నిట్టులనె పూర్వజన్మమున పరమపతివ్రత నీ సతి దృక్కుల
జెఱపితివి కాన నా పాపఫలముచే నిపు డంధత్వంబు నొందితివి ॥వి

పాపఫలము నెవ్వారలకైనను ప్రాప్తింపక మానదు నీవు తొల్లి
తాపసోత్తముల సేవజేసితివి తత్పుణ్యము నిను నా దరికి జేర్చెను
గాన నీకు పంచాక్షరి యనియెడి ఘనమంత్రంబును దెల్పెద, నిశ్చల
మానసుండవై జపియించుకొనుము దాన నీకు సౌఖ్యంబు చేకురును ॥వి

నీవు-నీ తల్లి అచ్చమ్మ మహానుభావుడు అన్నాజయ్య ముప్పురి
తావున నిమ్మతమందు నివశించి తపజపాదులచే సర్వజనులకును
జ్ఞానోదయ మొనరించుచు నొక లింగమును నా పేర ప్రతిష్ఠించి
ప్రాణాంతరమున జీవైక్యసిద్ధి బడయుడటంచు వచించి నే నిచట
కొన్ని దినంబులు మాత్రమెయుందు కొన్ని కార్యంబు లింకను మున్నవి
అన్ని నెరవేర్చి వీరబ్రహ్మంబను నామంబున నుందు నిక ముందు ॥వి
రాజయోగినై యుందు ననగ వారాయన ఆనను శిరసావహించి
పూజనీయుడౌ నమ్మహనీయుని పూజించుచు వారందేయుండిరి
స్వాములకు మ్రొక్కి యొక్క దినం బచ్చమ్మ సుతుడు బ్రహ్మానందరెడ్డి
స్వామీ! మీ దయ నా కనుల దృష్టి చక్కగా వచ్చె కాన నాకు నీ
గ్రామములో నా బాల్యస్నేహితులు కలరు బంధువులు కలరు వారలన్
తాము సెలవీయ చూచి వత్తునన స్వామివారు బిడ్డా! బజారునకు
నీవేగిన జనములు నచ్చెరువుగ నీ కనుల జూతు రా దృష్టి
నావరింపగా దోసంబు గల్గు నల్లరాయైన బ్రద్దలుగ పగులు ॥వి
అయిన నేనుండ నీకు భయమేమి? అదిగో యచ్చట పూజాపీఠము
పైన నున్న నా విభూది నొసటను భక్తితో నిడుకొని పయనించుమనెను
ఆ విధమున బ్రహానందరెడ్డి యాచరించి ఆ స్వామి సెలవంది
పోవుచుండె నా పురమున నవాబుదేవిడి సమీపమందు
కొంద ఱాతనిని యెఱిగియున్న వారందు నాతనిం గని విస్మయమున
అంధుడవు గదా? దృష్టి యెటు వచ్చె మందులెవరిచ్చి నారని యడిగిన
చిరునగవున నిట్లనె, వైద్యమేది జేయలేదు నాపూర్వపుణ్యమున
దొరకె నాకు నొక మహాత్ముడు వాని కరుణచే నాకు చూపు వచ్చెననె ॥వి
మాయమ్మగారు కట్టించినట్టి మఠమున నుందురువారు
ఆయన హస్తము నా శిరమున నిడ నంధత్వము విడిపోయె
అని యాతడు వినిపిం చెటకో జన విని యా నౌకర్లపుడె
జని నవాబునకు నీ విచిత్రమును వినిపింపగ నత డచ్చెరువు నంది
ఏమిది మన బనగానపల్లెలో నింతటి మహాత్ముడున్నాడా? సరి

తామసింపకను మీర లేగి యా తపసిని దీసికొనిరండు
సరగున వారటులేగి స్వాములకు సలాము జేసియు, మిమ్ముల నెందుకొ
త్వరగా తీసుకరమ్మనె నవాబు దయచేయుండని విన్నవింపగా
నాయనలారా! రేపుదయమ్మున ఆయన వద్దకు వచ్చెదను గాన
ఆయనతో జెప్పండని పంపగ నయ్యది నవాబునకు నెరింగించిరి ॥వి

పాదచారివై రమ్మని నందుకు సాధువేమైన కోపించెనె యన?
లేదు మారాజ! శాంతాత్ముడునై యేదియో శ్వాస పూరించి చెప్పె
మరునాడుదయంబుననే భటులొక విరుల పల్లకితొ స్వామి దరి జేరి
కరుణామయ! దయచేయుడని వేడ కదలి పల్లకిలొ కూర్చొని పోయెను ॥వి

స్వాములనుం గని నవాబు సింహాసనము డిగ్గి యుచితాసనము జూపె
ఆ మహనీయుని పూజించి యనియె నార్యా! మీరు మహాత్ము లని వింటి
మా మందిరమున విందారగించి మము కృతార్థులుగ జేయుండంచు నా
భూమీశుడు వినయమున వేడికొన స్వామివారు దయదలచి
అందుకు సమ్మతి దెల్పగా మౌని యంతట బంగరుపళ్లెరంబునన్
పొందుగ మాంసాహారంబుల నిడి, పొల్పుగ వస్త్రము పైగప్పి, స్వామి
ముందు బెట్టగా నయ్యది గ్రహించి మొదట వస్త్రంబు దీసివేయగా
నందు మాంసభక్ష్యములు మాయమై యచట పరిమళపుష్పము లుండెను ॥వి
అంతట నవాబు స్వామిమహత్తున కబ్బురపడి యాచార్యపదము ల

త్యంత భక్తితో కనుల కద్దికొని ఆర్యా! తమ మహిమను గాంచుటకై
ఇంత చేసితిని క్షమించి, సద్గతి కేగు మార్గమును జూపుడు నా కని
స్వాంత మలర వీరప్పయ యడుగుల సాగిలబడగా స్వామి కరుణించి
నాయనా! లెమ్మటంచును 'బ్రహ్మజ్ఞాన' ముపదేశమిచ్చియున్ మరియు
ఆయనకు కొన్ని రాజధర్మములు ననుగ్రహింపగ నతడు హర్షించి
అయ్యా! యేదో వ్రాయుచునుంటిరి అయ్యది తెల్పగ వేడెద ననినన్
అయ్యది కాలజ్ఞానము బిడ్డా! అటులనె తెల్పెద వినుమన నవాబు
ఆ పురమందున నుండెడి మనుజుల నందజిని నటకు పిలిపించి
తాపసి చెప్పెడి భవిష్యత్తు విని ధన్యులుగండని వచియించె ॥వి

వారలందఱును వీరప్పయ్యకు వందనములిడి నిలువబడి యుండ
గారవమున వారల గూర్చొనుమని కరుణారసహృదయుండు
స్వామి వారలం గాంచి జనులారా! శ్రద్ధగ వినుడీ కాలజ్ఞానము
సామాన్యంబులు గావివి, ఇక నే సాగించెద నని చెప్పదొడంగెను ॥వి

# కాలజ్ఞానము

నాదనామక్రియరాగం - మిశ్రఏక తాళం

చెప్పెదను మఱి యాలకించండీ! జనులార! ఇయ్యది గొప్ప సత్యములని
తలంచండీ!
ఒప్పుగా నొక యాత వృక్షంబుద్భవించి పరుండి రాత్రులు
చప్పునన్ ఉదయమున లేచుచు సరిగ నెనిమిదియేండ్లు బ్రతుకును ॥చె
గోలకొండయు గుత్తి-బళ్లారి, నెల్లూరు, కంభము, కొండవీడును, చెన్నపట్టణము
వాలుగను కర్నూలునుం బెజవాడ మంగళగిరియు మొదలగు
చాల చోటుల యందు రూకకు ప్రాలు చిట్టెండమ్ము చుందురు ॥చె
ఎక్కువగ నరికాళ్లలో బుట్టు మంటలు శిరమ్ముల కెక్కి కొండఱు మ్రాగ్గి
చచ్చెదరు
దిక్కుదోపక మేక కసవును తిందు రాకలి చేత నందఱు
నిక్కువంబుగ నీతిధర్మము నిలువకుండును వసుధయందున ॥చె
వావివరుసలు వదలి వేయుదురు పతిభక్తి పాడైపోవు నీ లోకమున ముదితలకు
భావమందున స్పర్థ లేర్పడి భార్యభర్తలు వీడిపోదురు
ఆవరించును కామక్రోధము లతిశయంబుగ మనుజులందున ॥చె
మరియు మీ గ్రామంబు లోపలను నొక వింత జరుగును మరువకను
గమనించి యుండండీ!
గరిమరెడ్డి అచ్చమ్మగారి వంశము నాశనంబగు
అరయ నాయమ గోవులన్నియు నొరిగి ప్రాణంబులను వీడును ॥చె
వ్రాసినేనన కాలమహిమములన్ అచ్చమ్మగారి పెరటి పాతరయందు
ను ంచితిని

దానిపై తింత్రిణీ వృక్షము తగు విధమ్మున మొలచి పెరుగును
మానుగా నా చెట్టునకు చేమంతి కుసుమావళులు పూయును ॥చె

ఈ పురమ్మున మధ్యనున్నట్టి 'జు(రేరు' పొంగుట నెంతో నష్టంబౌను సంపదలు
ప్రాపు దొలగి నవాబు పాలన భంగమందు క్రమక్రమంబుగ
ఏపు చెడ రాబడులు తగ్గును హీనగతి నందెడిని రాజ్యము
ఈ మఠంబున వెలసియున్నట్టి శివలింగమున కనారతము నా భక్తులగువారు
నీమ నియమము లొప్పి మెలగుచు నిత్యపూజలు జరుపుచుందురు
సోమసూర్యు లున్నంత కాలం బీ మఠం బిట నిలచియుండును ॥చె

సరిగ నేబదినూర్ల వర్షములు నీ కలియుగంబున నరుగ నేను
వసంతరాయలుగ
ధరను పాలింపంగ వత్తును ధర్మదేవత తాండవించును
ఇంక వింతలు నెన్నియో గలవు తరువాత దెల్పెద నిప్పుడింతటి తోడ చాలింతు
సుకము గల్గును పోయిరండన సుజనహితుని పదద్వయములకు
ముకము నానిచి మొక్కి వారలు మోదమున నట నుండి వెడలిరి. ॥చె

ఆ మహనీయునితో ననె భూపతి ఆర్యా! నా జాగీరులో నున్న
గ్రామములు కొన్ని యిచ్చెదను మీరు గైకొనుడని వినయమున ప్రార్థింప
స్వామి నవ్వి అవి యెల్ల నాకేల? సద్భక్తితోడ కోరితివి గాన
ఈ మఠమ్మునకు దీపారాధన లేర్పడగ కొంత పొలము నొసంగుము
నీ యశస్సు స్థిరంబుగ నిలుచును మేదిని యని తా ననిన
పాయక యేబది యెకరంబులు నప్పటికప్పుడు వ్రాయించెను నవాబు
మరియు సంవత్సరారాధనకై విరివిగ ధనంబొసంగు చుండెను
జరుగుచుండె నిప్పటికిని నవాబు సంస్థానీయుల వలన
వీరప్పయ్య నవాబును నట దీవించి వీడ్కోలు నంది
చేరుకొనియె నా మఠమున భక్తుల సేవ లందుకొనుచుండె ॥వి

# చతుర్థాశ్వాసము

వీరప్పయ్యను నామమున్ వదలి వీరబ్రహ్మం బనియెడు పేరున
వీరు బనగానపల్లెనున్ వదలి వేంచేయుచు నచటచట నాగుచు
కడపజిల్లా బద్వేలు తాలూకా కందిమల్లయ్యపల్లెకుం జేరి
గడుప నిశ్చయించుక యచట నా ఘనుడు నివాసం బేర్పరచుకొనియె ॥ వి

ఆ పల్లెలో వడ్రంగివృత్తినే యాధారముగా జేసికొని
తాపసి వారల మన్నన లందుచు తత్త్వములను బోధించుచు నుండెను
ఆ పురిజను లొకనాడు సభజేసి యా గ్రామదేవి పోలేరమ్మకు
ఏపుగ జాతరజేయ సిద్ధపడి యేర్పరచుకొనిరి శుభముహూర్తమును
మరసటి దినమున ఆ గ్రామపెద్ద లరిగి యింటింట చందాడబ్బులు
కొఱకు జనియు శ్రీవీరబ్రహ్మంగారిని కోరిరి చందా నిమ్మని
స్వామి చిరునవ్వు నవ్వుచు నేనును చందా నివ్వవలసినదేనా?
ఏమి యిచ్చెదను? నిరుపేదను నే నిప్పుడనగ వారొప్పుకొనరైరి ॥ వి

సరియే యిచ్చెద దేవిని నిల్పిన స్థలమునకు బోయెదము రండనుచును
అరిగి యా దేవి సమీపమం దొక యరుగు పైన గూరుచుండి రందఱు
అంత స్వామి చుట్టను చేతబట్టి అమ్మా పోలేరీ! నిప్పు తెమ్మన
అంత నదృశ్యయై కొఱవితో నిప్పు నందించె నా స్వామి దరి నిలచి
తాపసి యపుడా చుట్ట కాల్చుకొని తల్లీ! యిక దయచేయుమనగ యా
పాపరూపమున నున్న యామె చన నా పెద్దలు విభ్రాంతినందుచును
ఆచార్యుల పాదంబులం దొరిగి ఆర్యా! మీ మహిమంబు లెఱుంగక
చూచితిమి మిమ్ము వెఱ్ఱివానిగా సుజనావన! యో మహానుభావా! ॥ వి

మా యపరాధంబులను మన్నించి మాకు జ్ఞానము నొసంగి ధన్యులను
జేయు డటంచును వేడుకొను నంత, ఆయన వారల పైన దయ దలచి
నాయనలారా! లెండు మీర లజ్ఞానాంధకారంబున నణంగి
'నాయది' 'నేన'ను అహంభావమున మెలంగుచు నుంటిరి ఇకనైన గాని

భక్తి భావమున మెలగుడనగ నా ప్రజలలో నొకడు లేచి దేవరా!
భక్తి యన దాని పరమార్థమేమొ? పల్కుడనగ నాచార్యులు బిడ్డా!
భక్తి మహాద్భుతశక్తి, దానికి సమంబైనట్టిది నేదియును లేదు
ముక్తిదాయకంబది, జగదీశుని మోదమొందించునది అది యొక్కటే ॥వి

సర్వేశ్వరు నతి ప్రీతితో నెపుడు స్మరణజేయువారల కది గల్గును
గర్వాంధులు, స్వార్థపరుల కయ్యది గల్గదనుచు వచియించుచు మరియును
వ్యాపారపూజ లెన్నిచేసినను వ్యామోహ నమస్కృతు లెన్నిజేయ
ఓపికతో రుచులెన్నో మింగుచు ఒక్కప్రొద్దులుండిన నది దక్కదు ॥వి

కావున మీరీ సత్యంబును గని, కల్గి భూతదయ స్వార్థరహితముగ
దేవుని గొనియాడుండని వారికి దెల్పి సెల వొసంగి తా జనె నింటికి
పూజనీయుడై కొంత కాల మా పురములో నుండి స్వామి యటుపైన
రాజ యోగమున నుండిన మేలని యోజ చేసి యట నుండి
కొన్ని గ్రామముల నెల్ల దిరిగి 'పెదకొమర్ల' యను నొక గ్రామమున కరిగి
తిన్నగ నా పురి తిలకించుచు నొక దేవాలయమున నివసించియుండె ॥వి

ఆ పురమున శివకోటయ్యనియెడు నతడు విశ్వబ్రాహ్మణుడు
కాపురంబుండె కమ్మరిపనిచే కాలముగడుపుచు సతము
సదాచార సంపన్నుం డాతడు సత్యనిష్టతో నా పరమేశుని
పదద్వయంబుల సేవజేయుచును భాసిల్లుచున్న పరమభక్తుండు
వానికి సంతతి లేమి చేతను భవానిని సముపాసించి గొల్వంగ
జ్ఞానమైన నొక యాడుబిడ్డ నా ఘనునకు నొసంగెదేవి ॥వి

ఆమెకు గోవిందమ్మ యనంగను, నామకరణంబు యామె నతి
ప్రేమ మీరగా బెంచుచు నుండిరి ప్రియదంపతు లవ్విటన్
చిరుప్రాయంబున నుండి దైవమును సేవించుచు గోవిందమ్మ
నిరుపేదల నభ్యాగతులం గని నెరపుచుండె దయ నా యమ్మ
పదిరెండేడులు రాగనె యామెకు పరిణయము చేయనెంచి
ముదమున నా తలిదండ్రు లప్పుడు వెదకుచు నుండిరి వరుని ॥వి

తల్లిదండ్రు లెవ్వారిని దెచ్చిన నొల్లకుండె నా యమ్మ
తల్లీ! ఏమిది? యెవ్వరు వచ్చిన నొల్లకుంటి వది యేమొ దెల్పు మన
పూజనీయులారా! నే భర్తగ బొందగోరినట్టి యతండు తపో
తేజంబున దైవాంశజుడై భువి పూజనీయుడై యుండగా వలయు
అట్టి వాడు మన గ్రామమున ఆలయంబు నందున్నవాడు వానినిన్
నెట్టులైన రప్పించి యిటకు నన్నిచ్చి వివాహం బొనరింపు డనియె ||వి

అంతె గాని నితరుల నెవ్వారల నైన పరిణయం బాడగా నొల్ల
చింత లుడిగి వానిని నా భర్తగ జేయుడనుచు ప్రార్థించె
ఆ మహనీయుడు నిన్నటి దినమున నగుపించె నాకు మన వీధియందు
ప్రేమతోడ నను జూచి యేగె నా ప్రియు డటంచు నిదురించె ||వి

ఆ సన్యాసి అదేమి యైన మన అమ్మాయి పైన మచ్చుజల్లెనా?
ఆ సర్వేశ్వరిదే భారంబని యనుకొను చుండిరి వారు
స్వామివారి నొక బైరాగి క్రింద జమకట్టిరి యా ఘనుని మహత్వం
బేమియు నెఱుగక కుమార్తె వారికి నెన్ని జెప్పినను విన నొల్లరైరి ||వి

ఇది యిట్లుండగ నా గ్రామంబున యువకుడైన నొక రెడ్డి మరణింప
పదిమంది బంధువులు దహనమునకు పాడెపై నుంచి గొంపోవుచుండ్రి
స్వామివారున్న నా దేవాలయ సమీప మార్గమున బోవుచుండగ
ఆ మహనీయుడు వారలం గాంచి యచటికి తా నరుదెంచి
ఏమి వింత? యిట్టి విపరీతం బెందునైన గలదా? ప్రాణమున్న
ఈ మనిషిని పాడె మీద బెట్టుక నేగుచునుండిరి స్మశానంబునకు
అని యాతడు చిరునవ్వుతో ననగ ఆశ్చర్యంబున నితడు జబ్బుపడి
చనిపోయెను 'పరిహాసమాడెదవ' చాలు పొమ్మనుచు వారలు కసరిరి ||వి

సరియే నేనును మీతో వచ్చెద జరుగున దంతయు మీరే చూతురు
అరుగుడనుచు వారి తోడ గదలె నాపరమపావనుం డపుడు
దింపుడు కల్లంబందున శవమును దింపగ స్వాములు శవబంధములను

త్రెంపు డన వారలలో నొకండు త్రెంపెను సూక్ష్మగ్రాహి
అంత స్వామి యా శవము పైన తన హస్తముతో స్పృశియింప
వింతగ నా మృతుడు లేచి కూర్చొని చెంతనున్న వారలతో నిట్లనె ॥వి

ఎందుకు మీరలు నన్నీ విధమున నిక్కడకు తీసికొని వచ్చితి రన
నందుకు జరిగినదంతయు దెల్పగ నతడు నందున్న ప్రజాసమూహము
స్వామి పాదముల సాష్టాంగపడుచు సర్వజ్ఞుండవు దైవాంశజుడవు
మీ మహిమలు గననేరక మిమ్ముల నేమేమో యంటిమి క్షమియించుడి
అనుచు వేడికొన వారల లెమ్మని యపుడు సజీవుని నొసట విభూది
నునిచి, వీని కిక నే భయంబు లేదనుచు వేగ నింటికి గొనిపొండని
వారలం బంపి వీరబ్రహ్మంగారు దేవాలయమున
జేరి యుండె నా మహామహుం డపు డూరి జనులు కొనియాడ
ఆ యూరిజనులు స్వామిసన్నిధికి నరుగుదెంచుచు గుంపులు గుంపులుగా
పాయక నీతడు మహాత్ము డనుకొని భక్తి శ్రద్ధలును పెంపొంద
వాని వేదాంత జ్ఞానబోధన వీనుల విందుగ వినుచు
వాని కృపకు పాత్రులగుచు నుండిరి వారు సంతసంబొంది ॥వి

ఆ శివాలయంబున పూజారిగ నమరియున్న బ్రహ్మయ్య
ఆశ మీర శ్రీసాములువారిని నభినందించుచు నుండె
వాని భక్తిశ్రద్ధలకు మెచ్చి శ్రీవారు వానిపై దయగల్గి
జ్ఞానయోగంబు భక్తిమార్గంబు మానవ ధర్మంబును బోధించెను
అచ్చట కొందఱు తుంటరులు రెడ్డి చచ్చుటయు స్వామి బ్రతికించుట విని
చచ్చినవాడెటుల బ్రతుకు నియ్యది స్వామి తాంత్రికంబై యుండవచ్చు
ననుచు వారిలో నొకడు మరణించినటుల పాడెనొకదాని నేర్పరచి
అనువుగను వాని నా పాడె మీద నమర్చి సాంగ్యంబులను నొనరించి
నలుగురు మోయుచు కొందఱు నేడ్చుచు నానా రభసము చేయుచును మౌని
నిలయంబగు గుడి దగ్గఱగా వారలు పోవుట నది స్వామి గమనించి
పూజారికి ననె చూచితివా యా పొగరుబోతులను, నన్ను తాంత్రికుని
గా జేసి వారలీ విధంబుగా కపటనాటకం బాడుచు నుండిరి ॥వి

త్రెంపు డన వారలలో నొకండు త్రెంపెను సూక్ష్మగ్రాహి
అంత స్వామి యా శవము పైన తన హస్తముతో స్పృశియింప
వింతగ నా మృతుడు లేచి కూర్చొని చెంతనున్న వారలతో నిట్లనె ॥వి

ఎందుకు మీరలు నన్నీ విధమున నిక్కడకు తీసికొని వచ్చితి రన
నందుకు జరిగినదంతయు దెల్పగ నతడు నందున్న ప్రజాసమూహము
స్వామి పాదముల సాష్టాంగపడుచు సర్వజ్ఞుండవు దైవాంశజుడవు
మీ మహిమలు గననేరక మిమ్ముల నేమేమో యంటిమి క్షమియించుడి
అనుచు వేడికొన వారల లెమ్మని యపుడు సజీవుని నొసట విభూది
నునిచి, వీని కిక నే భయంబు లేదనుచు వేగ నింటికి గొనిపొండని
వారలం బంపి వీరబ్రహ్మంగారు దేవాలయమున
జేరి యుండె నా మహామహుం డపు డూరి జనులు కొనియాడ
ఆ యూరిజనులు స్వామిసన్నిధికి నరుగుదెంచుచు గుంపులు గుంపులుగా
పాయక నీతడు మహాత్ము డనుకొని భక్తిశ్రద్ధలును పెంపొంద
వాని వేదాంత జ్ఞానబోధన వీనుల విందుగ వినుచు
వాని కృపకు పాత్రులగుచు నుండిరి వారు సంతసంబొంది ॥వి

ఆ శివాలయంబున పూజారిగ నమరియున్న బ్రహ్మయ్య
ఆశ మీర శ్రీసాములువారిని నభినందించుచు నుండె
వాని భక్తిశ్రద్ధలకు మెచ్చి శ్రీవారు వానిపై దయగల్గి
జ్ఞానయోగంబు భక్తిమార్గంబు మానవ ధర్మంబును బోధించెను
అచ్చట కొందఱు తుంటరులు రెడ్డి చచ్చుటయు స్వామి బ్రతికించుట విని
చచ్చినవాడెటుల బ్రతుకు నియ్యది స్వామి తాంత్రికంబై యుండవచ్చు
ననుచు వారిలో నొకడు మరణించినటుల పాడెనొకదాని నేర్పరచి
అనువుగను వాని నా పాడె మీద నమర్చి సాంగ్యంబులను నొనరించి
నలుగురు మోయుచు కొందఱు నేడ్చుచు నానారభసము చేయుచును మౌని
నిలయంబగు గుడి దగ్గఱగా వారలు పోవుట నది స్వామి గమనించి
పూజారికి ననె చూచితివా యా పొగరుబోతులను, నన్ను తాంత్రికుని
గా జేసి వారలీ విధంబుగా కపటనాటకం బాడుచు నుండిరి ॥వి

"వినాశకాలే విపరీతబుద్ధి" అనునట్లు వీరికిది ప్రాప్తించెను
గనుంగొనెదమని యచటికేగి యే కారణమున మరణించె నీతడన
అందుకు వారలు కపట దుఃఖమున అయ్యో యీతడు జ్వరపీడితుడె
మందు లెన్నిదిన్నను పనిచేయమి మమ్ము దుఃఖమున ముంచి మృతింగనె

అయ్యో పాపము వీని కింతటికి నాయువు దీరెను గాబోలు ననుచు
చయ్యన పూజారి వెన్గొగ జేరె దేవాలయమున
తుంటరు లా విధమునన్ నూరి యావలకు నేగి కట్లు విప్పగా
ఆతండంతట నిజంబుగానే యసువులన్ వీడియుండె నదిగాంచి
భయభ్రాంతులై నేమియు దోపక బహుశోకంబునవారు
అయోమయస్థితిలో బడి యుండగ నందు వారిలో నొకడిట్లనియెను

మనమా యోగిమహత్వం బెఱుగక యొనరించినాము మహాపరాధము
చని యాస్వామి పదంబులం బడెదమనగ నందఱటు జేయగా నెంచి
చచ్చిన వానిం దీసికొనిపోయి స్వామి సన్నిధిన్ నిల్పి దేవరా!
తుచ్ఛులమై మీ మహత్మ్య మెఱుగక తుంటరితనమున తప్పు జేసితిమి
మా యపరాధంబులను మన్నించి మమ్ముల గాపాడుండని వేడుచు
నా యతి పాదంబులం బడగ నతడు కరుణించి వారిని లెండని
చనిపోయిన వాని శరీరమ్మున తన పుణ్యహస్త ముంచి తవడగా
కనులు నులుముకొని యతడు లేచి కూర్చొనియె,అందఱాశ్చర్యము నందగా

అంత వాడు స్వామి పదములం బడి ఆర్యా! మీరలు తాంత్రికులంచును
ఇంత దుష్కృతం బొనరించి నట్టి హీనుల మమ్ము క్షమించుడని వేడ
అందులకు మౌని వారి నోదార్చి అయ్యలారా! యీ కలియుగమున నిక
ముందుజరుగబోయెడి భవిష్యత్తు వినెదరా? మీకు బోధింతు ననగ
అందుల కందఱు మహానందమున ఆర్యా! చెప్పుండని వినుతింపగ
మందహాసమున చెప్పదొడగె నా మౌని వారికి భవిష్యత్‌వాణిని

# కాలజ్ఞానము

నాదనామక్రియరాగం - జంపెతాళం

ఈ కలియుగమునందు జరుగు వింత లెటింగించెదను వినుడి యివి
యదార్థము ॥ఈ
న్యాయమన్యాయంబుగామారు నండి!అన్యాయమే న్యాయముగ నిల్చునండి!
మాయమర్మములకే మర్యాదలొనగూడు మంచి యెచ్చట గూడ వంచనల
పాలగును ॥ఈ
నిజము కల్లగు కల్లనిజమగుచునుండు ప్రజ క్షణికసౌఖ్యాలకై పరుగులిడు
చుంద్రు
త్యజయింత్రు నీతినియమములు తుచ్ఛుల వద్ద భజనచేయుచునుంద్రు
పైసాలకై జనులు ॥ఈ
కులగోత్రములు వావివరుసలు నశించు నిలను స్త్రీ-పురుష రెండే జాతు
లనుచుంద్రు
ఇలను వైదికవిద్యలెల్ల రూపరిపోవు కలుగు లౌకికవిద్య లతి మిక్కుటంబగును ॥ఈ
ఆలుమగ లన్నదమ్ములును చుట్టములు అక్కసెల్లెండ్రు గురుశిష్యులును
భూపతులు
జాలి లేకయె యొకరినొకరు మోసగించి వరుస దప్పియు ప్రాణముల
దీసికొనుచుంద్రు
కాలప్రకృతి ధర్మములు తలక్రిందులౌ కరువు కాటకాలబడి తపింతురు జనులు
మేలెవరికైనను జేయకుండేవాళ్లు మిగుల బాధలనొంది కూలిపోవుచు నుంద్రు
॥ఈ
భక్తిజ్ఞానములెల్ల వలచబడునండీ! పరదూషణము లెపుడు ప్రబలు సుమ్మండీ!
భుక్తికోసమె వేదశాస్త్రాలు బుట్టెనని మూర్ఖు లెల్లెడల వాదముల
నాడుచునుంద్రు
కలియుగము నైదువేలేండ్లు నిండెడి దనుక ఇలను పార్థివనామ
సంవత్సరము లోన

కలుగుచుండును ప్రళయంబు లెల్లెడలందు కడు భయంకరమైన
యుద్ధములు చెలరేగు ॥ఈ

పశునష్టమగు సస్యనష్టంబునగు అగ్నిపర్వతంబుల వలన, గిరులు పగులుట
వలన

విషగాలులచే పెనుగాలివానల చేత విపరీతముగ నదులు సంద్రములు
పొంగుటచె

జాతిమతభేద వైషమ్యముల చేత నీతినియమము లీగి, నిష్కారణముగ
ఘాతుకంబులు చేసికొని కొందఱు నశింత్రు ఈతీరునన్ జనంబెంతొ నష్టంబగును
వేదవిద్యలు వేదాంత చర్చలును వీడి బ్రాహ్మణులు చండాలురై పోయెదరు
వాదభేదాలతో నుద్రేకులై జనులు మార్కొనుచు నొకరి నొకరిం జంపుకొని
యెదరు ॥ఈ

వల్లకాడున భక్తులుదయయించుచుంద్రు తల్లిదండ్రులు పుత్రికల
విక్రయించుదురు
పల్లెటూళ్లెల్లెడలపట్టణాలగుచుండు ఎల్ల రాజులు వైరముల చేత మడియుదురు
సుతల యవమాన మొందించు దండ్రులును పతుల నవమానించునట్టి
భార్యలును
మాతాపితల ధిక్కరించు కొడుకులును భార్యలను హింసించు పతులెక్కు
వయ్యెదరు ॥ఈ

క్షత్రియుల రాజ్యాలు చెదరిపోవు వారల శౌర్యతేజస్సు సంపద లెల్ల
నశియించు
ధాత్రి రసగంధ ద్రవ్యముల వసచెడును తలప సస్యము లల్ప ఫలిత
మిచ్చుచునుండు
సాధువర్తనులు దుర్గతులచే నెపుడు బాధలందుచు నల్ప కాలమున
మడియుదురు
అధిక పాపాత్ముల కాయు వెక్కువ యయ్యు ఆరోగ్య ధనధాన్యములతొ
వర్ధిల్లెదరు ॥ఈ
ఆకాశమున బుట్టు కొండంత తార, ఆ చుక్క యుగమార్పు చుక్కయను
కొంద్రు

ప్రాకటంబుగ మనుజులా చుక్కనుం జూచి బహు జనమ్ములు ప్రాణభీతులను
గోల్పోయెదరు

ఆవు కడుపున దూడ యగుపించు జనులకు, అరయ మేకపోతు ఆవు
మాదిరి యరచు

కావునన్ దాన కొందలు నష్టమయ్యెదరు, కనగ నార్నెల్ల బాలుడు
పాటలను బాడు ॥ఈ

ఒక గోవు ఐదు శిరస్సులం గల్గి, ప్రకటితంబుగ రెండు యోనులతొ జన్మించు
ఒక యోని తా మానవ యోని గాను, నింకొకటి ధేనువు యోని మాదిరిగనే
యుండు

ధేనువు కడుపున మనిషి పుట్టును, వాడు మానవులతొ తర్కవాదంబులం బల్కు
మానుగా నిత్తడి బంగారముగ నమ్ము మరియు నోంకార శబ్దము
భూమిపై గల్గు ॥ఈ

నాగమల్లె లతి చిత్రముగ నాశంబగును, నరులా విధంబుగనె నశియించు
చంద్రు

బాగుగా నినుని మహిమలు జనుల కగుపడు, పచ్చగా మనిషి రూపమున
తా గనుపించు

భావనామ సంవత్సర శ్రావణ బహుళాష్టమి నాటికిని నదులు పొంగి
తావు తెలియక పట్నములు పల్లెలుం జెడును, భావింపగా చాల ప్రాణ
నష్టంబగును ॥ఈ

బహుధాన్యనామ సంవత్సరమందునను పరగ నిరువదియైదు పట్టణంబులును
బహు ఘోరముగ రక్తపాతమై నశియించు పాపాగ్ని మఠము మహోన్నత
స్థితినందు

పలనాటిలోన బ్రాహ్మణు నింట కాకరపాదునకు చింతకాయలు **గాచునండీ!**
వరుస సైదేండ్ల బాలుడు భవిష్యత్తులన్ వచియించు జనులు బహు చిత్రంబు
నొందగన్ ॥ఈ

దుర్మార్గులును దురాచారులును నిర్దయుల నిర్మల జ్ఞానులను వారును
వచించువారును

ధర్మవర్జితులు దయాశౌచహీనులును మర్మజ్ఞులెక్కువై దేశాన్ని చెరచెదరు ॥ఈ

మఱియు రక్తాక్షినామ సంవత్సరము మార్గశిర శుద్ధ సప్తమి దినంబునను
పరగ చెన్నపట్టణములోన నుండు నొక బాపనింటను సప్తవర్షముల బాలికకు
ఒక పురుషశిశువు జన్మించు నా శిశువునకు హస్తంబులు నాల్గు, కాళ్లు
మూడును గలిగి
ప్రకటితంబుగ శిరమున కొమ్ములుం గల్గి పరగ నిరువది రెండు దివసములు
జీవించు
ఆ బాలకుడు వీరభోగవసంతరాయలు దుర్మతుల నడప వచ్చుచున్నాడనుచు
తా బల్కుచును మరణించు నిదే మీకు తగిన గుర్తిది జ్ఞాపక ముంచు
కొనవలయు
బంగాళాదేశమున ప్రజ జలమ్మున జీర్ణమౌను విప్రుల ఆచరణమ్ము లడుగంటు
గంగాసువర్ణముఖియందు పదియు నొకడు ఘనులు భక్తులు ఉద్భవించు
నాశ్చర్యముగ ॥ఈ
ఆనందనామ సంవత్సరములో కారణార్థంబులను కొన్నిటిని జెప్పెద వినుడి!
ఆనందముగ మూడు మాసముల బిడ్డండు నతి చిత్రముగ పెద్దలం జేరి
వాదించు
మనిషి నక్కవోలె యరచు, నక్కయు పందిగను పంది నాయనా యని
యరచు నెలుగెత్తి
ఎనుబోతు యమకేక వేయు నా శబ్దంబు విను వీధులంతటను ప్రళయ
శబ్దము లీను ॥ఈ
సకల వ్యాధులచే తుపానులచే కొండ శిఖరములు పగులుటచే జన నష్టమైపోవు
ఇకను నెంతో గలదు ఎరిగింతు తర్వాత నిపుడు మీమీ యిండ్లకేగి రండనె
స్వామి
వారలందఱు స్వామి పాదముల పైన వ్రాలి అనేక విధంబులం గొని యాడి
కారుణ్య మూర్తి యాఘనుని దీవెనలంది కదలిపోయిరి మౌని కడునిష్టతో
నుండె ॥ఈ

ఆ పూరిజనులు స్వాములవారిని దేవునిగా భావించి గొల్వ, మా
యావి ఈతడని శివకోటయ జనులందఱితో వచియించుచు నుండెను

అచటి వారలు మౌని మహాత్ముండని, యాతని కెటుజెప్పినను
ఇచ్చగింపకను స్వాములవారిని యేమేమో యనుచుండె

సచ్చరిత్రుడు శివకోటయ భార్య స్వప్నంబున తన లీల
అచ్చంపు ఎఱుకలసాని వేసమున నచట చటను దిరుగాడుచును
సోదోయమ్మ! సోదె చెప్పెదను సోద్యము గలుగగ మీకు
ఆది మధ్యాంత జీవిత విశేషమంతయు దెల్పెదనమ్మా

అప్పుర రమణులు కొందఱు నాయమ ననుసరించి యిట్లనిరి
చెప్పెదవా? ఉన్నది-ఉన్నట్లు విశేషములనగ నామె
చెప్పెద నొప్పుగ, నాధ్యాత్మికమున చెన్నొందు జ్ఞానధనులు
గొప్పవారలకె తెలియు మూఢులకు గోచరము గాదు నా మాటలనెను

వారిలో కొందరు శివకోటయ సతి యొద్దకేగి ఓయమ్మా! ఘన
ఊరిలోన నొక ఎఱుకలసాని జేరి సోదె జెప్పెద ననుచున్నది
కావున మీరా యెఱుకలసానిని గారవమున రప్పించి యిచ్చుటకు
గోవిందమ్మ వివాహవిషయమును గోరి యడుగుడన పిలుచుకరండనె

వారలేగి యా యెఱుకలసానిని కోరి తీసికొని రాగా
కూరిమితో నామెను గూర్చుమని కుశల ప్రశ్నంబు లడిగి
తాంబూల, దక్షిణాదుల నొసంగి గోవిందమాంబతల్లి
శాంభవిదేవిని దలంచి యెఱుకత సరసన గూర్చొని యనియెన్

అమ్మా! నా మనసున గల కోర్కెల నన్నియు దెల్పెదవేని
సమ్మతి నీ వడిగిన కట్నము చాల నొసంగెద ననుచు బలుకగన్
సమ్మతించి లేనగవున నెఱుకలసాని చేతి బెత్తంబు కొనను ఆ
యమ్మ హస్తమున తడవుచు మెల్లన నఖిల దేవతల ప్రార్థించి
అమ్మా! చెప్పెద నింక శ్రద్ధగా నాలకింపవే తల్లీ!
కొమ్మరో! నీ మనంబునన్ గల్గు కోర్కెలెల్ల విశదముగ

అవ్వా! నీ కొక యాడు సంతాన మమరియున్నదే దుండీ!
జవ్వనవతియై దైవభక్తిచే చాల యలరారుచుండె
ఆ కలికి మది నొక్క కోర్కె గల దా విషయ మెఱిగింతు
ఒక మహనీయుని ప్రాణేశ్వరునిగ వలచియుండె నా బాల
మొన్నటి దినమున సాయంకాలం బెన్నగ మీ తలవాకిట కూర్చొని
యున్న యా ఘనుని జూచి నీ బిడ్డ యుప్పొంగిపోయె ప్రేమాస్పదయై ॥వి

అప్పటి నుండియు నీ కూతురు నిద్రాహారంబుల లేక యుండెనే!
అప్పురుషుని పెండ్లియాడకుంటే నామె భూమిపై బ్రతుకదె తల్లీ!
అతడు కూడ నీ సుపుత్రికన్ నవలోకించియు ప్రేమించియుండె
నో తరుణీమణి! వీరి వివాహంబొక యాదర్శప్రాయము జగతికి ॥వి

వాడు దైవాంశసంభూతుడు మొనగాడు మౌనీంద్రతిలకుడు
ఈడు తగువాడు నీ బిడ్డకు సరిజోడువాడు నవమోహనరూపుడు
ధరణి జనుల యజ్ఞానముం బాపి, పరమపావనులుగా జేయుటకై
నరరూపంబున నవతరించిన నారాయణాంశుండే కొమ్మా!
ఈ వూరి శివాలయంబున నాతండిపుడు యతి రూపమున నున్నాడు
కావున వానిని యిటకు రప్పించి కన్య నొసగి పరిణయ మొనరింపుడు
మేలుగల్గు నే బోయివత్తు ననుకూలమౌ నన్ని మరల నీ పెండ్లి
కాలమునకు నే వత్తు నా కపుడు ఘనముగ సన్మానింపుమని యేగె ॥వి

చింతావృతయై గోవిందమాంబ సెజ్జ మీద బవళించి
అంతులేని యావేదన బొందగ నటకు తలిదండ్రులరుదెంచి
తల్లీ! నీ విటు దుఃఖ మొందుటకు తగు కారణమేమమ్మా! మా
యుల్లంబుల బాధించుచుండె నీ యునికి నెఱింగింపుమమ్మా!
చెప్పవె తల్లీ! యయ్యది యేమో? శీఘ్రగతిని మా కిపుడు
తప్పక తీర్చెద మది యేదియైన తక్షణంబనగ నా యమ్మ ॥వి

జననీజనకుల్లారా! నా మనసున గల్గినట్టి చింత
వినిపించెద నది, నా జీవితమున కనువైనది మీ చెంత

మొన్నటి రోజున మన తల వాకిటి నెన్నగ నొక సన్యాసి రూపుండు
నన్ను జూచి చిరునగవున నేగెను నవమన్మథు డాతండు
పరగ బ్రహ్మతేజమున వెలుగొందు పరమపావనుండతడు
హరియించెను నా నెమ్మనంబు నే నతనికి దాసినసైతి కావునన్
వానికి నాకు వివాహము జేయుడి వలదంటిరేని యేను
ప్రాణత్యాగము చేసికొందు వి పరపురుషుని నే నొల్ల ॥వి

ఇంత కంటె కోరికలు నా కేవి లేవనుచు తా బల్కె
కొంత తడవు చింతించి వార లా కుమార్తెనుం గని ఇట్లనిరి
బిడ్డా! నిన్నతి గారాబంబున బెంచుకొంటి మో యమ్మ!
అడ్డు తగిలె విధి మా యాశయముల కది మా కర్మం బమ్మా!
దేశదిమ్మరుండగు బైరాగికి తెలివిమాలి నిన్నొసంగగలమా?
ఆశ విడిచి ధనవంతుని వివాహంబాడుము సమ్మోదమంద
అని వారలు నెన్నెన్నో విధముల తనయకు బోధించినను
విన నొల్లకుండె గోవిందమాంబ జనని భర్తతో నిట్లనియెన్ ॥వి

నాథా! యీమెకు నెన్ని విధంబుల బోధన చేసిన నిక మనకు
లేదు ఫలితంబు! ఈమె త్రోవనే పోదమనుచు చెప్పుచును
కన్న మమతచే మన ధర్మంబును కనపరచి నారమంతే
ఎన్నగ నెవ్వరి విధివిధానంబు లెటులున్నవియో యవి జరుగున్
అదియునుం గాక రాత్రి నా స్వప్నమందు నొక యెఱుకలమ్మ
పదిలమ్ముగ మన బిడ్డ జెప్పినట్లె పల్కి మరియు నిట్లనియెన్ ॥వి

ఆ మహనీయుడు కారణజన్ముం డతనికి మీ సుత నిండు
క్షేమమౌను లోకవిఖ్యాతి జెందెదరు మీరలనుచు వచియించె
కాన, నీమె నా జడధారికిచ్చి కల్యాణం బొనరించుటె శ్రేయము
ప్రాణనాథ! మన యింటికి వానిని ప్రసాదంబునకు పిలుచుకరండనె ॥వి

సరియె నని శివకోటయ్యశిల్పి జనె శివాలయంబునకు
పరమపావనుడు సమాధి నుండగ ప్రక్కన గూర్చొనియుండెన్

కొంత తడవునకు నిష్టనుండి గుణకోవిదుండు మేల్కొనగా
చెంత నున్న శివకోటయ స్వామిని జేరి వినయ ముప్పొంగ
స్వామీ! తమ దే యూరు? ఏ కులం బేమి నామధేయంబు?
నా మది వినగ కుతూహలంబయ్యె నో మహాత్మ! దయగనుడీ! ॥వి

అని వేడగ స్వామివారనియె, నయ్యా! మే మగసాలె వారలము
జనులందురు నను 'వీరబ్రహ్మంబ'ని ధారుణి నా యూరు
కందిమల్లయ్యపల్లె నేను నందందు సంచరించుచును
ఇందు వచ్చితి ననంగ నా శిల్పి యిట్టు లనియె నో స్వామీ!
మేమును విశ్వబ్రాహ్మణులమె? మీరేమి యనుకొనక నీ పూట
తాము మాయింట గుడిచి మమ్ములను ధన్యులజేయుడనుచు వేడుకొనె ॥వి

అందులకు మౌని యటులే వచ్చెద నయ్యా! యీ పూటకు నా దగ్గఱ
ఉంది రాగిసంగటి ముద్దొక్కటి యుపయోగింతును సహపంక్తిననియె
తమ యిష్టముగానే గావింతురు తరలిరండనుచు నా శిల్పి
తమ యింటికి గొంపోయి స్వాములకు తగు మర్యాదలు గావించి
కుశలప్రశ్నల యందున్నయపు డా శివకోటయ్య నా మౌని
విశదంబుగ తన చిన్ననాటి కథ వివరించియు నా కెవరు లేరనియె ॥వి

అంతట వారలు స్నానసంధ్యాదు లాచరించి సహపంక్తిని గూర్చొన
సంతోషమ్మున గోవిందమాంబ జనని వడ్డనకు రాగ
స్వామి, అమ్మరో! నే దెచ్చుకొనిన సంగటినే వడ్డించుము నా కిక
నేమియు వలదని యనగ 'సరే' నని విప్పి చూడ నా సంగటిమూటను
పంచభక్ష్యపరమాన్నంబులునై పరిఢవిలుచు నుండెనందు
ఎంచ సుగంధపరిమళమ్ములను నెసగుచు వేడిగ నుండె
భార్యాభర్తలు నీ విచిత్రమును పరికించియు వెఱగొంది
ఆర్యా! మీరలు సామాన్యులు గాదనుచు గొనియాడుచుండి
భగవంతుడవే నీవు నిజంబుగ జగతి నుద్ధరింపంగ
దిగివచ్చిన యవతారపూరుషుడవు, దివ్య రూప! మా తనయ

తెలిపె మాకు మీ పావనచరితము తెలివిమాలి తాము సామాన్యునిగా
దలచి మిమ్ము తూలనాడితిమి మా తప్పులన్ని క్షమించుడని మఱియు ॥వి

మీ పవిత్రామృత హస్తములచే తాపసోత్తమా! దయను
ఆ పవిత్రమగు ప్రసాదమును మా కనుగ్రహించం డనగ
స్వామి కరుణించి యటు లొనరింపగ, సత్వరమున తమ కొమరిక
నా మహనీయుని దరికి జేర్చి సాష్టాంగ నమస్సులు గావింప
మౌని దీవించి, ప్రసాద మొసంగిన మగువ సిగ్గునన్ గ్రహియించి
లోని కేగి తన కోర్కె దీరె నని మానినీ తిలక మతి హర్షంబున ॥వి

ఆ రేయి కొన్ని దేవరహస్యము లా దంపతులకు నెఱిగించి
వారి ప్రేమకున్ పాత్రులయిరి శ్రీవారు భక్తమందారులు
బిమ్మట వారలు శుభముహూర్తమున ప్రియకుమారియౌ గోవిందమ్మను
అమ్మహాత్మునకు నిచ్చి కల్యాణ మతి వైభవముగ జేసిరి వారలు
కొన్ని దినంబులు అత్తవారింట గడపి యా మౌని వారి
మన్ననలందియు ధర్మపత్నితో మరలె కందిమల్లయ్యపల్లెకున్
అచ్చట వారలు భక్తాదులతో, ఆధ్యాత్మిక వేదాంత చర్చలతో
సచ్చరిత్రులుగ గణుతికెక్కుచును సంసారవార్ధి తరియించుచు నుండిరి
అంత నొకనాడు గోవిందమ్మతొ ననియే వీరబ్రహ్మేంద్రస్వామి యో
కాంతా! క్షేత్రములను దర్శింపగ గల్గె కోర్కె నా మతిని యని తెల్ప
సంతసమున నా యమ్మ యిట్టులనె స్వామీ! నేను మీతొ వచ్చెద
ఇంతకంటె యవకాశమింక నా కెపుడు గల్గునని వేడ
సమ్మతించె నాతండు నందులకు సాధ్వీ! యీ పంచమి గురువారము
సుమ్ముహూర్తమది కావున అందుకు సుదతీ! ప్రయాణమేర్పరచు మనియె ॥వి

అటులవారు నిర్ణీత సమయమున నరుదెంచుచు విపినముల
జటధారుల మౌనీంద్రుల ఋషులను సందర్శించుచు మరియు
క్షేత్రరాజముల సేవించుకొనుచు శ్రీశైలంబు జేరి నిష్ఠతో
యా త్రినేత్రునకు పూజలొనరించి యచట కొంత కాలంబు నివసించె ॥వి

అచట నుండి బనగానపల్లెకున్ నరుదెంచియు లోమఠములో నున్న
సుచరిత్రులను భక్తులను నవాబును చూచి సంతోషపరచి
మఱియు కొన్ని క్షేత్రముల సేవించి మహనీయులు తర్వాత
తిరిగి కందిమల్లయ్యపల్లెకున్ జేరి సుఖముండి రంత ॥వి

ఇటులుండగ నా గ్రామస్తులంత ఈ మహనీయున కొక మఠము
పటుతరముగ గట్టించిన మేలని భావించియు నటులొనరింప
స్వామివారలా మఠమున జేరి సరసకు వచ్చెడి భక్తులకు
కామితార్థముల దీర్చుచు వారిచె గౌరవింపబడుచుండె ॥వి

అంతట గోవిందమ్మ గర్భవతియై నొక సుముహూర్తమున
కాంతులీను తేజోమయ పుత్రుని గనెను సిద్ధలింగయ్యనామకుని
మఱియును గోవిందయ్యయు, శివరామయ్య, పోతులూరయ్య
పరగ నోంకారాచార్యుండును పంచపుత్రరత్నములన్
వీరనారాయణమ్మ యను నొక్క విజ్ఞానవేత్త పుత్రికామణియు
వారికి గల్గిరి, శ్రీశివకోటయ కోరగ జ్యేష్టుని దత్తుగ నిచ్చిరి ॥వి

తక్కిన వారికి పెండ్లిండ్లు చేయదలచి బ్రహ్మేంద్రస్వామి
అక్కడక్కడన్ కన్యలను వెదకి అభిలషించి మోదమున
కోమలపేటలో 'గిరెమ్మ'యనియెడి కోమలాంగిని ద్వితీయపుత్రునకు
ధీమతి యుత్సవ్వలమర పురమున సతీపాపమ్మను తృతీయునకు
మఱియును కోమలపేటయందునే పార్వతమ్మ పోతులూరయ్యకు
మరియొక స్థలమున ఓంకారయ్యకు మాటలాడి యొక కన్యన్
శుభముహూర్తముల వివాహాదులను సొబగు మీర గావింప
శుభముగ నుండిరి అటుపిమ్మట నొక శుభముహూర్తంబునందు ॥వి

విద్యావంతుడు తత్కులజునకున్ వీరనారాయణమ్మ నొసంగియు
అధ్యాత్మికుండు పెండిలి యొనర్చె నాచారక్రమమొప్ప
వేలకొలది జను లచటికి వచ్చియు చాలమంది స్వామికి శిష్యులయ్యె
చాల వేదాంతధర్మము లారసి సన్నుతించుచుండిరి శ్రీవారిని ॥వి

ఇటులుండ కందిమల్లయ్యపల్లె కెనిమిది మైళ్ల దూరమునం గల
దట 'ముడుమాల'ను గ్రామంబున సదాచారుడు దూదేకులకులజుడు
పీరుసాహెబును, ఆదంబీయను ప్రియదంపతులకు పుత్రులు లేమిని
వారు ఎన్నెన్నొ ధర్మకార్యంబు లొనరించుచును మహమ్మదున్ వేడ
పరమేశ్వరు దయవలన సుపుత్రుని బడసి రొక్కనిన్, వారు వానికిన్
పరమసంతసంబున 'సిద్దయ్య' నా పవిత్రనామంబిడిరి ॥వి

దినదినము శుక్లపక్ష చంద్రుడుగ దీపించుచు నెదుగుచుండె సిద్దయ్య
పనిచిరి యేడవ సంవత్సరమున పాఠశాల కా బాలకుని
అందఱి కన్నను మిన్నగ నాతండధిక విద్య నార్జించుచును
ముందుగనే గురు మన్నన లందుచు ముఖ్యుడై యుండె నచట ॥వి

శాంత శమదమాది సద్గుణంబులు సర్వదా కలిగియుండి
వింత గొల్ప తన తల్లిదండ్రులకె వినిపించెడు వేదాంత బోధనలు
జీవకారుణ్య మహింస త్యాగము భావరంజితంబనుచు
నేవియు దుష్కృతు లంటకుండుటయె ఈ జన్మకు ఫలితంబు
అని యీ విధమున తోటి బాలురకు నతి వినయమ్మున దెలిపి
ఘనుడుగ వారల చేత బాలకుడు గౌరవింప బడుచుండె ॥వి

పన్నెండేడుల ప్రాయము రాగనె ప్రహ్లాదుని విధమునను
ఎన్నెన్నో వేదాంత రహస్యము లెఱిగించుచు తా నుండె
పదునాల్గేడులు రాగనె బాలుడు బ్రహ్మజిజ్ఞాసను నొంది
వెదకుచుండె సద్గతి జేర్చు సంవేద్యుని దేశకరత్నమును ॥వి

సదయుడు వీరబ్రహ్మ మహత్వము సాధువుల వలన నెఱిగి
కదలెను తలిదండ్రులను వీడి తా కందిమల్లయ్యపల్లె
స్వాములవారి మఠమ్మునకు జొచ్చి చాల మంది శిష్యుల మధ్య
బ్రహ్మతేజమున వెలుగొందెడి యా భాగవతుని దిలకించి
తన్మయత్వంబు నొంది ఏమిః నా దక్షణనేత్రం బదరుచుండె నా
జన్మసఫలమయ్యె నేటితోనని స్వామివారి దరిజేరి ॥వి

వాని పాదముల వ్రాలి సాష్టాంగ వందనం బాచరించి
దీనరక్షకా! యిక మీరె నాకు దిక్కు శిష్యునిగ స్వీకరింపుడనె
అంత స్వామి 'సంకల్పసిద్ధిరస్తు' దీవించె, సిద్దయ్య, స్వామి
చెంత కూరుచొని పాదసేవలన్ జేయుచుండె నతి భక్తిన్!

## పంచమాశ్వాసము

మహమ్మదీయుండై న సిద్దయ్య మౌని వద్ద భక్తుడుగనుండె నని
మహా కోపమున పోతులూరయ్య మండిపడుచు తనతండ్రినిం జేరి
జనకా! సిద్దయ్యనియెడు నీతడు గన మహమ్మదీయుండని తెలిసెను
మనకు నపకీర్తి గల్గు వీనిచే, గనుక వీనినిన్ వెడలగొట్టుడనె ॥వి

స్వామి వారు లేనగపున నిదియా సమస్య! నీకును నీ తల్లికనుచు
నేమి చెప్పినను వారు వినకున్న నిట్టులనియె సిద్దయ్య దీనుడై
ఓ మహనీయుల్లారా! మీలో నొకనిగా నెంచి నన్ను గాపాడుడీ!
ప్రేమ తోడ మీ బిడ్డ విధంబున బెంప మిమ్ములను వేడుకొనుచుంటి
కులహీనుడ నని కదా? మీ రిటుల కోపంబున నను దూరుచుండుటలు
కులమతంబులకు నతీతంబై నది గుణమె కారణంబందు రార్యతతి ॥వి

తలప వాల్మీకి యందాది ఋషులు తరించుటకు నేది మూలమయ్యెనని
పలు విధముల వేడుచును కాళ్లపై బడి దీనుండై దుఃఖమందినను
వినక, నీవే మాకు ధర్మంబులు వినుపించునంత వాడవ? పొమ్మని
అనుచు తిట్టుచును, కొట్టగ సిద్దయ యతివరేణ్యు దరి జేరి
పాదముల నంటి పాహి! పాహి! యని ప్రస్తుతించి యో తండ్రీ!
మీ దయ నన్నెటుజేసినం గాని మిమ్మే నమ్మితి స్వామీ! ॥వి

తల్లియు తండ్రియు గురుదైవము నా కెల్ల బంధుగులు మీరే
యుల్లమలర నను మీ బిడ్డనిగా నెంచి యిచట కాపాడ వేడెదను
సర్వస్వంబును వీడి మీ చరణ సాన్నిధ్యంబున నుండ దలంచితి

ఉర్వి లోన మీరే నా కంతటి కున్నయట్టి యాధారభూతులనే
అంత స్వామి సిద్ధయ్యగారితో ననియె నీదు తలిదండ్రు లెవ్వారు?
ఇంతకు నీ కులమెయ్యది? నీ యూరేది? తెల్పుమన నతడు

దయామయా! 'ముడుమాల' మాది, ఆదంబి-పీరుసాహెబు తలిదండ్రులు
నయగుణ దూదేకుల కులజుడ ధనమ్ము తనువు భోగము లస్థిరమని
తలచి మీ పాదసేవ జేసి నేతరించుటకు మీ సన్నిధి జేరితి
కలుషదూర నన్ తొలగజేయకయె నిలుపుకొనుము నీ వాడనని వేడె ॥వి

అంత స్వామి వారలతో నిట్లనె శాంతి వహించుడి మీరు
చింత చేయగా వెట్టిభ్రాంతు లివి చెప్పెద శ్రద్ధగ వినుడి!
ఈషణత్రయంబులను దగుల్కొని యిష్టమొచ్చినటు నరులు
దోషవారినిధి మునిగి తేలుచును తుదకు యముని దరి జేరి
నరకయాతనల ననుభవించుచును నానా యోనులం బడియు
మరియు పుట్టుచును గిట్టుచునుందురు ఎఱుగజాల రీ నిజమున్ ॥వి

కులమేదైనను గాని యందఱును మలమూత్రపు దుర్గంధ శరీరులె,
తలచిమీర లీ బాలుని మీ వలె తాలిమి తోడన్ గౌరవించుడనె
ఇది యిటులుండగ ముడుమాలలోన వెదకి సిద్ధయ్యను తలిదండ్రులు
నదులును, బావులు, గుంటలు, చెఱువులు నానా దిక్కుల నెల్లన్
బాలకుండు కనుపింప కుండుటచె బహు విధముల దుఃఖించుచును
వ్రాలి నేలపై దొర్లుచు ఆయమ చాల యాతనం బొందుచు నుండగ
ఆమె యొద్దకున్ పీరుసాహె బపుడరుగుదెంచి యో కాంతా!
ఏమియు భయంబులేదు మన బిడ్డ క్షేమముగా నున్నాడని తెలిపెను ॥వి

కందిమల్లయ్యపల్లెలో మహాఘనుడు వీరబ్రహ్మేంధునకు చిదా
నందముగా శుశ్రూష చేయు చున్నాడని కొందఱు సాధువులు దెల్ప
నిపుడే నే కందిమల్లయపల్లెకేగి మన కుమారరత్నంబును
తప్పక వెంటనె తోడితెత్తునని తా ప్రయాణమై చనియె ॥వి

అటుల నేగి భక్తాదుల మధ్యన అధివశించియున్న వీరగురునకు
పటుతర భక్తిన్ పాదము లొత్తుచు బాలసిద్ధుడగుపించెన్
అమిత సంతసంబున నా కొమరుని ఆలింగన మొనరించి
నిమురుచు దేహము తండ్రీ! నిన్నొక నిముస మెడబాయగలమా?
మతిచలించి నటువంటి వానివలె మమ్ము వీడి రాతగునా? మన
మతస్థులందఱు పరిహసించియును మనలను వేరొనరింప కుందురే? ॥వి

నీ కొఱకై నీతల్లి తపియించి నిద్రాహారములు మాని యుండె
చీకటియయ్యె నిక నీవె మా బ్రతుకు శీఘ్రంబుగ నా వెంట రమ్మనియె
వృద్ధులమై నటువంటి మమ్ములను నుద్ధరించి కడతేర్చననే గద
యిద్ది నీకు ధర్మంబు, లేకున్న నటుల నీకు మోక్షంబు గల్గునా?
అని పల్కెడి యా పీరుసాహెబుతో ననియె సిద్ధయ్య-తండ్రీ!
వినుము నా మనవి ఈ మహాత్మునిన్ విడచి యేను రాజాల!

సర్వ ధర్మముల కతీతుడౌ నీ స్వామి పదంబులె నమ్మి
నిర్వకారస్థితి నుంటి వీరి సన్నిధిని గోరి యో తండ్రీ!
కులమత సంపదలేమి భేదముల గూడి యజ్ఞాన జనులు
పలు విధముల భ్రమలందుచును కడకు భ్రష్టులై పోవుచుంద్రు ॥వి

కనుపించెడి యీ దృశ్యమంతయును కలగా నెంచుము తండ్రీ!
కనుపింపక జగముల పాలించెడి ఘనునిగ గనుటె సుఖమండీ!
ఆత్మవిచారణచేసి చూచితే అంతా మాయయె జనకా!
ఆత్మ యొక్కటే శాశ్వతంబు పరమాత్ముని జేరు పవిత్ర సాధనము
అని యీ విధమున సిద్ధయ్యగారు తన తండ్రికి వివరించి
జనకా! నీవిక నేగుము వందన శతంబులివె నీకనుచున్
నా తల్లికి నా వందనములనుము నన్ను గూర్చి చింతింప వలదనుము
ప్రీతితొ నను దీవించి పొమ్మనగ పీరుసాహెబటు లొనరించి
మౌనివర్యులం గాంచి దేవరా! మా కుమారకుని మీ పుత్రునిగా
దనుప వేడుకొనుచుంటి వానినిన్ ధన్యునిం జేయుండని ప్రణామమిడి ॥వి

బాలునిం జూచి తండ్రి, వీరిని భక్తిశ్రద్ధలతొ సేవించి
చాల జ్ఞానమార్జించుము నేనిక జనెద నంచు దీవించి
అచట నుండి గోవిందమాంబ కడ కరుదెంచియు నో తల్లీ!
ఇచట నా సుతుడు స్వామిసేవలో నెనసియుండె నటుగాన
తెలియక యేదైన తప్పు చేసిన కలత వహించక వానిన్
సలలితముగ మన్నించి మీ సుతుని సరణి జూడుడని సలామొనరించి
సెలవు నంది యా వూరిలో తనకు తెలిసిన యొక రెడ్డి యింటికిం జని
కలిసి వానితో సిద్దయ్య కథను తెలిపి యో రెడ్డిగారూ!
అపుడపుడు శ్రీ వీరబ్రహేంద్రునాలయమున కేతెంచి
కృపతో వానిని జూచివత్తురని కోరుకొనుచుంటి ననియు నా పైన
'ముడుమాల' కేగి జరిగిన విషయంబులు భార్యకు నెఱిగించి
వెడలివచ్చు చుండిరి అప్పుడప్పుడు కొడుకు దగ్గఱకు వారు

పీరుసాహెబటు వెళ్లిపోవగనే వీరబ్రహ్మముగారు
ఓరీ సిద్దా! వానితో బోక వలదని యుంటి వదేమి?
కన్నవారి మాటలను వినకున్న కలుగు దోసమ్ము-గాన
అన్నా! వారిని జేరి సేవించు మదియె ధర్మంబు, మఱియు
వారి కిష్టమైనట్టి కన్యకను వలచి వివాహంబాడి
గౌరవమున సంసార జీవితము గడుపుట శ్రేయంబౌను

నీ మూలంబున మాకు నపవాదు నేర్పడు గావున నికనూ, మీ
గ్రామమునకు బొమ్మనగ సిద్దయ్య కనుల నీరు నింపుచును
తల్లియు దండ్రియు గురువు దైవంబు తలప నన్నియును మీరే!
ఒల్ల నేదియును మిమ్ము దప్ప నా యుత్తమాశయం బిదియె
ఘోర కలుష సంసారవార్నిధిని గ్రుంకులిడక మీ దరిని
జేరినట్టి నన్నిందు ద్రోయ గురు శ్రేష్ఠ మీకు భావ్యంబె?

ప్రాణమైన విడిచెదనుగాని మీ పథమ్ము వదలగా జాల
దీనబాంధవా పరశివయోగము దెలిపి నను కృతార్థునిగ జేయుమనె

మౌని వానితో ననియెను నీ కిది మహాకష్టమురా సిద్దా!
కూనవు, అయ్యది బహు నియమంబుల గూడినట్టి పని యనుచున్
అదియునుం గాక యిపుడీ పురి మహమ్మదీయ పరిపాలనందుండె
నీదియు తద్వంశంబే గావున నేరమౌను మాకు పాలకుల వలన ॥వి

చేటువచ్చు నా మఠంబునకు నిను జేర్చుకొన్నందు వలన కొన్ని
చోటులందు హిందూ ఆలయములు పాటు దప్పె మీ వలన
అందువలన గోవిందపోతులూరాచార్యులు నిన్వలదనిరి
అందఱును నాకు ప్రియులె ప్రభుత్వభయంబు దప్ప వేరొండు గాదనియె
ఖేదమందుచును సిద్దయ్య గురుని పాదపద్మముల వ్రాలి
ఓ దయామయా! మిమ్ము విడిచి నేనొక్క క్షణము మనజాల
సర్వసములైన తమరే నన్నిటు సందేహించుట తగునా?
ఉర్వి యందు మీ కసాధ్యమయినది యున్నదే భయంబంద
ప్రాణములసైన తమ సన్నిధిలో పరిత్యజింతుసె కానీ
మాని యింటికిం బోవ?! మీ పదము లాన యనుచు దుఃఖించె ॥వి

స్వామిచంద్రుడు డబ్బురపడి ఆహా? యేమీ యీతని భక్తి! అపారము
ఈ మహి నెందరొ భక్తులుం గలరు ఇట్టి దృఢచిత్తు నెందునుం గాన
అరయ నితడు మున్ముందు విశ్వవిఖ్యాతి నొందు లక్షణంబులున్నవి
సరియె వీని శిష్యునిగ బడయ జన్మకు నొక యాదర్శం బబ్బును ॥వి

అని మనంబు నందెంచి బాలకుని కొన వ్రేళ్లను ముంగురులం దువ్వుచు
అనియెను బిడ్డా! యిక నీకే భయంబు లేదిట నిశ్చింత నుండుమని
ఘనపంచాక్షరి మహామంత్రమును కడు ప్రేమతొ బోధించి
అనయము నిశ్చల చిత్తవృత్తి యిది యాదరింపు మని పల్కె ॥వి

వేళయయ్యె నిక భోజనమునకు వెళ్లెదము లెమ్మనంగ
చాల భక్తితో గురుని వెంబడిని జనుదెంచె గృహంబునకు
స్వామి తారకమనస్కయోగముల సారాంశము నెఱింగించి సిద్ధునకు

ప్రేమ మీర తనస్వంత బిడ్డలా భేదరహితుడై యుండె ॥వి
గురువరేణ్యుడు శిష్యవర్గమును గూడి యుత్తరప్రదేశ సంచార
మరుగుదెంచె నొక శుభలగ్నంబున గురుపీఠంబును దీసికొని
కొన్ని గ్రామముల దర్శించుచు దొనకొండ, గుంటూరు, మంగళగిరులను
అన్ని పురంబుల పూజలందుచును హైదరబాదునకుం జేరి
అచట విశ్వబ్రాహ్మణులకు కబురంపె శిష్యులచే మౌని
మచ్చిక వారలు పల్లకితో కొని మంగళవాద్యంబులతో
పల్లకిలో గూర్చుండ బెట్టుకొని బజారులం దుత్సవంబు జేయుచు
నెల్లరు స్వామిని గొనియాడుచుండ నేగె వారి నిలయంబు ॥వి

అచ్చట నొక షడ్శాస్త్రపండితుని యాలయభూమిని విడిది కల్పించి
వెచ్చంబులు సమకూర్చి వార లతి వినయమ్మున స్వామిని సేవించుచు
వరుసగ తీర్థప్రసాదంబులను వారుగ్రహించియు నిండ్లకు పోయిరి
పరగ భోజనానంతరంబు నా పండితుండు శ్రీవారి దరిజేరి
ఘనుడా! మది నా కొక సందేహము గల దద్దానిని దెల్పరెవ్వరును
అనగనే స్వామి చిరునవ్వుతొ నా కంతయు దెలియునయ్యా! ॥వి

బాహ్య మధ్య అంతర్లక్ష్యంబుల భావపటిమయే గాదా? అ
నూహ్యంబైనది అది అన్యులకు మహోన్నతంబైన ఆత్మనిలయంబు
పూరక కుంభక రేచకంబులును ఆరు చక్రముల ఆధారంబును
తీరుతెన్ను లందద్వితీయముగ దెల్ప నతడు బ్రహ్మానంద మొందె ॥వి

మరు దినమున శ్రీస్వామివారిచే మహానివేదనంబు చేయించి
పురజనులకు తీర్థప్రసాదములు పొందగ తెలియం జేసె
ఆ పురవాసులు వేనవేలుగా ఆచార్యుల సన్నిధికి నేతెంచి
తాపసిచే తీర్థప్రసాదములు తనివిదీర సేవించుచు నుండిరి ॥వి

భూతగ్రహ బాధిత స్త్రీపురుషులు పీఠము కడకు రాగనే
చేత లుడిగి స్పృహదప్పి పడిపోవ జేరి సద్గురుం డటకు

చేత్రి బెత్తంబుతో నవ్వారల శీర్షంబుల నానింపగా నంత
చైతన్యవంతులై వారు మౌని చరణముల కెఱిగి నిల్వ
స్వామి వారు తీర్థప్రసాదము లొసంగ స్వీకరించియును
ఆ మహనీయుని గొనియాడుచు సెలవంది యేగిరి గృహంబులకు ॥వి

ఈ విషయంబు షడ్శాస్త్రపండితుండెరుంగ జేయ నవాబునకు
నావుడు వాని మహత్వం బెఱుగగ నభిలషించి తన భటుల కెఱిగించి
మేనా దీసుక వెళ్లి మీర లా మౌనీంద్రులను సగౌరవంబుగా
మా నిలయమునకు దోడ్కొని రండని యానతిచ్చె నాతండు ॥వి

వారలటులేగి యా మహనీయుని జేరి సలామిడి రాజాజ్ఞ దెల్ప
వీరగురుడు మేనాలో గూర్చొని వెడలె రాజదర్బారుం జేరగ
ఆ నవాబు సింహాసనము డిగ్గి యతి భక్తిని యెదురేగి జోహారిడి
వాని నంతటను మేలి యుచితాసనాసీనుం గావించి
వినయ విధేయుండై నిలువంబడి యనియె మహాత్మా! తమ రాకచె, పా
వనమయ్యె మా వంశమంత యని ప్రస్తుతించియును మఱియు
తమరు మహిమాస్పదులుగా వింటిమి ధన్యులమైతిమి మేమందరమును
తమ బోటి వారి యాశీర్వాదమె తరుగని అష్టైశ్వర్యములు మాకు
అని గొనియాడుచు స్వామీ! నా దొక మనవి గలదు అద్దానిం దెల్పెద
ననగనే స్వామి చెప్పపనిలేదు అంతయు నేను గ్రహించితి నాత్మలో
కావున నీ దగు కోరిక దీరును కదలి యిపుడు నీవే స్వయముగ, నే
బావి నీరైన సరియే! చెంబెడు పట్టుకొని వచ్చి పీఠంబు కడ నుంచి
క్రొత్త ప్రమిద తెప్పించి అందులో వత్తి వేసి యా వారినిం బోసి
చిత్తశుద్ధితో వెలిగింపు మనగ జేసె నటుల నా ఱేడు
అచట నున్న దీపముల కన్న నది యధిక దీప్తి వెలుగొంద
అచ్చెరువున సంతోషస్వాంతుడై యలరి యుండె నా రాజు
స్వామివారి కా రోజున భోజన సదుపాయంబులు గావించి
ఆ మహితునిచే తీర్థప్రసాదములంది ముకుళితకరుండై

మానవోత్తమా! చెప్పకయే నా మనసునం గలది గ్రహించి నారలు
గాన నా రాజ్యక్షేమములం దెలిపి కడు ధన్యుం జేయుడని వేడెను ॥వి
చిరునగవున సంతోష చిత్తుడై చెప్పెద శ్రద్ధగ నాలకింపుమని
పరమపావనుండా మహనీయుడు భవిష్యత్తు జెప్పందొడంగె నిటు

## కాలజ్ఞానము

చక్రవాకరాగం - ఆదితాళం

ఈ కలియుగమున జరిగే వింతల నెఱిగింతు కొన్ని వినండయా!
ప్రాకటముగ వీరభోగవసంతరాయులుగ నే వచ్చు వర కిటు జరుగును ॥ఈ

బిడియ పడక సరస్వతి నంగడిబెట్టి యమ్ముకొనుచు నుందురయా!
గడి దప్పియు ముస్సీనది పొంగి కడు నష్టంబౌ నీ పురమంతయు
మరల నీ పురిని నీ వంశీయులు మహాశోభతో తీర్చిదిద్దెదరు
అరయ నీ రాజ్యమున నుండు యడవు లన్నియు ఫలవంతమ్ములై యొప్పు ॥ఈ

స్మశానస్థలముల భక్తులుండెదరు చాలగ పల్లెలు పట్నాలయ్యెడు
ప్రశస్తముగ చీమకుర్తి పట్నంబౌ పన్నెండామడలు గలదిగా
మఱియు నద్దంకి నాంచారమ్మ నరుల తోడ మాట్లాడును వింతగ
పరగ శ్రీరంగనాయకుల వద్ద పవిత్రమగు వాద్యములు వినంబడు ॥ఈ

తన్నుతా నెఱుగు రాజయోగులకు తప్పక నాదర్మంబగుచుండు
గ్రన్నన దుష్టులు రాక్షస గుణములు గలిగి వక్రసంభాషణ చేతురు
ఒప్పుగ సువర్ణముఖినది యందున నుద్భవింతురు మహాత్ములు పదుగురు
అప్పుడు నాయుడుపేటలోని ధనమంతయుం దొలగిపోవు పూర్తిగా ॥ఈ

తూర్పు దేశమంతయు నాగరకతతో విలసిల్లుచు నుండునయా!
మార్పు జెంది కొన్నాళ్లకు నయ్యది మహాదరిద్రత నొందునయా!
ఇత్తడి బంగారమంత ధరయై యోర్పడి అమ్ముచు నుండునయా!
ఉత్తములై కొండవీటిపురజను లుల్లాసంబుగ నొద్దిక నుందురు ॥ఈ

బంగాళాదేశమున నివశించు ప్రబలమైనట్టి పురజనులందఱు
గంగాప్రవాహమునను దగుల్కొని కాలవాహినిలొ కలసిపోవుదురు ॥ఈ

కులగోత్రంబులు లేక వివాహంబులను జేసికొను చుందురయా!
తలప వర్ణాశ్రమంబులుం లేక ఖలులు వర్తించుందు రెక్కువగ
కావున నీవు సదా నన్ మరువక కడు భక్తితొ స్మరియించు కొనుచు నీ
జీవిత పర్యంతము సుఖమ్ముగా చెన్నొందు మనుచు మఱియు నిట్లనియె ॥ఈ

నీ వంశజులు సుఖంబు నుందురని దేవరహస్యంబులు కొన్ని దెల్పి
దీవించి తనదు పీఠంబు కడకు దివ్యపురుషుడాగమనము చేసెను
వీరబ్రహ్మంగారు చెప్పినది విని నవాబు ఆనందమంది శ్రీ
వారికి కానుకలొసగి మ్రొక్కి సెలవంది రాజుసౌధంబున కరిగెను ॥ఈ

# షష్ఠాశ్వాసము

స్వాములవారిని సిద్దయగారిని షడ్చాస్త్ర పండితుండు
ప్రేమమీర సేవించుచు వారికి ప్రీతిపాత్రుడై యుండె ॥వి

అచట కొన్నినాళ్లుండి పండితుని ఆశీర్వదించి సెలవంది
సుచరిత్రుడు తన బృందముతొ శుభసమయంబున గదలి
కొన్ని క్రొత్తగ్రామముల దర్శించుకొనుచు బెజవాడపురము జేరి అం
దున్న కనకదుర్గాంబ కడకేగి యుపాశించుచును నద్దేవిన్
ఆ విధమున నా దేవి సన్నిధిని అధ్యాత్మిక చింతనలం గడుపుచు
పవిత్రహృదయుం డైదు రోజు లట భక్తులతో నివశించె ॥వి

అమ్మహనీయుడు సిద్దయ్య మీద నతి వాత్సల్యత నుండ
సమ్మతింపకయె శిష్యుల పయి భేదమును జూపు మన గురుడు
అన్ని విద్యలలో సిద్దయ్య యధికమేమి మనకన్నన్?
చిన్నతనము గాదా మన కిది యని చెప్పుకొనుచుండ్రి వారిలో వారు ॥వి

అది పొడగట్టిన స్వామి తలయూచి యిది యా సిద్ధునిపై వీరికి గల
అధిక యీర్ష్య యొకనాటికి దెల్పెద నతని దృఢభక్తియని యూరకుండె
మరు దినమున వారంద రట నుండి యరుగుదెంచి తెనాలి, బాపట్ల
చీరాలయు, ఒంగోలు, నెల్లూరు, శ్రీకాళహస్తి, తిరుపతి, తిరుమల
మొదలగు పుణ్యస్థలముల మోదమ్మున దర్శించుచు నటుపై
కదలి కడపసీమకు జనుదెంచుచు కాననముల వీక్షించుచు నేగిరి ॥వి

స్వామివారి సంకల్ప సిద్ధిచే చచ్చిన శునకంబొండు క్రిములచే
నా మార్గమున బడియుండె నతి దుర్గంధయుతంబై
దరికిజేరి సిద్ధయ్య వినా మఱి తక్కిన శిష్యులగాంచి
పరమపావనుడు వారితొ నిట్టుల బల్కె మీర లీ కుక్కను దినుడన
ఒకరి మొగమొకరు చూచుకొనుచును నోర్వలేని దుర్వాసనకు నడలి
తికమకలై యేమియు మాటాడక దిక్కులు చూచుచునుండ్రి ॥వి

అంత సిద్ధయ్యగారు స్వామీ! మీ యాజ్ఞయైన నీ శునకమ్మును నే
సంతోషంబున నారగింతుననని స్వామి పదంబులనంటె నాఘనుడు
గురునానతి యానందంబున నా కుర్కురంబు నంతయు భక్షింపగ
వెరగంది వారలా దృశ్యమునకు విభ్రాంతి నొంది రంత ॥వి

'చిత్తశుద్ధోభవా'యని సిద్ధుని శిరమున స్వామి కరముంచి దీవించె
అత్తరి వారల గాంచి స్వామి యిట్లనియె, చూచితిర! సిద్ధుని ప్రవృత్తి
అదియే వానిలో దృఢభక్తి ఆత్మస్థయిర్యము గురుసేవారతి
అది యెఱుగక కులశ్రేష్ఠుల మనుకొని యసూయ గంటిరి మీరు వానిపై
బిడ్డలార! యికనైన వానిపై భేదభావంబు విడచి సఖ్యతతొ
దొడ్డగుణంబుల మెలగు చుండుడన దోయిలొగ్గి వారపుడు ॥వి

మహానుభావా మేమజ్ఞానులమై మీ మహిమను నెఱుంగ జాలక
మహాపరాభవ మొనర్చినాము మము మన్నింపుడనుచు పాదములంటిరి

అట నుండి కొంత దూరమేగగా నా బాట ప్రక్కనే యుండిన యొక
వటవృక్షమ్ము క్రిందకు వేంచేసియు వారందరు విశ్రాంతి బొందిరట ॥వి

సిద్దయ్యగారు స్వామి పదంబుల చెంతనె గూర్చొని యుండె
నిద్దురపోయిరి మిగిలిన వారలు పెద్దాయన సెలవంది
అనె గురుడపుడు సిద్దయ్యతొ సిద్దా! విను మీ స్థలమున నొక ఝామునలోన
గనియెద మొక మహాద్భుతం బిపుడు కడు చిత్రంబుగ నుండునని పల్కె ॥వి

అటుల కొంత సేపటికి స్వామి కొక ఆర్తధ్వని వినుపింప సిద్దునితొ
నిటులననియె బిడ్డా! యెట నుండియొ యేదో రోదన వినవచ్చుచుండె
ఇపుడే మనమందర మచ్చోటికి సేగవలయు శిష్యులను లేపుమన
అపుడు సిద్ధుడటుల నొనరింపగ వారండఱును గలసి చనుదెంచి రపుడు ॥వి

మౌనీంద్రుడు వశించియున్న యా మాహావృక్షమ్ము నీడ నొక ప్రక్క
దీనత్వమున కుష్టురోగియౌ ద్విజుడొకండు తన కాంత తొడలపై
శిరమునుంచి పరుండి యొడలంత చీము నెత్తురుల మయమైయుండగ
పరమేశ్వర! యికనైనను నను నీ దరికి జేర్చుకొనరాదా? దేవా!
భరియింప జాలకుంటి నీ బాధ భక్తావన యని పరితపించుచును
పరమపతివ్రత మహాశీలయౌ భార్య తోడ నిట్లనియెన్ ॥వి

కాంతా! యతి దుర్గంధంబౌ నా కాయంబును వీపునకు గట్టుకొని
చింతాకంతయు నేహ్యభావమును జేరనీక మది మోయుచునుంటివి
ఎన్నో క్షేత్రంబులను ద్రిప్పితివి యెన్నో నదులలొ గృంకించితివి
ఎన్ని చేసినను పాపఫలితంబు నెవ్వారలైన పొందవలసినదె

గత జన్మంబున నే నెన్నియో ఘాతుకమ్ము లొనరించినాడ ఈ
గతి బట్టె నాకు నా మూలంబున గల్గె నీకు మహాకష్టంబులు
అతి సుకుమారివి నిన్నిటు జేసినయట్టి నే నిన్ను జూడజాల! నా
బ్రతుకెందుకు మరణించుటె మేలని పల్కి తా మూర్ఛనొందె ॥వి

అంత నామెకు నేమియు తోచక అక్షుల బాష్పము లొలుకుచుండగా
కాంతా! యేమిది? కనులు దెరువుమని కడు జాలిని ప్రశ్నించి

పైట కొంగుతొ పతి మేను శుభ్రపరచి గాలివీచుచు నో నాథా!
యిటుజూడు మనుచు భయోత్పాతయై యెలుగిచ్చి పలికె జీవితేశ! నా
సర్వస్వము నీవే! నీవు లేక క్షణమైనను బ్రతుకజాల ననుచును
సర్వేశ్వర! దీనబాంధవా! పాహి! సరగున నా పతిని బ్రోవుమటంచు
పరిపరి విధముల రోదించుచుండ బ్రహేంద్రు డచటి కేతెంచి
తరుణీ! యెవ్వతెవీ? వితడెవ్వడు? పరితపించుటకు కారణమేమన
కరుణామయ! యీతండు నా భర్త కడుభయంకర వ్యాధిగ్రస్తుండు
పరితపించుచును కనులు మూసికొని పలుకు ఉడిగి స్పృహదప్పె దేవరా

మౌనీంద్రుని గని యీతడెవ్వరో! మహనీయుని వలె దోచుచుండెడిని
ప్రాణేశుని మెలమెల్లగా లేపి పరుండంబెట్టి స్వామి కంజలిడి
లేవలేకుంటి నా కాహారము లేమిచే కనులు తిరుగుచు నున్నవి
దేవా! నను క్షమింపుడని వేడ దేవర కరుణామయుడై
తల్లీ! యీ ఫలమును దినుమనుచును తాపసి యొక పండివ్వ
కళ్ళకద్దుకొని భర్తలు దినకయె కరుణామయ! భార్యలు భుజింతురే?
ఆర్త్రత్రాణపరాయణులు మీరలై తిరేని యీ సమయంబున నా
భర్తను రక్షించి యాపైన పరగ నన్ను రక్షింపుడని యనగ
తడయక సంయమి రోగి కడకేగి తన హస్తంబును వానిపై నుంచి
యొడలంతయు స్పర్శింప నాతనిని వీడిపోయె రోగంబు

నిదురవోయి మేల్కాంచిన వాని విధమున నా బ్రాహ్మణుడు
ముదమున తన దేహమును చూచుకొని మురిసి గతకథ నెఱింగి
స్వామి పదంబులపై సతీపతులు సాగిలపడి వినుతింప
ఆ మహనీయుడు వారలను లెమ్మనుచు నాశీర్వదించి
యనియె బిడ్డలారా మీ పురమెయ్యది? మీ కులంబేమి? యనగ వా
రనిరి మహాత్మా! మాది పుష్పగిరియగ్రహారంబు, భూమీసురులము
పదివత్సరంబుల నుండి మత్పతికి ప్రాప్తించిన దీ దుర్భరవ్యాధి
వదలిపోదాయె నెందఱి చేతను వైద్యము చేయించినను

వీపున గట్టుక తీర్థయాత్రలకు వెడలి త్రిప్పి త్రిప్పితిని గాని వృథయయ్యె
తాపసేంద్ర! మీ దయచే నిప్పుడు ధన్యులమైతి మటంచు నామె యన
అమ్మా! నీవు మహాపతివ్రతవు తస్సార్థకనామము నీకే తగు
ఇమ్మహి నెందఱో గలరు సతులు వారిటుల భర్తలను రక్షించిరె? యని
సంతసించి తల్లీ! మీరిక మీ స్వగ్రామమునకు బోయిరండనగ
చింతనొంది తండ్రీ! మేమిట మీ సేవ సేసికొనుచుందు మని పల్కె ॥ఏ

పతివ్రతామణీ! మీరు సంతానప్రాప్తి నంది నీ భర్త దేశమున
అతులిత విద్యాప్రవీణుడై జనులందఱిచే గొనియాడ బడుచుండు
కాన మీరిపుడింటి కేగుడని ఘనుడు వారలకు వచియించి
మానినీ! మేము కొలది దినములలో మీ నిలయంబున కరుదెంతు మపుడు
మీపురికొక యుత్పాతము జరుగును మీకేమి హాని గలుగదని చెప్ప
ఆపద్బాంధవా! మీరుండ మాకు హానిగల్గునే యనుచు నాయమ్మ
దేవా! మాకు పరతత్త్వోపదేశమ్ము జేయుడని ప్రార్థింపగ
భావాతీతుడు వారలకు మహాపంచాక్షరి నుపదేశించె ॥వి

ఈ మహామంత్రము నతి నిష్ఠతో నెపుడు జపించుచుండుడు మేలగు
క్షేమమౌ మీకు పోయిరండనుచు సెలవొసంగి యట నుండి పయనించె
వారలటు లేగుచు నల్లాడపల్లె జేరి స్వామి గురుదేవుండగు శ్రీ
వీరభద్రస్వామి ఆలయమున విడిదిచేసి స్నానాదు లొనరించి
ఆ దేవుని మనసార ధ్యానించి యర్ఘ్యపాద్యాది విధుల పూజించి
సాధుహితుండందుండి భక్తులతో సాగి కందిమల్లయపల్లె జేరె ॥వి

గురుదేవుం డొకనాడు శిష్యులతో గూడి యుండంగ రాజభటుడొకడు
సరగున నొక లేఖ గొనివచ్చి సలాములిడి స్వామి కొసగి నిలచిన
అందుకొని స్వామి జాబు విప్పి వారందరు విన నిటుల జదివె-శ్రీమ
త్కందిమల్లయ్యపల్లె మఠవాసి ఘనుడు వీరబ్రహ్మేంద్రస్వాములకు
కడప నవాబు సలాములు తమరు ముడుమాల వాసి పీరుసాహెబనం

బడు దూదేకువాని సుతుని మతభ్రష్టునిం జేసి హిందూమతమున
ప్రవేశింప చేసితిరట, మీరీ పత్రము చూచిన వెంటనే వచ్చి
జవాబొసగుటయో? లేక పిర్యాదు జరిపినట్టి యా పీరుసాహెబుతో
రాజీపడి ఆ రాజీపత్రము రయమున నాకందజేయ వలయును
ఏ జవాబు మా కందదేని? మీరెవ్వరా మతమునందున నుండరు ॥వి

ఇట్లు-కడప నవాబు-చూచితివా? యెంతచేసె సిద్దా! నీ తండ్రి ఈ
పొట్లు గల్గు నని ముందుగానే నే బల్కినను నీవు వినక చేరితివి
ఇందుచేతనే నా కుమారులు గోవిందయ నిన్ వలదని బాధించుట
బంధమాయె నిధి మనకందరికని బల్కగ సిద్దయ్యగారు తండ్రీ!
మీరల కే భయములేదు నేనే మీ కుమారుగ నవాబు కడకేగి
వారికి నే సమాధాన మొసగి వత్తును నను దీవించి పంపుడనె? ॥వి

స్వామివారు బిడ్డా! నీ ధైర్యసాహసాది గుణములు నే నెఱుగుదు
క్షేమమౌను పోయిరమ్మనగ యా జవానుతో పయనించుచు నుండంగ
అపుడు సిద్దయ్య వెనుకనె బోవుచు నదృశ్యంబై కడపకుం జేరి
ఉపవిష్టుండై నొక చెట్టు క్రింద నుండగ, కొందఱు మహమ్మదీయులు
అచ్చటికి వచ్చి సిద్దయ్య వలన ఆధ్యాత్మికబోధన లాలకించి
హెచ్చుగ జనములు హిందూమతమున నేర్పడు చుండగ నదిగాంచి
వారిమత గురువు నవాబు వద్దకు జేరి సలామిడి వీరబ్రహ్మము
గారి ప్రియ శిష్యుదంతము దెల్ప కక్షచే నతడు దొంగసన్యాసి
గావునన్ వాని నిటకు రప్పించి కఠినంబుగ శిక్షింప కున్నచో
పోవు మన మతము సర్వనాశమై దేవర! యన నవాబుగ్రుండై
భటునొకని జూచి విషయ మెఱిగించి బయలుదేరి తక్షణమే వానిన్
ఇటకు దీసికొని రమ్మనంగ భటుడటుల సిద్దయను దోడ్కొని వచ్చెను ॥వి

అటుల సిద్దయ్య ఆ నవాబు కడ కరుగుదెంచి సలాము జేయకయె
పటుతరముగ జపమాల ద్రిప్పుచును బలుక కున్ననా రాజు మనమ్మున

అవురా! వీడికి యెంత పొగరు? నెనంటే యెవరో తెలియక యున్నది
చవిచూపించెద నా తడాక! యని చాల యీర్ష్య గలవాడై యిట్లనె ॥వి

నీవు మహమ్మదీయుడవా? కాక నిజముగ హిందూవర్గము వాడివ?
ఈ వేసమేంది? డాంబికుని లాగ నెసగుచుంటి వన సిద్దుడిట్లనియె
జననంబే యొక వేసమనంబడు కనగ లోకమే డాంబికంబగును
మనమందరమూ వేషగాళ్లమే మఱియు జీవుడే నటకుడని యనిన
చూడ పెంకితనముగ మాట్లాడు చుంటివి నీ యట్టి యగౌరవనీయుని
చూడలేదెందు నే నింత వఱకు మూఢుడ సరిగా జవాబు చెప్పుము
నీ పేరెయ్యది? నీ యూరెయ్యది? నీ కులమెయ్యది? యనగ సిద్దుండనె
నాపేరు సిద్దయ్య, నాది ముడుమాల, దూదేకులవాడ నని పల్కె ॥వి

మా గురుదేవులు వీరబ్రహ్మేంద్రమహనీయులను మీరెందులకో
వేగమె రమ్మని వార్త నంపిరట యోగి మారుగా నే వచ్చితి నన
పీరుసాహెబు కుమారుడవా నీవు? వీరబ్రహ్మము వద్ద శిష్యునిగ
జేరి మతభ్రష్టుండ వైతివని జెప్పె మీ తండ్రి నిజమేనా? యన
నవాబుగారూ! మతముల పేరిట నానా యవస్త లందుచు నుంటిమి
భవుండొక్కడే సర్వమతములకు పరగనట్టి వాడే మా గురుడన
అందుల కనియా? నీకీ గర్వము ముందు నాకు సలాము చేయనిదే
యిందు ఎంతవాడైన నిలబడడు ఎందుకు చేయగ లేదో తెల్పుమన
అయ్యా! నే జేయునట్టి సలామన్యులెవరు భరింపం జాలరు
అయ్యది నా గురుదేవుం డొక్కనికె అంకితంబనుచు మఱియు నిట్లనియె ॥వి

నే చేయెత్తి సలామంటినేని నీవు నీ గద్దె భస్మంబౌదురు
తోచినదా? అందుకే నే సలామాచరింపనిది! యనగనె నవాబు
కులమతము లొదిలి నీవు హిందువుల గలసినది గాక మమ్ములను గూడ
తలప మోసపుచ్చ చూచిన కలుషమతివి నిన్నేమి చేసినను

దోసం బుండదు మా నౌకరునే మోసపుచ్చి యెటులో నేగితివట
వేసదారివై కొండఱ యువనుల వేరుచేసి నావట శిక్షితుడవే ॥వి

అనగ సిద్దయ్య నవాబుగారూ! వినుము నా కే శిక్ష విధించిన
అనుభవింతు గానీ యెదుటివారి మనస్సు లెఱుంగక మర్యాదలేక
దుడుకుతనమ్మున మాటలాడినచొ దోసము అందున నీవు నెప్పుడో
చెడిపోయెద విక ముందు జాగ్రత్తపడి వ్యవహరింపు మనగ నాతండు
మహాకోపమున సిద్దునిం జూచి మహామహితునిగ బల్కుచుంటివా? నీ
మహిమ లేమిటో చూపు! మనగా నా మహనీయుడు చిరునగవున నిట్లనె ॥వి

అటులైన నొక్క నల్లరాతి బండ నిటకు దెప్పింపు డనగనే వార
లటుల జేయగా సిద్దయ్య స్వామి ఆ బండ వద్ద కరుదెంచి
చేయి యెత్తియా బండకు సలాము జేయ నా రాయి పగిలి ముక్కలుగ
నాయెను, నవాబు తదితర జనములు నాశ్చర్యంబున మునింగి యుండగ
అపుడు సిద్దయ్య నవాబుతో నిట్లనియెను అయ్యా! తెలిసినదా? మీ
కిపుడైన! మీకు సలాము చేయని దెందులకో? మా తండ్రి కఠినుడై
పిర్యాదు చేసినంత మాత్రమున ఖేదంబున మద్గురుదేవుని నను
మర్యాద వీడి అగౌరవంబుగ మాటలాడ తగునా? యన నవాబు
మహానుభావా! తెలియక మిము సామాన్యునిగానె దలంచి మీ యెడన్
మహాపరాధ మొనర్చినాడ నను మన్నింపుడనుచు సిద్దయ్యగారి
పాదములం బడి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి నన్నిక
యాదరమున గాపాడుమనుచు తానగ సిద్దయ్య దయాళుండునై
నగుమోముతొ నవాబుజీ! నీవు నాకేమి చెడ్డగావింప లేదు
తగెను నా యభీష్టమ్మున కియ్యది వగపుమాను మో రాజా!
దూషణభూషణ తిరస్కార ఖేదోమోదంబులు హావభావములు
ఈషణ్మాత్రము నాత్మకు నంటవు ఇవి యన్నియు దేహసంబంధములే ॥వి

సుఖదుఃఖంబుల నెవడు సమముగా జూచుచు నిష్కల్మషుడై యుండునో
సకల ప్రపంచము నాతని కెప్పుడు స్వాధీనంబై విరాజిలు చుండు

నేను నీవంటి వాడనే! కాని దీనబాంధవుడు మద్గురువుల ది
వ్యానుగ్రహమే యీ సామర్థ్యము నేను జేసినది యేమిలేదిందు
అన నవాబు స్వామీ! అంతఃపురమునకు బోయెదము రండని సిద్ధ
య్యను దోడ్కొని పోయి రంగమహలుకు నతిభక్తిని బంగరుపీటమ్మున
నాసీనుం గావించి పూజించి హారతులిడి మహానుభావ! ఈ
దాసునిపైన యనుగ్రహంబుంచి తరింపజేయు డనగ సిద్ధయ్య
రాజా! ఆ యధికారము మద్గురురాయుండు నాకొసంగలేదు అటు
నే జేసినచో గురుద్రోహమగు నిక్కంబుగ నీకా కోర్కెయున్న
గురుదేవు నిటకు దీసికొనివచ్చి నీకోర్కె దీర్తునని చెప్పగ నవాబు
పరమపురుష! మీవెంట వత్తు నే భరియింప లేను రాజ్య భారంబు
అనగ సిద్దయ్య నవాబుతో నసె నయ్యా! నీ బోట్లు రాజ్యభారము
లను వహించుటచె మా బోటి వారలకు గతులు గల్గుచుండెనని మఱియు
నీవిప్పుడు నా వెంట రావలదు; నేనె కొలది దినముల లోపలనే
యా వీరబ్రహ్మేంద్రస్వాముల నిటకు దీసికొని వత్తునని బల్కి
క్షేమమా మీకెల్లర కనుచును చెప్పి నవాబును దీవించి కదలి
క్షేమముగా కొందఱు యవనులతో జేరె కందిమల్లయ్యపల్లెకున్ ॥వి

# సప్తమాశ్వాసము

స్వామిజీ యొకనాడు సిద్దయకు సాంఖ్యయోగ వివరణము దెల్పుచు
సామాన్యుల కిది గోచరముగాదు సద్గుణశీలా! సిద్దా యనుచున్
పంచభూత విమర్శనంబును పంచీకరణము దేహతత్త్వము ప్ర
పంచ భూత సృష్టియు ప్రకృతియును పరగ జీవాత్మ బ్రహ్మము మరియును
ఇరువదియైదు తత్త్వంబుల నెఱిగించుచు స్థూల సూక్ష్మకారణ
శరీరంబుల వివరంబులను షట్చక్రమ్ముల నిర్మాణములను
ఆయా చక్రంబుల నందుండెడు నధిక శ్రేష్ఠులౌ దేవతల నామ
ధేయంబులు మొదలగు విషయంబులు దెల్పగ సిద్దయగా రపుడు ॥వి

పరమానందము నొంది శ్రీవారి పాదద్వంద్వము స్పర్శించి
తరియింతును మీ సత్కృపచే నని పరివరివిధముల వినుతించెన్
ఇది యంతయు గోడచాటు నుండి పదిలంబుగ కక్కయ్యయను మాదిగ
మది నెఱింగి ఆహా! దేవతలు మనుష్యులలోనే నివసింతురంట
కావున నే తక్షణంబేగి నా కాంత గర్భంబు గోసి అందుండు
దేవతల గాంచి ముక్తిగాంతు నని భావమున దలచి మూఢభక్తిచే

నింటి కేగి నిద్రించుచున్నట్టి యిల్లాలిని ఖడ్గంబు చేబూని
కంఠము ఉదరము గోసి దేవతలు గనుపింపమిచే కడు దుఃఖంబున
ఏమిది యా స్వామి మాటలన్నియు నింతేనా యని యాక్రోశించుచు
నేమియు దోచక నిర్విణ్ణుండై భూమిపై వాలి కొంతసేపటికి
తెలివినొంది అకటకటా! యేమిది? తెలివిమాలి ఆ మాయా గురువుల
పలుకులను నమ్మి జాలిలేక నా భార్యను పొట్టబెట్టుకొంటినే?
పరమేశ్వర! స్త్రీహత్యా మహాపాపంబును ఒడిగట్టుకొంటినే?
పరమ కిరాతుండను నాకంటే ధర కఠినుండెందైనం గలడే?
అని శోకించుచు ఐననుగానీ ఆ బ్రహ్మం గారిని దూరనేల?
చని వారి కడకు వారిరువురేమి యనుకొనుచుందురో! చూత మనియేగి
స్వామివారు సిద్ధయ్యకు వేదాంత సారమెఱిగించు చుండ
ఆ మహనీయుని చేరి కక్కయ్య అంతయు నబద్ధమనియెన్

అపుడు స్వామి ఓరీ! నీవెవ్వడ? వటు మాట్లాడుటకు కారణమేమి?
విపులంబుగ దెల్పుమనగ నాతడు వినయంబున నిట్లనియెన్
స్వాములవారికి నమస్కారములు ఏమని చెప్పుదు నా వృత్తాంతము!
నీ మాటలు విని నిజంబని నమ్మి నిలువున నా భార్యను జంపుకొంటి
ననగ నాయనా! నా వలననె నీ యర్ధాంగి మడియుటేలన నాతం
డనియెను ఇంతకు ముందు నీవు శిష్యునకు సాంఖ్యయోగంబు జెప్పగా
గోడ చాటు నుండియు నేనన్ని గుప్తముగ వినుచు షట్చక్రంబుల
గూడియున్న దేవతల గాంచుటకు కోసితి నా యాలి యుదరంబు

కనుపింపలేదు దేవతలెవ్వరు! కడు నసత్యములు నీదు వచనాలు
అనగ స్వామి యాశ్చర్యంబు నొంది ఔరా! యీతని భక్తి యపారము
ఎనయ నింక జ్ఞానోపదేశమ్ము నివ్వక తప్పదటంచునుం దలచి
వానితొ నిట్లనె నాయనా! యెచట మానిని యున్నదొ త్వరగ దెల్పుమన
నా యింటనె ఆ ఘోరంబు జరిగెననుచు కక్కయ్య-స్వామిని, సిద్ధని
ఆ యింటికి గొంపోయి వారలకు నామెనుం జూపి పరితపించగా
కక్కయ్యతొ ననె స్వామి నాయనా! నిక్కంబుగ నా దేవతలం గన
మక్కువ నీలో గల్గి యున్నచో చక్కజేతు నీ కోరిక యనుచును
సిద్ధా! నీవును గనుగొనుము మీరిద్దఱు నతి జాగ్రతగా నిపుడు
శుద్ధమనంబుల యా దేవతలం జూచెడి భాగ్యంబున్నది మీకని
మృతదేహంబున షట్చక్రంబుల మూలరహస్యము లన్నియును గూడ
అతి గోప్యంబుగ దెల్ప వార లందుండెడి చక్రాధిపతులనుం గని
తన్మయత్వంబు నొంది దేవతల తనివి దీర గొనియాడి, స్వామి! మా
జన్మలు తరించె మీ కటాక్షమున చారిత్రాత్మక! నేడు
అని వినుతించి కక్కయ్య, స్వామీ! నేనొనరించిన స్త్రీ హత్యాదోషం
బును బాయుటెట్టు లని వేడగ నా బుధజన విధేయు డిటులనియెన్ ॥వి

నాయనా! నీకా స్త్రీహత్యాదోస మేమియు బాధింపదు భయపడకుము
ఆయమ యిప్పుడు పునర్జీవిగా నౌను నీ భక్తి యపారంబనుచు
చచ్చిపడియున్న యామెపై స్వామి జలము ప్రోక్షించి విభూతిని జల్లి
క్రచ్చర నొక వస్త్రంబునుం దెచ్చి కప్పు మనుచు కక్కయ్యతో జెప్పి
మౌనీంద్రుడు కొంత తడవు యోగ సమాధి నుండి మేల్కాంచ
మానిని నిదురించి మేల్కొనిన మాదిరి యెప్పటి వోలె
లేచి కూరుచొని యెంతసేపు నిదురించితి ననుకొని ముందు వైపునకు
జూచి మహాతేజమున వెలుగొందు సుగుణాకారుల గాంచి
అనేక దండప్రణామంబుల నాచరించి వారలకు
హీనకులులమౌ మా యింటికి మీరేతెంచితిరా దయామయులారా! ॥వి

మీ రాకచె మా జన్మలు తరించె మిగుల సంతసం బొదవె
ధీరులార! యని యనేక విధముల నా రమణీమణి గొనియాడ స్వామి
తల్లీ! మీరలు నీచకులజులని తలపవలదు మీరలు ధన్యాత్ములు
ఎల్ల కులములకు నతీతమైనది యెంచ సద్గుణమె అదియె మన రక్ష
మహాసాధ్వివి కావునసె నీవు మహిని పునర్జన్మంబు నొందితి
బహు శుభంబులం బడయుమనుచు తా బల్కి దీవించి కక్కయను గని
నాయనా! నీవు పరమభక్తుడవు నాకు శిష్యుడవు అప్పుడపుడు నీ
కే యనుమానము గల్గిన మా దరి కేతెంచుచు సందేహ నివృత్తి
గావించు కొనుచు నుండు, శుభంబని కదలి గురుశిష్యులిద్దఱపుడు తమ
తావునకుం జని యధావిధము భక్తాదులతో శుభముండెన్

## అష్టమాశ్వాసము

స్వామివారు శిష్యబృందముతొ సంచారము చేయుచు దిగువమెట్ట
గ్రామమునకు జని స్వాములవారికి కడు దాహంబగుచుండ
అప్పురమున కంసాలెవానింటి కరిగి స్వామి యా యింటి వానితో
దప్పిక యగుచున్నది-మంచినీరు త్రాగుటకు కొంచె మిమ్మని యడుగగ
పూని లోహమును కరుగుచు నింటిలో దాహం బిచ్చెడి వారెవరు లేరు
కాన, నీవా బావి కడకేగి కడుపు నిండుగా నీరు ద్రాగమనె

అంత సిద్దయ్య యిట్టులనియె నయ్యా! నీరం బిచ్చు నంతలో
ఎంత నష్టమౌ నీ పని కన నత డెక్కువ కోపంబంది
ఎక్కడెక్కడో సన్యాసులంత యిక్కడకు వచ్చి యాచిస్తుందురు
చక్కజేయలేకుంటి నేను నీ దిక్కుమాలినోళ్లందరి కనుచున్
ఈ వూరిలో మా కులస్తులు లేక యీ యిల్లొక్కటె దాపురించుటచె
మా వారనుకొని వచ్చెడి వారలు మరీ విపరీతమైపోవుచుండె

కరుగుచున్న యా లోహపు మూసను సరగునన్ పట్టుకార్లతో దెచ్చి
చరితార్థులు, భేదరహితులుగదా? సర్వము బ్రహ్మస్వరూపమే యని

దలతురు మీరలు ఈ లోహంబును ద్రాగి దాహంబును దీర్చుకొండనగ
దలచె స్వామి వారా! వీడి కెంత తలపొగరు? పరిహసించుచుండె నను
వీని యిష్టముగ నే జేతునంచు దానిని చేకొని మంచినీళ్ల వలె
పానముజేయగ నదిగని యాతడు భయభ్రాంతుడై గడగడ వణకుచు
మహా మహితాత్మ! మీరల నే సామాన్యులుగా భావించి మీ యెడల
మహాపరాధము చేసినాడ, నను మన్నింపు డనుచు కాళపై బడియె

వానిని లెమ్మని, బిడియపడకు నీ వొనరించిన దోసమేమిలేదని
మౌని పల్క భయంబు వీడి ఓ మహనీయా! నా కోర్కె మన్నించి
ఈ రోజున నా యింట నివసించి యీ బీదవాని బిక్షగొనుడనగ
వీరబ్రహ్మేంద్రు డటులేనని ఓందారగించె శిష్యులతో నచ్చట
మరుదినమున నా యింటి వానికిన్ గరపి ధర్మములు, వాని దీవించి
అరుదెంచి మహానంది దర్శించి, యటు పిమ్మట నంద్యాలకు జేరిరి

ఆ వూరిలో పాంచాసనంబువారను విశ్వబ్రాహ్మణులలో నొక తెగ
భావింపగ నెక్కువ ధనవంతులు, పరమ లోభులు, మహాగర్వాంధులు
కుంటి-గ్రుడ్డివారెవరైనను వారి యింటి కొచ్చి బిచ్చ మడుగు వారిని
గెంటివేసి, దుర్భాషలాడుచును, గేలిసేయుచుందురు వారెప్పుడు
వారి వద్దకున్ స్వామివారేగ, వసతులు లేమియును గల్పించకుండి
వీరలందఱును పొట్టకూటికై వేసిన వేషములని పరిహసించె

ఆ పురమున మంచివారు కొందరా మహనీయులకు భోజనము లిడి
తాపసినిం దర్శించి, పూజించి, ధన్యులగుచుండిరంత
పాంచాసనమువా రెవ్వరు శ్రీ బ్రహ్మేంద్రుని దర్శింపక యుండిరి
ఎంచి మది స్వామి వారల యిండ్లకు నేగి వారి నందఱను
ఒకచోట సమావేశము గావించి, ఓ యయ్యలారా! మీరు
ఒకరును నా దరికి జేరరైరి, నే నొనరించిన యపరాధం బేమిటి?
మీరు రాకున్న పొట్టకోసమై చేరితి నేనే మీ దరి కనుచు

మీరిన యష్టైశ్వర్యవంతులు మీరలు, కడు నిరుపేదలము మేము
క్షుద్బాధచే మేమందఱం బిపుడు శోషించుచున్నారము, కావున
సద్భావంబున జూచి యింత భోజనము మా కొసంగరైరి యెవ్వరును
అతి ధార్మికులు, బుద్ధికుశలురు, ఐశ్వర్యవంతులు మీరు దప్ప
ఇతరు లెవరు మా క్షుత్తు నార్పగా నెవరు లేరనుచు దోచుచున్నది ॥వి

అనగ, వారిలో నొక రిట్లనియెను అయ్యా! మీ యాకలిని దీర్చెదము
కనుక, యొక పుట్టి బియ్యపు టన్నము గావలెనా? యనె పరిహాసమ్మగ
అయ్యా! పుట్టెండేమి? యెన్ని పుట్లైన మెతుకు మిగల్చక తినెదము
చెయ్యనన్ వంట గావింపు డనుచు స్వామి పల్క వారపుడు
పుట్టెడు బియ్యం బొండి, రాశిగా బోసి తినుండన, స్వామి సిద్ధునితో
ఇట్లులనియె బిడ్డా! యీ యన్నంబేమి మిగుల్చక తినగలవా? యన
జనకా! మీ కటాక్షమున్నచో చాలునె నాకీ రాశి? తమ యాజ్ఞ
యైన నొక్క తృటి కాలము లోపల నంతయు భుజింతునని, యాజ్ఞ నంది ॥వి

ఆ యతీంద్రు పాదములకున్ మ్రొక్కి యాశీర్వాదము వడసి
ఆ యన్నపు రాశి వద్ద గూర్చొనె నంత బ్రహ్మేంద్రు డపుడు
వాని శిరమ్మున హస్తంబు నుంచి మానధనుండా రాశిలో యన్నం
బున నొక్క ముద్దదీసి నాయనా! భోంచేయు మనగ నతడు
స్వాహాజేసెను మెతుకు మిగల్పక క్షణములో నా యన్నం బంతయు
హాహా రవములు చేయుచును వార లాశ్చర్యంబును జెంది
స్వాముల పదముల వ్రాలి మ్రొక్కి గురుసార్వభౌమ! మిమ్ములను
సామాన్యులుగా దలచి మీ యెడల చాల యపరాధ మొనరించినాము
ధనగర్వంబున అహంకారమున, దైవస్వరూపులైన మిమ్ములను
అనరాని మాటలంటిమి, క్షమించి, అజ్ఞానుల మము గాపాడుడనిరి ॥వి

ఆ తరి సిద్ధయ కనులెఱ్ఱజేసి హాహా యనుచున్నంత
చేతనున్న యన్నపు ముద్ద గురుండు సిద్ధుని నోటను వేయగా మ్రింగి

శాంతి గల్గి యెప్పటి వలె నుండె, పాంచాసనమువార అంత వే
దాంతుని సన్నిధి జేరి దేవరా! తత్వోపదేశ మొసగి మమ్ములను
తరియింప జేయవేడుచునుంటిమి తండ్రీ! మమ్ముల దయ జూడు మనగ
కరుణామయుడు సమ్మతించి, వారికి పరగ తత్వోపదేశంబొసంగి
మానవ ధర్మము కొన్ని వేదాంత మార్గములను బోధించి
పూనిక నియ్యది యాచరింపుడని యానతిచ్చి దీవించె

# నవమాశ్వాసము

గురుదేవుం డట నుండి శిష్యులతొ గూడి పయనించి ఆయా పురముల
దిరుగుచు నటనట భక్తాదులకు దివ్యబోధ లందిచ్చుచును
మహారణ్యముల నేగుచు నందందు మృగాములన్ గావించుచును
మహాబిలంబున జేరి యందు దేవాలయమును దర్శించి యందుండు
శ్రీలక్ష్మీనృసింహస్వాములను సేవించి, పూజలొనరించి, యా
ఆలయమున కొక మైలు దూరమున్నట్టి నృసింహుని గిరి కరిగి
ఆ దేవుని యాలయమ్మునకు జని యర్ఘ్యపాద్యాది విధుల సేవించి
సాధోత్తము డా శిష్యులతో విశ్రాంతి దీసికొనె నచట

దిగువ నివసించియున్న నృసింహదేవుని చిన యోబులేశ్వరుండని
ఎగువ నున్న దేవుని పెద యోబులేశ్వరుడని యనుచుందురు జనములు
జడధారి యచట నుండి శిష్యులతొ సాగించియు పయనమ్ము
అచటకు రెండు మైళ్ల యెత్తు నున్నట్టి కొండపై కెక్కి వారచట
బాలుండౌ ప్రహ్లాదుని జనకుడు బాధించిన తావులను భక్త
పాలకుడౌ హరి ఉక్కుకంబమున ప్రత్యక్షంబై హిరణ్య కశిపుని
వధియించిన స్థలమున నచట రక్తవర్ణముగ నున్న నీటికొలను గని
సదయ హృదయులా సరస్సునందున స్నానమాచరించి, యట నుండి
కొండ దిగుచు నచ్చటచ్చటం గల ఘోరమృగంబుల గాంచుచును
మెండు వృక్షముల నీడల మజిలీ లుండుచు తిన్నగ దిగువకుం జేరి

చిన వోబులేశ్వరుని జేరి మఱల సేవించియు నయ్యాలయమ్మునన్
ఘనుడు శిష్యులతొ విశ్రాంతి దీసికొనియె నా దినంబంతా ॥వి

తెల్లవారగనే ప్రయాణమై నా రెల్లరు నచ్చట నుండి
చల్లగ నేగుచు నొక మహాటవికి జని యందొక వటవృక్షమ్ము క్రింద
విడిదిజేసి మధ్యాహ్నపు వంటలు వేగమె జేయుచు నుండగ నొక్కడు
వటపత్రంబులకై యా వృక్షము వడిగ నెక్క నొక బ్రహ్మరాకాసి
కడు భయంకరాకారంబు దోప నొడలు ఔంచి వానిం జూడ నతండు
కడు భయంబునన్ గడగడలాడుచు పడియె నేలపై స్పృహ దప్పి ॥వి

అది గనియు శిష్య లొక్కరొక్కరుగ నా వృక్ష మెక్కి నేలపై బడిరి
అది గమనించిన సిద్దయ్య నిష్టయందున్న గురుని చెంతకుం జేరి
మహితవ్యుడు కనులు దెరువగానే మహానుభావా! భక్తులందరి
మహావృక్షమ్ము నెక్కి క్రిందబడు మహిమలేమిటో యని విన్నవింప
చిరునగవున నాయనా! వీరు గురునామోచ్చరణంబు జేతురేగాని
స్థిరబుద్ధి లేమిచే వారలకా స్థితి గల్గె, నిందు కారణ మొండు గలదు ॥వి

ఈ చెట్టున నొక బ్రహ్మరాకాశి యెన్నియో యేండ్ల నుండి వసించుచు
ఈ చాయకు వచ్చు బాటసారుల నేడ్పించి చంపుచుండె
దాని భయంకర రూపముం జూచి దడియుచు కన్నులు దిరిగి
మ్రానుపై నుండి క్రిందబడి రదియు దాని మాయలే యనుచున్
నేటితో దాని మదగర్వంబులు నేల గలియు నందులకే మన మీ
చోట జేరి యుంటి మింక దానాట లేమి పని జెయ్యవు కావున
ఇదిగో! బెత్తము చేతబట్టి చెట్టెక్కి దాని తలజుట్టు పట్టుకొని
వదలక క్రిందకు నీడ్చుక రమ్మని వచియించుచు మరి యిట్లనియెన్ ॥వి

అది మహామాయావి, బెత్తంబు వదలివేయుమని చెప్పుచు నెన్నో
విధముల నిను మాయజేయు, లొంగకు మది నెంచక యీడ్చుక రమ్మని యన
ఆ విధమున సిద్దయ్యగారు గురుధ్యానమ్మున చెట్టు నెక్కి యా మా
యావి చేష్టలకు లొంగక తల నెఱు లట్టె బట్టుకొని యీడ్చుకొని వచ్చె ॥వి

అంతట బ్రహ్మము తన బెత్తముతో నా రాక్షసి శిరమ్మునన్ దట్టి
కొంత విభూతిని మంత్రించి చల్ల అంతలో దాని మదమెల్ల తగ్గి
ఱెక్కలు విరిగిన పక్షి విధము నా రక్కసి కుప్పగ కూలి
దిక్కుదోచకయె స్వాములవారికి మ్రొక్కి నను కటాక్షింపుడని వేడ
ఓసి రాక్షసీ! నీ మదమంతయు నుడిగెను, ఐనా! యిప్పటి నుండియు
పశుపక్ష్యాదుల, మనుషుల నెవరిని బాధింపనంచు నా పదములాన
ప్రమాణంబు జేయుమనగ రక్కసి ప్రభో! నేను ఎన్నేండ్ల నుండియో
ఈ మహీరుహముపై నివసించుచు ఎదురులేని దానగ మనియుంటిని ॥వి

నేటికి మీ చేత జిక్కితిని, మీ బోటి వారలం గాంచలే దెపుడు
సాటిలేని మహానుభావుడవు, సర్వజ్ఞుండవు, దైవాంశజుడవు
ఎన్ని సారులు ప్రమాణంబు చేయుమన్నను చేతును గాని కరుణించి
నన్నీ యవస్థ నుండి గాపాడి నాకు సద్గతికి దారి చూపమనె ॥వి

నంతమౌని ఓసీ పాతకి బలమంత యుడుగ వైరాగ్యము గల్గెనె?
ఇంత వఱకును రాజరీవితో నెదురు లేదనుచు విఱ్ఱవీగితివి
నీవు కొన్ని యేండ్లిచట హీనముగ నివసింపక తప్పదు-ఆ పైన నీ
తావునకు ఈశ్వరమ్మ యను నామె దయసేయు వీరమాత శిష్యులతో
వార లీ చెట్టు క్రిందనె భోజనవసతు లేర్పరచుకొనెద రప్పుడా
వీరమాత పాదమ్ములపై బడి వేడిన సద్గతి జూపు నీకనుచు
హీనదశను కొన్ని వర్షములు నీ విచట నుండవలసిన యోగమున్నది.
కాన, అంత వఱకు క్షుత్పిపాసలు గల్గకుండ జేతు, నా సాయమిదె ॥వి

నోరు దెరువమని మంత్రవిభూదిని నోటవిడిచి, పడియున్న భక్తులను
జేరి చేతి బెత్తము నానింపగ చెయ్యాన వారలు లేచి కూర్చొనిరి
జరిగిన దంతయు వారలకు దెల్పి స్వామి రక్కసిం గని రక్కసీ! మే
మరిగెదము, ఆమె వచ్చు వఱ కిచట నొరిగి యుండు కొండశిలువ వలెనని
అచట నుండి వారపుడు కడపపురి కరిగి తమ రాక నవాబుకు దెల్ప
నచటికి భృత్యుల నంపి చూచి రండనగ వారటులొనర్చి తెల్పంగ

సపరివారముగ వెడలి నవాబు స్వాముల వద్దకు జేరి
అపరగురునకున్ సిద్దయ్యకు సాష్టాంగ వందనం బొనరించె ॥వి

వీరేంద్రుడు పల్లకిలో గూర్చొన భేరి మృదంగ వాద్యంబులతో
నూరేగించుచు తీసికొనిపోయి వారిని తన మందిరమ్ము నందొక
హేమపీఠమున గూర్చుండ బెట్టి స్వామికి పూజలు చేసి దండమిడి
స్వామిజీ! తమ రాకచె మా వంశము పావనమయ్యెధన్యుడనైతి
యోగపురుష! మీరీ మహలుననే యుండుడు, భోజన వసతులేర్పరచి
వేగమె వత్తునటంచును నవాబు వెడలిపోయె నట నుండి

అంతట సిద్ధుడు తండ్రీ! మా యయ్య అపుడు పిర్యాదు సేసిన దీయన
చెంతనే యనుచు నచట జరిగినది చెప్పుచునుండగ, నవాబేతెంచి
అయ్యలార! భోజనమునకు కాలమయ్యెను, త్వరగా లెండని బల్కగ
చయ్యనన్ లేచి స్నానసంధ్యలనుజేసి, వారలు భుజించి పరుండిరి ॥వి

అంతట నవాబు పడుకొని స్వామి మహాన్పదులని సిద్దయ్య యనియుండె
ఎంతటి ఘనుడో మహిమ లేమిటో? యెఱుగ కుతూహలం బొదవె గావున
నే నెక్కడి గుఱ్ఱము చూలుది గద దాని కే నిసుగు జన్మించు ననుచు
మౌనీంద్రుల నడిగెద ననుకొనియును, మరల నదియు సరిగాదని తలంచి
దాని గర్భమందున్న నిసుగును దర్శింప జేయుడని యడిగెదనని
యా నవాబటుల నాలోచించుచు నట్లే నిద్దురబొందె ॥వి

నవాబు మేల్కొని స్వామి కడ కరిగి, నమస్కార మొనరించి దేవరా!
భవదీయ కృపారసంబు నాపై బరపి, రేపు జరుగనున్న సభకున్
తమరు దయచేయ వేడుకొనుచుంటి, దయజూపుడన మౌని నాయనా!
తమ యుద్దేశమంతయు నేనెఱిగితి, తప్పక వచ్చియు నీ కోర్కె దీర్తు
ననగ, నవాబాశ్చర్యంబు నొంది ఆహా! యెంతటి దైవజ్ఞుం డితడు
మనమున దలచిన సంగతు లన్నియు గనిపెట్టిన మహనీయుం డీతడు ॥వి

ఇది వరలో సిద్దయ్య నా వద్ద నెంతో మహిమను జూపగ గురునకు
నిది యెుక లెక్క? వీరు మహనీయు లింత వారల నే నెందు గనలేదు
అటులని మిన్నక యుండరాదు, ప్రజలంద రీ ఘనుని మహిమలను గాంచు
నటులొనరించెద నిదియె నా ధర్మమనుకొని కచ్చేరి కేగి
పురవాసులందరికి శ్రీవిరాట్పోతులూరి వీరబ్రహేంద్రస్వాము
లరుదెంచియుండె, మన పట్టణమున కందువలన కోటప్రాంగణమ్మున
రేపు మునిమాపువేళ సభ జరుగు నీ పురజను లెల్లరును వచ్చి, యా
తాపసేంద్రు మహిమలను గని, వారి ధర్మములను విని ధన్యులుగండనె ॥వి

ఇది రాజుగారి విన్నపమనిజనులెల్లరకున్ చాటింప జేయుడని
అధికారుల కాదేశము లొసంగి, యనియె వారితొ మఱియు
గొప్ప వారలకు తాళపత్రముల నొప్పుగ కార్యక్రమము వ్రాయించి
యిప్పురమున పంచిపెట్టునట్లుగ నేర్పాటు లొనరింపుడని పల్క
మరునాటి యుదయమునకే అచ్చటి పురవీధులన్ని యలంకృతములై
మఱియు సభాస్థలి కనుల పండువుగ మహావైభవంబుగ నలరుచుండె ॥వి

సాయంకాలము నాల్గుగంటలకు స్వామి పల్లకిలొ సభాస్థలి జేరె
ఆయన వెంబడి నవాబు తదితరు లచ్చోటికి నేతెంచి
స్వాములవారిని బంగరు సింహాసనమున నాసీనునిగా నొనర్చి
ఆ మహనీయుని యనుజ్ఞ తమతమ యాసనములపై నలంకరించిరి
అంతట సభ నిశ్శబ్దమయ్యె, భూకాంతు డపుడు లేచి శ్రీవారి
చెంతజేరి, పాదాభివందనము జేసి, సిద్దయ్యగారికిని మ్రొక్కి
దేవా! మీరలు మా పురమ్మునకు రావడమంటే మా సుకృత మది
భావాతీతులు సర్వజ్ఞులనుచు బహు విధముల గొనియాడుచు నుండెను ॥వి

మౌని నవాబును గూర్చొనుమని, యా మహాజనంబును గాంచి
జ్ఞానవేదాంతబోధ దెల్పి, పరమానందభరితులునైరి వారలు
అప్పుడు నవాబు లేచి స్వామితో అందఱు విన నిట్లనియెను స్వామీ!
ఇప్పుడు నా కొన చూడి హయముండె, నింపైనది, దానికి జనించునది

మగ నిసుగో! లేక ఆడ నిసుగో! మహాత్మా! దెల్పుడనగ మౌని చిరు
నగవున రాజును గాంచి యిట్లనియె, నాయనా! నీ వా గుఱ్ఱంబును
నిటకు రప్పింపు మనగ, వెంటనే, యటుల జేయ నా స్వామి గుఱ్ఱంబు
కడకు నేగి బిడ్డా! దీని గర్భంబున, నొసట చుక్క తెల్లని
అందమైన మగ నిసుగు జన్మించు, అంతయేల గర్భమందె శిశువును
అందఱకున్ గనుపింపజేతు నీ హయము చుట్టు తెరగట్టింపు డనియె ॥వి

వారటురొనర్ప, స్వామి తెరచాటు జేరి, అప్పుడె వెలుపలకు వచ్చి
వారి కందఱకు నా నిసుగును శ్రీవారు జూపె తెరపైన
ముందు జెప్పినటువంటి గుర్తులతొ మోద మలర దిలకించి, జను
లంద ఱాశ్చర్యమంది ఈతడు మహాత్ముడు, కారణజన్ముండనుచును
స్వామి పదమ్ముల వ్రాలి, మ్రొక్కులిడి సన్నుతించి సెలవంది
ఆ మహితుని మంగళవాద్యములతొ అవనీశుడు విడిదికి గొంపోయెను ॥వి

ఆ రాత్రి భోజనానంతర మా నవాబు స్వామివారి సన్నిధి
జేరి మీరు రేపె వెళ్లెదమని సెలవొసంగితిరి, అనగ మీకు నే
నెన్నియో విషయములు బోధించితి ఇంకను నున్నవి చెప్పవలసినవి
కొన్ని దినంబులు నా నివాసంబున నున్న నీ సంశయము లన్నియు దీరు
నని యన, నా జేడటులనె తమ దయ యనుచును మహాత్మా! కాలజ్ఞానము
వినగ నాకు మనసయ్యె ననగ నా ఘను డటులనే యని చెప్పదొడంగెను ॥వి

## కాలజ్ఞానము

హిందుస్తాన్ తోడిరాగము - ఆదితాళము

చెప్పెద శ్రద్ధగ వినుడయ్యా! యివి గొప్ప సత్యములు తప్పక జరుగును ॥చె

ఈ కలియుగం బైదేలేండ్లూ గతియించిన పిమ్మట జరుగు వింతలను ॥చె
ఊప్పుకొండూరున ఊరిచెరువు నొద్ద నుత్పాతములు బుట్టుచుండేనయా!

గొప్పావెల్లువలొచ్చి పదునాల్గు పట్నములు, చప్పున చెడిపోయి, చాల
నష్టంబౌను ॥చె

ఐదువేలా తొమ్మిది వందల డెబ్బదియైదు సంవత్సరంబూ నందున
ప్రథితంబుగ ధాతునామ సంవత్సర మాఘ శుద్ధ బుధవారంబునాడు
పదునెనిమిదీ పట్నములు పగలె దోచెదరు, విధమూ దప్పి నీతి విడచేరయా!
ముదమున కొచ్చెర్లకోటలో నొక కోడి మూడు మాటలు బల్కి మురిపించు
జనులను ॥చె

ముండమోపులంత ముత్తైదులయ్యేరు, మెండుగ భక్తులు వెలసేరయా
నిండూ మనస్సు గల్గియుండూభక్తులు భువి నిలచి శోభితులయ్యు
వెలుగొందుచుంటారు
ఉత్తరదిశయందు బేరికోమటి మహాయుత్తమపురుషుండు వెలసేనయా!
సత్తుగల్గినవాడు ప్రాపంచ మంతయు సన్నుతింపగ మహాత్ముడై
వెలుగొందు ॥చె

ఇటుల కొంత కాలమే చింతలును లేక ఈ రాజ్యమును పరిపాలింతువు
అటుపై నీ రాజ్య మన్యుల స్వాధీనమై యుండునని చెప్పి మఱియు
నిట్టుల బల్కె
గుణమూ లేని వాడు కూలిపోవుచునుంద్రడు గోల్కొండపురిని బాలకులు
పాలించెదరు
కన నాల్గు నిలువుల మనుషులు గన్పించి యనును మేమే వీరవసంత
రాయులమంచు ॥చె
కందిమల్లయ్యపల్లె కడు శోభ మీరంగ అందమొలుకగ పన్నెండామడ
పట్నంబౌను
వందీ కడుపున ఏన్గు ప్రభవమందును పట్టపగలాకాశము నుండి పిడుగులు
వర్షించు
కంచికి పడమర గాండ్లవాని యింట కామధేను వొకటి బుట్టేనయా!
మించీ యొఱ్ఱచీమ ఏనుంగుగా గనుపించూ నదియె నా రాకకు చిహ్నంబు ॥చె

కంభము చెరువులో బంగారు దీయించి, కందిమల్లయపల్లెకుం దెత్తురూ
సంబరమున రంగడనువాడు రత్నాలు చాలగ దీయించి సాధుజనులకిచ్చు ॥చె

కాళహస్తీశ్వరుడు కళలెల్లగోల్పోయి కందీమల్లయపల్లె జేరేనయా!
చాలా హీనంబయ్యు రామానుజామతము చల్లాచల్లగ సమసిపోతుంది
అంతటను
ఆవు కడుపులో దూడ అతిచక్కగా బల్కు నరయ ముండలు తల్లులౌతారయా!
తావులు దప్పి రాజులు భ్రష్టులయ్యేదరు తలప కంభం చెరువు దరి కోడి
మాటాడు ॥చె

కనుకా యివి యన్ని మనమూనందున నిల్పి నను మరువ కెల్లపుడు
సుఖముందుమూ
అని పల్కు నా రాజు మౌనీంద్రులకు మ్రొక్కి వినయమున సెలవంది
నేగె నంతఃపురికి

మరునాడుదయముననే స్వాములు మహారాజునకు దెల్పి
యరుగుదెంచి ప్రొద్దుటూరుకుం జని, ఆపై అల్లాటపల్లెకుం జేరి
అందు వీరభద్రేశ్వరస్వామికి వందనంబు లొనరించి
పొందుగన్ తుంగభద్రనది లోన అందఱు శుచిగా స్నానములు చేసి
అచట నుండియు పుష్పగిరి మరియు నాయా గ్రామాదుల దర్శింపగ
ఇచ్ఛగల్గి స్వామివారు బండిలో నేగగ భక్తుల వెంట జనుచుండె ॥వి

అరణ్యమార్గము మధ్య తొమ్మండుగురు దొంగలు కాపుండి, అట
కరుదెంచు బాటసారులన్ దునిమి వారి సంపదల దోచుకొనుచుండ్రి
స్వామివార లా ప్రదేశమ్మునకు జనగనే బండి ముందు
ఆ మనుషులు యమభటులలా నిల్వ, ననియె నా బండివాడు

అయ్యలారా! నన్నేమి జేయకుడు, అసలు నా వద్దకాసైన లేదు
అయ్యగారడుగో! బండియందుండె, నతని వద్ద చాలగ ధనమున్నది
అనగనే-తస్కరు లొకే సారి ఆ ఘనుని మీద కాయుధముల నెత్తిరి
కన-చిత్రంబుగ బాహువు లట్లే కదలక మెదలక యుండె ॥వి

ఈ లోపల శిష్యులంత భయపడి యెవరికివారుగ పరుగిడిపోయిరి
సౌలభ్యంబుగ సిద్దయ-బ్రహ్మము సరసనె వదలక యుండెన్
స్వామి వారలతొ నాయనలారా! యేమి? నను కొట్ట చేతు లెత్తియు
ఏమియు చేయక ప్రతిమల్లాగున నెత్తిన చేతులు నెత్తినట్లుండె?
పలుకకుంటిరేల? అయ్యో! పాపము! పలుకు లుడిగె గాబోలు వీరికని
దలచి స్వామి బండి దిగి వారి దరికి వచ్చి, తన హస్తమున వారి
కరములు క్రిందికి దించి, విభూతిని పరగ మంత్రించి, నోళ్లలో వేయగ
మరుక్షణముననే వారలందఱికి మాట లొచ్చినవి గానీ, వారు
వంచిన శిరములు వంచినటులుండె, వారెంత ప్రయత్నించినను
కొంచెమైన పైకి లేపకుండిరి గొట్టెల మాదిరి, వారపుడు ॥వి

చేతులెత్తి నమస్కారములు చేసి, దేవరా! మేమెన్నొ నో్
ఘాతుక కృత్యము లొనరించినట్టి కడు కిరాతులము కావున మా కీ
ప్రాయశ్చిత్తము గావలసినదే! పరమదయామయా! మమ్ము మన్నించి
ఈ యవస్త నుండి మాదు శిరము లెప్పటి యట్టుల నుండ జేయుడని
వేడుకొనగ, స్వామి వారిట్లని వివరించె, బిడ్డలారా! మా
టాడుట, హస్తము లెప్పటి రీతిగ నాడుట జేసితి నంతయే గాన
మీ జీవితపర్యంతంబును మీ తల లిట్టులె యుండక తప్పదు
భోజనమునకు వేళాయె, మేము పోవలెనని యన వారలందఱును
భోరున నేడ్చుచు నో తండ్రీ! మా నేరములను సైరించి బ్రోవుడన
వీరగురుడు నా వలన గాదనుచు వెడలె శిష్యులతో నచ్చోట నుండి ॥వి

## దశమాశ్వాసము

అటుల పయనించి స్వామి పుష్పగిరి అగ్రహారమున కేగి బండిలో
నడి వీధిన బోవుచుండ భక్తులు నడచిరా స్వామి వెంట
సాధువులందఱు 'వీరబ్రహ్మేంద్ర స్వాములవారికి జై' య్యని పొగడగ
ఆదిశంకరుల మాదిరి నపుడా సాధు తిలకుడొప్పారుచు నుండెను ॥వి

తీరికగా వైదిక బ్రాహ్మణు లట జేరి గుంపుగా గూర్చొని యుండగ
వారిలో కొందఱు సిద్ధయ్యను గని మీ రెవ్వరనుచు ప్రశ్నింపః
అనియె నేను దూదేకులవాడను అందఱు నను సిద్ధయ్యని బిలుతురు
ఘనముగ బండిలొ గూరుచొని యున్న ఘనుడు దేశికేంద్రుడు మద్గురుండు

వీరబ్రహ్మేంద్రస్వాములవారని వివరింపగ వారపుడు
ఓరీ భ్రష్టుడ! మ్లేచ్ఛుడవయ్యును నొనరగ సద్బ్రాహ్మణుని విధమ్మున
మేని కంతయు విభూతి ఖూసికొని మేటి జపమాల కేలం ద్రిప్పుచు
జ్ఞాని యనుచు నొక కంసాలివాణ్ణి ఘనునిగా జేసి వెంటబెట్టుకొని
బమ్మ ముఖంబున జన్మించిన సద్బ్రాహ్మణులము, సదాచారులము
మమ్ములను చిన్నబుచ్చ తెఱంగున మా వీధికి నేతెంచుటయు గాక
మాకే యర్హత గల్గి యున్నట్టి మహావేదపారాయణ జేయుగ
మీ కెవ్వరిచ్చి రీ యధికారము? మాకు తగు సమాధానము చెప్పుడి ॥వి

చెప్పకుంటిరేని మిమ్మిప్పుడు చెరబట్టి కదలనీయమని యనగ
అప్పుడు వారిని గని బ్రహ్మేంద్రు డనియె, మందహాసమున
నాయనలారా! శాంతము వహించి నా మాట లాలకించుడి చెప్పెద
మీ యవివేకంబునకు, మీ యెడల మిక్కిలి జాలిగ నుండెడిని మాకు
బ్రాహ్మణాది చండాలు రెవరైన భగవన్నిష్టతొ మెలగుచు సతతము
బ్రహ్మయజ్ఞమును జేసినట్లయిన జన్మరాహిత్యమౌట నిజంబని
శ్రుతులు చెప్పుచున్నవి, కావున సద్గతికి అందఱును స్వతంత్రులే
హితముగ సమస్త జాతులవారికి నిందు స్వేచ్ఛ యధికారంబున్నది ॥వి

కనగ వృత్తిభేదముల చేతనే గల్గె కులంబులు కానీ
జననం బందరి కొకే విధంబున జరుగుచునుండును మఱియు
పృథివి తత్త్వమౌ యన్నరసము చేమదము గల్గి స్త్రీపురుషులు కలియగ
ప్రథితంబుగ శుక్లశోణితంబులు పరగ నేకమై పిండోత్పత్తి యగు
అందఱు మలమూత్రపు దుర్గంధంబౌ శరీరంబు నుండియె వచ్చిరి
ఇందులొ నెక్కువ తక్కువ భేదము లేమియున్ లేవు, నిజం బెఱిగితె ॥వి

వశిష్ట-శుక-వ్యాసాది నేతలే ప్రశస్తమౌ కులమ్మునన్ బుట్టి
విశిష్ట బ్రహ్మత్వంబున భువిదివి విఖ్యాతినంది విరాజిలినారు
శాంతచిత్తులై బ్రహ్మనిష్ట గల సర్వలక్షణాన్వితు లుత్తములగు
కొంత వఱకు నీ లక్షణంబులన్ గూడి యున్నట్టి వారు మధ్యములు
అంతకు తక్కువ వార లధములగు నదియు లేని వారధమాధములగు
చింతింపగ నాల్గు జాతులివె యని చెప్పబడియుండె వేదముల యందు

కనుక బ్రహ్మ ముఖబాహువు లందున, ననువుగ నూరువులందు, పదమ్ముల
జనియించి రనుట అర్థరహితంబు సబబుగాదది యటంచు
బ్రాహ్మణ శూద్రులనంగ నర్థంబు ప్రపంచమున జ్ఞానాజ్ఞానములే?
బ్రహ్మజ్ఞానము గల్గిన వారే బ్రాహ్మణు లనతగియుందు రీ భువిని

అజ్ఞానమే శూద్రత్వంబనియును, సుజ్ఞానమె బ్రహ్మత్వం బనుచును
ప్రజ్ఞానిధి వేమన మహనీయుడు బల్కినట్టి మహాసూక్తు లియ్యవి
కావున మానవ ధర్మము దప్పక కారుణ్య హృదయులై యెల్లప్పుడు
దేవుని యాదేశంబున మనుటే దివ్యమైన శ్రేష్టజన్మ లవియే

అని యెన్నెన్నో వేదాంతబోధ లా బ్రాహ్మణులకు దెల్ప
మనసున బెట్టక యివి యన్ని మాయమాటలని వారనుకొనుచుండిరి
ఇక వీరితొ వాదించి ప్రయోజన మెంత మాత్రంబు లేదనుచు
సకల వేదాంత కోవిదుం డపుడు చల్లగ కన్నులు మూసి
కొంత తడవునకు కనులు దెరువ నత్యంత చిత్రముగ నా యగ్రహార
మంతయు తగులంబడుచున్నట్టు లగుపింపగ వారపుడు
భయభ్రాంతులై యేమియు దోపక బ్రహ్మేంద్రుని పాదములపై వ్రాలి
దయామయా! మము గాపాడుము మా తప్పులన్నియు క్షమించి
దేవా! మీ రింతటి వారలనుచు తెలియక మేమజ్ఞాన బుద్ధిచే
నేవేవో వదరినట్టి మూఢుల మిక మము గాపాడుండని వేడగ

స్వామి వారిపై దయచే 'లెండని' చల్లగ నా యిండ్ల వైపు చూడగ
ఏమియును లేక యధావిధంబుగనే గనుపడుచుండె నా పురమూ ॥వి

అంతట వారాదృశ్యంబును గని యత్యాశ్చర్యము నొంది-అ
త్యంత భక్తితో నా మహనీయుని కభివాదము లొనరించి, పూజించి
వారా స్వామిని రథము నందుంచి భేరీమృదంగ వాద్యంబులతో
నూరేగించిరి నాల్గు వీధులను వీరేంద్రుని గొనియాడుచును ॥వి

ఆ గణనీయుని శిష్యబృందముతొ నచటనె నాల్గు దినంబు లుంచుకొని
బాగుగ సపర్య లొనరించుచు నా ప్రాజ్ఞుని బోధలు వినుచుండిరంత
తదుపరి కొందఱు మౌని కడ కరిగి తాపసోత్తమా! తాము భవిష్యత్తు
విధ మెఱింగినట్టి వారలనియు వింటిమి కావున నో దయామయా!
మా కయ్యది విన వేడుకయ్యెనని మనవి చేసికొని నమస్కరింపగ
నా కారుణ్య మనోవికాసితుం డటులనే జెప్పెద రండని పల్కెను ॥వి

బాపలందఱును మౌని కడ కరిగి ప్రణామంబు లిడి నిలువబడి యుండగ
తాపసి వారిని గూర్చొనుమని సద్దయతో నిట్లనియెన్
అయ్యలార! నే జెప్పబోవునది యంతయు శ్రద్ధగ నాలకించండి
ఇయ్యవి కడు సత్యంబులు మీ కిప్పుడెఱిగించెదనని చెప్పదొడంగెను ॥వి

## కాలజ్ఞానము

ఆహిరిభైరవిరాగం - మిశ్రఏకతాళం

వినుడి యీ కలియుగం బైదువేల యేండ్లకు పిమ్మటా
ఘన దురాత్ముల ద్రుంచి సుజనుల మనుప జేసేటందుకూ ॥వి

వీరభోగవసంతరాయుడు పేరునన్ నీ భువికి నే
జేరవచ్చెద నంతవఱ కీ చెడుగు జరుగుచునుండును ॥వి

సరిగ దక్షిణ దిశను మార్గశిరముమాసంబందునా
దురితమౌ నక్షత్ర మొక్కటి దోచు నాకాశంబందునా

మాలలకు మంచాలు నమరును, మహీసురలకు పీటలూ
చాల హీనుల పంచలం బడి సన్నుతింతురు బాపలూ

విధవలకు పెండ్లిండ్లు జేతురు, విప్రులును తద్వృత్తిని
వదలి బానిస వృత్తి జేయుచు విధము చెడి చరియింతురూ

భూసురలు పరవిద్యలకునై భూములను తెగనమ్మియూ
ఆస చెడి తిండికిని, గుడ్డకు నలమటించుచునుందురూ

వైరమున బ్రాహ్మణులు కంసాలెవారును వరలుదు రెప్పుడూ
వీరి కెప్పుడు నింటి కిద్దఱు విధవ లేర్పడి యుందురూ

ధరను బ్రాహ్మణ ప్రభుత్వంబులు తప్పిపోవును మఱియును
పరమ నీచుల స్నేహితమ్ములు ప్రాప్తమై వర్ధిల్లునూ!
అరయ నేను వసంతరాయుడనయ్యు, నాలుగు మూరలా
కఱకు కత్తిని బట్టుకొని భువి కరుగుదెంచిన పిమ్మటా!
ఒనరుగా శ్రీశైల పర్వతమునకు నేగియు నందునా
ఘనముగా శ్రీమల్లికార్జున ఘనుని సంసేవించియూ!
మఱియు నే కేదారవనమున అరుగుదెంచియు నచ్చటా
నిరాహారిగ తపముజేసి పునీతుడౌ శ్రీరాముని
వలన వరములు కొన్ని బడసి వారి దీవెనలందియూ
సలలితంబుగ రామచంద్రుని సన్నుతించియు, మఱియును
ఇంద్రకీలాద్రి పర్వతమునకు కేగి యచ్చట మునులనూ
సాంద్రగుణులౌ మహర్షులనూ సత్వరము దర్శించియూ
కార్తవీర్యార్జునుని మఱియూ ఘనుని దత్తాత్రేయులా
మూర్తులను దర్శించి వారి మ్రోల కొన్ని సువిద్యలా

వడసి యటుపై మహానందికి ప్రవేశించియు నచ్చటా
గడపి రెండూ నెలలు, తదుపరి కదలి యచ్చట నుండియూ
అరయ శ్రావణ శుద్ధ పౌర్ణమి యందు వీర నారాయణా
పురము జేరి పక్షము దినంబులు వరలి తదుపరి వచ్చెద ॥వి

నేను వచ్చు వఱకు ధనికులు జ్ఞానులయ్యు మదాంధులై
హీనముగ నడుగంటి పోయెద రెంచ కొందఱు జగతిలో
వావివరుసలు లేక వివాహ వాంఛలతొ జనులుందురూ
భావమందున నీతి నియమము లేవి లేకనె యుందురూ ॥వి

అరయ కాశీదేశమున కలహంబు లెక్కువ రేగునూ
మఱియు కులగోత్రములు జాతులు మాసి పెండ్లిండ్లు జరుగును
పరగ చెల్లాపిళ్లరాయుడు ప్రజలతో మాట్లాడునూ
అరణ్యంబుల భూములందున నమితముగ ధనముండును

నాలుగూ సంద్రముల మధ్యన నమరియుండు ధనంబు శ్రీ
శైలపర్వతమునకు జేరును సర్వమును శ్రేయంబుగా ॥వి

భూతలంబున మంట లెగయును ముండలూ ముత్తైదు లగుదురు
పాతాళగంగ యింకును ప్రజలు త్రాగుడు మరగి యుందురు
ఉత్తరాదేశంబునందున కత్తులూ వేట్లాడి చాలా
కుత్తుకలు తెగు తూర్పుదేశము బొత్తిగా నాశంబు నొందును ॥వి

తలప బ్రహ్మకపాలములో రామచిలుక రాజ్యంబేలునూ
అలరు హరిద్వారమున మఱ్ఱిచెట్టునందునన్ కొన్ని మహిమలూ
అహోబిలమున ఉక్కుస్తంభంబునకు కొమ్మలు బుట్టి యూ
మహాద్భుతముగ జాజిపూలా మహీరుహమునకు వెలయును ॥వి

ఇంకనూ ఈ భూమి మీద యెన్నో వింతలు బుట్టునూ
శంక వీడి నన్ను మరువక స్మరణ జేయుచునుండుడి

ఇపుడు మీ కొక మంత్రరాజం బింపుగా బోధింతునూ
జపము చేసుక నున్న సుఖమని స్వామి యటు లొనరించియూ
కందిమల్లయపల్లెకున్ మేము కదలి రేపే పోదుమూ మీ
రందఱును నాయందు భక్తితొ నుందురని భావింతును
శుభము గల్గును పోయిరండని శోభితుడు దీవించగా
సభికులందఱు స్వామివారిని సంస్తుతించుచు నేగిరి ॥వి

మరునాడు స్వామి శిష్యులతొ పుష్పగిరి నుండి బయలుదేరి
అరుదెంచుచు మార్గ మధ్యమున వారందఱు నొక వటవృక్షము క్రిందకు
చేరి విశ్రాంతి తీసికొనుచుండ సిద్దయ్య గురుని చెంత
కూరుచుండి తత్పదముల నొత్తుచు వారిని కని యిట్లనియెన్ ॥వి

దేవా! దృగాత్మ నిర్ణయము దెల్పెదరని వేడుచుంటి ననగా
భావాతీతుం డిటులనె నాయన! బహు శ్రద్ధగ వినుమని యిట్లయెను
జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు ప్రాణాదులు, శబ్దాదు లైదు నైదు
మానుగ కరణములు నాల్గు మొత్తమైన నిరువది నాల్గు తత్వముల
చేత శరీరం బేర్పడి యున్నది, ప్రీతిగ రక్త, శ్యామల, ధవళ
పీత వర్ణంబులతో ప్రకృతి విరాజిల్లుచునున్నయది ॥వి

అదియే క్షరము, అదియే క్షేత్రము, అదియే శిఖరము, అదియే అహోజ్యోతి
అదియే అంతర్లక్ష్య-మదియే నీవారశూక మదియేగగన సముద్ర మదియే
విద్యుల్లేఖ
అదియే మేరు శిఖరము, అదియే శిఖర స్థానమ్ము
అదియే నిత్య వైకుంఠం బదియే కైలాసమ్ము
అదియే చిన్మయ నేత్రం బదియె జీవనం బదియే నాత్మ యని
అదియే సర్వసాక్షియైన సచ్చిదానంద స్వరూపము-మఱియు

స్థూలశరీరము రక్తవర్ణముగ-సూక్ష్మశరీరము శ్వేతవర్ణముగ
తలప కారణ శరీరమ్ము శ్యామల వర్ణంబుగ నెగ దొందుచు నుండును

పరగ మహా కారణ దేహము పీత వర్ణంబు గలిగియుండు
నరయ వీటి మధ్యన కైవల్యంబను తనువు ప్రకాశితమై యుండును ||వి

ఇక నీ తనువుల ప్రమాణ విధాన మెఱిగింతు నాలకింపుమని నుడివె
అకలంక స్థితి స్థూల దేహ మొక యంగుళముండును మఱియు
కారణ దేహంబంతియె యుండును గాన వీని నన్నింటి మధ్య పెం
పారగ నాత్మ యఖండ తేజమై ప్రకాశితంబై యొప్పుచు నుండును ||వి

అదియే సచ్చిదానంద స్వరూపంబైన యట్టి శాశ్వత తేజం బది
ప్రథితంబుగ నేత్రముననే యివన్నియు భాసిలుచున్నవి యనుచు
నొక దర్పణమును దెప్పించి సిద్దయకు నొనరగ దృగాత్మ విధానము
సకలంబును జూపింప సిద్దయ్య చాల సంతోషమందె ||వి

మఱియును బిడ్డా! ముక్తి నొందుటకు మహిత సద్గురువు నాశ్రయించుకొని
పరగ బ్రహ్మచర్య మొంది నిరంతరము దైవధ్యానంబున గడపుచు
భూతదయ, అహింస, పరోపకార బుద్ధి గల్గి యుండుటయూ
నీతి నియమముల మెలగుచు నెప్పుడు రోత తలంపులు లేక
సాధుజనసేవ, క్షమము, దయ, సదాచార సంపన్నతయును
భేదరహితంబు భగవద్భక్తి, శమదమాదిసద్గుణంబులును
మరియు నివి యన్ని గల్గియుండుటే మానవ ధర్మము, ముక్తికి మార్గము
మరువక యెప్పుడు ఈ ధర్మంబులు మనసునందుంచి, మహితుడవుగమ్ము ||వి

అని సిద్దయ్యను దీవించి, స్వామి యచట నుండి పయనించి
చనిరి, కందిమల్లయ్యపల్లెకున్ సాయంసమయంబునకు
మౌనీంద్రు డటుల శిష్యులతో కందిమల్లయ్యపల్లె జేరి
ధ్యాననిష్టలతో సుఖముగ నుండిరి తదుపరి కొన్ని దినంబులకు
పశ్చిమ దేశీయులైన కొందఱు, పాంచాననము విశ్వబ్రాహ్మణులు
నిశ్చలమతి శ్రీవీరబ్రహ్మేంద్రునిన్ దర్శింపగ వచ్చి

శిరస్సాష్టాంగ ప్రణామంబులన్ జేసి సిద్ధయకు మ్రొక్కి యటుపైన
కరుణామయ! మాయందు దయయుంచి, కాలజ్ఞానము బోధింపుడనుచు
మనవి చేసికొనగా నట్లే యని మౌనీంద్రుడు వారిని గూర్చొనుమని
వినిపింప దొడగె కాలజ్ఞానము వీనులవిందుగ నపుడు ॥వి

## కాలజ్ఞానము

ఆహిరిభైరవిరాగం - ఆదితాళం

అయ్యలార! యీ కాలజ్ఞానం బతి శ్రద్ధగ వినుడీ!
ఇయ్యవి తప్పక జరుగబోవునవి, ఎఱిగించెద మీ కిపుడు ॥అ

ఐదువేల యేండ్లకు నేనీ భువి నవతరింతు 'వసంతరాయలు'గ
ఈ ధర నంత వఱకు చిత్రములు జరుగుచుండు నెక్కువగా
పతిమ గల్గి యిలలో ధర్మంబొక పాదము గూడా నిలువదు
గడచిన రోజులె మంచివని యెప్పటి కప్పుడు తోచుచునుండూ ॥అ

ధర్మవర్తనము గలిగిన వారలు తప్పక యిడుమల బడుదురు
మర్మవర్తనులు నీచుల కెప్పుడు మంచియె గల్గుచునుండు

జాతిభేద వర్ణాశ్రమాదులును చాల వఱకు నశియించు, జనంబులు
రోత పనులు చేయుచు నెల్లప్పుడు నీతిమాలి చరియింతురు ॥అ

పతివ్రతలు నెక్కడనో యుందురు పరికింపగ నీ భువిని
అతి భోగంబుల నందు కాంక్షచే నారాటమొందు జనులు

తెల్లని గుడ్డలు దేశమునందు తేలికయై మరుగొందు
తెల్లని కాకులు నూరి పొలిమేర కొల్లగ నేడ్చుచునుండు ॥అ

అదుపు దప్పి కృష్ణాగోదావరి యరయు సింధు బ్రహ్మపుత్ర మొదలగు
నదులన్నియు పొంగి యెక్కువగ జననాశము గల్గును, మఱియు

భూమియంతయు దుర్మార్గుల రక్తమున వెల్లువగా తడియు
రాములు చెడ్డప్రవర్తన గలిగి నీమముల మాని యుందురు ||అ

ఏడుసార్లు నా మఠమునకు దొంగ లేతెంచి దోతురు
పాడై పోవును క్షత్రియ పాలన పరికింపగ నీ ధరను ||అ

శునకంబులు గుజ్జాలను జంపును, చుక్కలు పగలే పొడుచును
జనులు అల్పాయుర్దాయముచే చాల రోగముల నందురు ||అ

నను మది నమ్మి కొలిచే వారికి అనయము రక్షణ గల్గును
కనజాలెదరు జీవితాంతమున ఘన కైవల్య పథమ్ము ||అ

నేను కొద్ది కాలము మాత్రమే యీ నేల మీద మనియుందును
మానుగ సమాధియందునన్ జేరి మహా తపస్సును జేయుచు
కొలది దినంబులు గడిపి తరువాత క్రూరుల శిక్షించుటకయి
ఇలను వీరభోగవసంతరాయలుగ వత్తు నే మఱల
అని వచించి, మానవ సద్ధర్మములను వారల కెఱింగించి
చనిరండి మీకు మేలుగలుగునని స్వామి వారలన్ దీవించె ||అ

వార లందఱును మౌని పదంబుల వ్రాలి మ్రొక్కులిడి, కొనియాడి
కారణజన్ముని దీవెనల నంది కదలిరి స్వస్థలములకు ||అ

స్వామిజీ వారలకు దేశసంచారమున భక్తు లొసగు
హేమ, రజిత, భూషలు పీఠమ్మున కింపుగ నలంకరించుచు నుండిరి ||వి

కొందఱు దుర్మార్గు లది గాంచి కూడబల్కుకొని వారందరును
అందుండెడి వస్తువుల నెటులైన నపహరింపగా దలచి
వీరేంద్రులు దేశసంచారమునకు వెడలిన పిమ్మట కన్నము వేయుట
వారి యభిప్రాయమై యుండెను శ్రీవారు నంధ్యాల సంచారముతో
మాని ఎక్కడికి బోక స్వామి యా మఠమునందె స్థిరముగ నుండదలచె
కాన దొంగ లీ సంచారంబు గనుగొని నిరాశ నుండ నందొకడు

అన్నలారా! యిది మంచి సమయంబు, అమావాస్య, యీ రోజు మఠమునకు
కన్నము వేసెద మీ రాత్రికె యనగా వారందరు స్థిరపరచు కొనిరి ॥వి

వారలు లెక్కకు పదిమంది గలరు, వారిలో స్వామి భక్తుడొకడుండె
ఆ రాత్రి మౌని చాల సేపు వఱకచట పూజ లొనరించుకొని
మఠంబునకు తాళంబు వేసి ఆ మహనీయుడింటి కరిగి
అట నున్న శిష్యులతొ స్వామి యిట్లనియె నో బిడ్డలార!
మన మఠంబునను నీ రాతిరి యొక మహా విచిత్రము జరుగనున్నయది
కనుగొందు రుదయముననే అయ్యది కావున తెల్పుచునుంటి ॥వి

అని వచించి శిష్యులతో గూడి భోజనము చేసి, పవళించె
కనగా వారంత గాఢనిద్రలో మునిగియుండగా, దొంగ లది గాంచి
కన్నము వేసి మఠములోనికి జని కని రఖండజ్యోతి వెలుంగున
అన్ని వస్తువులు మూటగట్టుకొని అవ్వి యొకని శిరంబునం బెట్టి
కన్నము వద్దకు రాగనె వారికి కాళ్లుచేతులును చల్లబడి
కన్నులు గానక యేదియు తోచక గడపిరా రేయి యచ్చటనే ॥వి

మూట నెత్తిపై నుండిన వాడు మోయలేని భారంబై పోగా
పాటుదప్పి మూట జారవైచెను, భరింపరాని తలనొప్పి గలిగి
తెల్లవారగనె కాలకృత్యంబులెల్ల దీర్చుకొని స్వామి
చల్లగా నేగి గ్రామపెద్దలకు సంగతి నంతయు నెఱిగించి
వారి నందరిని మఠము వద్దకు జేరిచి, తాళము దీయగ లోపల
ఘోరముగా పదిమంది దొంగ లా యూరి పెద్దలకు గనుపింప
నంత స్వామి యా గ్రామపెద్దలతొ ననియెను నాయనలార! చూచితిర!
ఎంతటి దుష్కృత్యంబొ! వీరల కీ మఠంబె దొరికినది కాబోలు! ॥వి

'వినాశకాలే విపరీత బుద్ధిః' యనునట్లు వీరి కీ గతి గల్గి
జనించె వీరి కిట్టి దుర్బుద్ధులని యెఱింగించిన నపుడు
వారందఱు నా దొంగలను కొట్ట నారంభింపగ నంత

వారింపజేసె వీరబ్రహ్మము, చోరు లేడుచు నో బాబులార!
అంధులమై పడరాని బాధలచే గుందుచున్నట్టి మమ్ము
ఎందుల కింకా బాధించుచుంటి రిక బుద్ధి వచ్చె మాకు
ఎప్పుడు చేయము జన్మలోన నిక నీ దొంగపనులు మేము, మా
తప్పులు క్షమించు డనుచు వారి పాదంబులం బడి దుఃఖించిరి వారలు ॥వి

అది చూచి స్వామి గ్రామపెద్దలతో ననియె నో బిడ్డలారా!
వదలివేయండి, ఈ గతి యుండే వారి కీ బుద్ధి బుట్టినది అనగ
పదుగురు దొంగలు స్వాములవారి పాదములం బడి-తండ్రీ!
వెధవలమై మీ మహాత్మ్య మెఱుగక విజ్ఞానంబు దొలంగి
సామాన్యునిగా మిము భావించి చాల నీచకార్యంబు జేసితిమి
మా మీదను దయనుంచి మా కనులు మళ్లీ యెప్పటి లాగున జేయుడీ!
ఇటుల మేమున్న మా భార్యాబిడ్డ లెటుల బ్రతికెదరు స్వామీ!
అటుగానిచో మేముండి ఫలమేమి? యనుచు వారు రోదింప ॥వి

కరుణామయుండు వారిని పీఠము కడకు దీసికొనిపోయి
పురజనులందరు గాంచుచుండగ, విభూతి వారి నేత్రంబులకు బూయ
యథావిధంబుగ వారి నయనంబు లగుపించె, మూటమోసిన వానికి
వదలకుండె శిరోవేదన శ్రీవారితో వాడిట్లనియెను తండ్రీ!
పరమలుబ్ధుడను, మీ నగలమూట శిరమున దాల్చిన పాపిష్టివాణ్ణి
భరియింపలేక నుంటి తలనొప్పి ప్రభో! నన్ను రక్షింపుడని వేడ
దీనదయాళుండగు బ్రహ్మేంద్రుడు మానుగ విభూది మంత్రించి
వాని శిరంబున జల్లగనె-బాధ వదలిపోయె నంతయును ॥వి

కొన్ని రోజులా దొంగలను వీరగురుడు మఠమునకు రమ్మనుచు
ఎన్నెన్నో వేదాంత ధర్మంబు లెఱుకపరచి, వారలను
దైవభక్తులుగ జేసి వారలకు తారకమంత్రం బుపదేశింపగ
భావమ్మున ప్రణమిల్లి సద్గురుని దీవనలనంది-యిండ్లకు నేగిరి ॥వి

పాఠకులారా! వింటిరా! వీరబ్రహ్మేంద్రస్వామి యా దొంగల
నేపాటుకు దెచ్చెనొ? సద్గురువులోని ప్రాజ్ఞత యయ్యెదె? నిష్కామసిద్ధి
ఆత్మబలసంపన్నులగువారి కసాధ్య మేదియు నుండదిలలోన
య్యాత్మబలంబే దైవబలంబగు అందుననే గణనీయులు గతించి
యుగములు మారినగాని, నిప్పటికి జగతిలో స్థిరముగ మహాతేజమున
నిగమరూపులై వెలయుచునుండిరి నిత్యకల్యాణముగను
అట్టి సద్బోధ జేయు సద్గురు లడుగంటిపోయి రిపుడు
పొట్టకూటిబాధగురువు లెల్లెడ గుట్టలుగ ప్రబలినారు

## ఏకాదశాశ్వాసము

జ్ఞాననిధులైన వీరబ్రహ్మంగారు సమాధిలో నుండగా దలచి
మాననీయ గోవిందమాంబను మరి సుతులను తన కడకు రావించి
దేవీ! బిడ్డలారా! వినండి తెల్పెద మాయామేయమైనట్టి
ఈ వసుధాస్థలి నుండుటకును నా కేమియు నిష్టములేదు
నేనిక కొలది దినములలో సమాధినిష్టయందుండ దలచితిని
కాన జేష్ఠసుతుడు గోవిందయ్యకు మానుగ పీఠాధిపత్యంబు జేయ
దలచుచుంటిని, మీ యిష్టంబును దెల్పుడనగ గోవిందమ్మ
సలిలనేత్రయై ప్రాణనాథ! మీ సాన్నిధ్యంబు విడచి మనగలనె?
మీరు లేని బ్రతుకెందుకు నా కిల? మీతొ నేను సమాధి నుండుటకు
మీరు! నన్ననుగ్రహించుడని ఆ నారీరత్నం బనగ నా స్వామి
దేవీ! అటు లొనరింపగారాదు తెల్పెద తదుపరి తద్విధానమని
భావాతీతుడు జ్యేష్ఠసుతునితో బల్కె నిటుల గోందయాచార్యా!
నీకు పట్టాభిషేకంబు జేయ నిశ్చయించితిని గాన
నీకు సమ్మతంబేనా? యనంగనే యతండు నమస్కృతి చేసి
నాకేల తండ్రీ! ఇట్టి పట్టాభిషేకము-నే నర్హుండనా?
మీకు సిద్దయ్యపై నభిమానము మెండుగ నుండెను మఱియు

దేవరహస్యము లెల్ల వానికే దెల్పి, యతిప్రేమతోడ
భావింపగ మీ యంతటివానిగ గావించుకొంటి రతనిన్
కన్నబిడ్డలను పరుల విధంబున కనికరములేక నుంటి రెప్పుడును
ఎన్నగ నీ పీఠాధిపత్యంబేమి జేయగలవాడ
భక్తుల సందేహంబులను దీర్చి పావనులజేయునట్టి
శక్తి నాలోన యెక్కడున్నదని సద్వినయమ్మున మరియు
కనగ సంసారసాగర మీదుటె కష్టముగ దోచుచుండె
కనుక నీ పదవి నింకెవరికైన కట్టబెట్టుడని పలికె ॥వి

అంతట బ్రహ్మముగారు పుత్రా! నా కంతయును తెలియు నీ సామర్థ్యము
చింత వదలి నే జెప్పినట్టుగా జేయుము, నీ కది సార్థంకంబౌను
తాపత్రయ సంసార విపినమున పాపపుణ్యములు చేయుచును నరుడు
ఏ పగిదిని విశ్రాంతిని గానక, యెఱుగకుండె తన కర్తవ్యంబును
తలప సంసారమ్ము ముండ్లతో గలిగినట్టి యొక మహావృక్షంబు
బలమైన నా భూరుహంబునకు ప్రకృతియే మూలంబు
అట్టి వృక్షంబు నందలి సుఖంబు లనెడి ఫలమ్ముల నాశించి
దిట్టమైన శాశ్వతానందమును దెలియక పలు బాధలందుచుండెను
దారపుత్రధనధాన్యపశుక్షేత్రాదులందు కాంక్షను విడనాడి
సారహీనలోకవ్యవహారముల్ చాలించుచు నెల్లపుడు
ఆత్మను పరమాత్మ యందు నిల్పెడి నట్టి సాధనము జేసి
ఆత్మ బ్రహ్మైకసాక్షాత్కారము నందగల్గునని పల్కె ॥వి

సంతసించి గోవిందాచార్యుడు జనకా! మీ రెఱుగని దేమున్నది?
అంతయు మీ దయ, మీ యిష్టముగనే ఆచరింతునని నుడివెన్
అప్పుడు సిద్దయ్య స్వామితో తండ్రీ! హంసస్వరూప శాస్త్రవిధానము
చెప్పవేడుకొనుచుంటినన, మౌని చెప్పె నిటుల సిద్దయ్యా! గోవిందయ్యా!
నాయనలారా! శ్రద్ధగా వినుడు, నాభికమలమునకళాతీతమై

జ్ఞేయసచ్చిదానందస్వరూపమై చెలగు పరమాత్మ 'హ' అనంబడును
భావింప నింద్రియములతో గూడిన ప్రకృతి దేహము 'స' కారంబౌను
జీవాత్మ పరమాత్మలయందు గల 'హ' కారమ్ము మధ్యన 'ం'
బిందువు నేర్పడి 'హంస' రూపంబు పొందుగ నేర్పడు చున్నదనియు-ప
సందుగ శుభాశుభంబుల నెఱుగు స్వరవిషయమ్ములు, మఱియు
'ఇడాపింగళ-కుంభక' నాడుల నెఱుకపరచి తద్విధానమంతయు
అటు 'పూరక' కుంభక-రేచక'ముల యంతర్భాగ విశేషముల్ దెలుప
సంతసిలిరి వారిరువురు శ్రద్ధగ స్వామి బోధల నెఱింగి
అంతట గోవిందయ్యాచార్యుం డనియెను, తండ్రీ! మఱియు
సర్వోదయవత్సర, మాస, వార, ఫలములను స్వరజ్ఞానమున దెలుసుకొను
విధము
ఎఱిగింపవే: యని కోరగా, స్వామి సరె! యని చెప్పదొడంగె నిరువురకు ॥వి

సూర్యచంద్ర నాడుల వివరంబును, శుభాశుభంబులు, లాభనష్టములు
కార్యరూపమున గలుగు ఫలితములు, కడు విపులంబుగ దెలుప సిద్ధయ్య
గురుదేవా! మరణకాలము తెలుసుకొను విధానమేదైన నున్నచో
ఎఱుకపరతురని వేడుచుంటినన గురుడు నాయనా! వినుమని
ఆయానాడుల శ్వాసలను బట్టి ఆయా కాలములకు సంక్రమించు
మాయాజీవిత పరిమాణస్థితి మహావిపులముగ బోధించెన్ ॥వి

అవె గోవిందాచార్యుడు తండ్రితొా జనకా! ఛాయాపురుషలక్షణము
వినగోరితి, దయతోడ దెల్పుడన ననియెను వేదవిదుండు
దివముండగనె తెలియవలయునని దెలిపినాడ మీ కిది వఱకు
తోవదాయె, నీ కిపుడు గల్గెన? ఆ పరమార్థములందునన్ శ్రద్ధ
అని చెప్పదొడంగె కుమారా! వినుమిక ఛాయాపురుషలక్షణము
లనునాశికాగ్రమున దృష్టి నిలిపి అనువుగ శిరమ్ము పైకెత్తి
ఆకాశంబును జూచినట్లయిన నగుపడు ఛాయాపురుషుండు

ప్రాకటముగ నా ఛాయాపురుషుడు బలసియున్నచో ధనంబుగల్గును
బలహీనముగ కన్పించినచో కలుగును మృత్యువు-మఱియు
ఎఱుపురంగుగా గన్పట్టినచో నేలగల్గు రాజ్యమ్ము
శిరము లేనట్లు గనుపించినచో సరిగ ఆరుమాసములకు గతించు
శరీరమున తూట్లుండి నటులున్న క్షామంబు దాపురించు
మఱి తేజస్సుగ వెలయుచున్నచో మహాసుభిక్షముగా నుండు ॥వి

చేతులు లేనట్లు గనుపించెనా? చెడు సంతానము, భార్య మడియు నీ
రీతిగ నిత్యంబభ్యసించుటచే భూతభవిష్యద్వర్తమాన మెుదవు నసె
అంతట గోవిందయ్య తండ్రీ! మీ రింత చెప్పుచున్నను నా మనంబు
కొంతసేపైన నిర్మలముగ లేకున్నది, గాలిలో దీపంబు మాడ్కి
కాన నాకు సంకల్పాది వర్జన క్రమము బోధింపుడని వేడికొనగ
మానధనుండటులే యని నాయనా! మహాశ్రద్ధగా వినుమని నుడివెను ॥వి

సరియౌ సంకల్పసిద్ధిచే కామంబు సమసిపోవు-కామవర్జితముచే
హరియించు క్రోధము-అర్థమ్ము మీద ఆశ విడుచుటచె లోభము నశించు
భగవద్భక్తిచే భయంబు దొలగును-భవబంధములు వీడును
జగతిని సాత్వికాహార భక్షణచే శాంతమ్ము గల్గియుండును ॥వి

మానుగ నాత్మానాత్మ వివేకజ్ఞానముచే శోకమోహములు దొలగు
పూనిక ప్రాణాయామంబు వలన పోవును మన్మథ చింత
పరోపకారబుద్ధి వలననే పాయు దుఃఖములు- మఱియు
శరీరంబునం దాస వదలుటచే చేకురు జ్ఞానము-ముక్తి
ఈ లక్షణంబు లన్నియు గలిగిన నేర్పడియుండును స్థిరచిత్తంబన
చాల సంతోషముగ గోవిందాచార్యుడు స్వామిని గొనియాడెన్ ॥వి

కందిమల్లయ్యపల్లె గ్రామంబునందు స్ఫోటకంబుండుటచే గ్రామస్తు
లంద ఱా గ్రామదేవత పోలేరమ్మకు పొంగళ్లు పెట్టుచుండిరి
గోవిందమ్మ యటు లొనరింపగ కోర్కె గల్గి యొక ఆదివారమున

దేవి మీద భక్తిచే- యిల్లలికి-తీర్చిదిద్ది ముగ్గులను
మూడు చిన్న రాళ్లను దెచ్చి వాటిని నీట కడిగి, పసుపు నలంది
నీటుగ కుంకుమ బొట్టులను బెట్టి-వాటి ముందు నొక విస్తరి వేసి
పెరుగున కలిపిన చల్దియన్నమును త్వరగ దెచ్చి విస్తరిని వడ్డించి
మఱియు సాంబ్రాణి పొగవేయ నంతట నరుగదెంచె బ్రహ్మేంద్రు డింటికి ॥వి

ఆమె అది కాంచి భయంబు పెనగొన నా రాళ్ల పైన-నా చల్ది పైన
స్వామికి కనుపింపక నొక చేట నరగున దెచ్చి బోర్లించెన్
అపుడా మౌని గోవిందమాంబతో ననియె నిటుల నో కాంతా! నీవు
ఇపు డేదియొ యొక కార్యభారమున నిమిడి యున్నటుల దోచుచుండెడిని
అని తానించుక ముందునకు బోయి, ఆ చేటను పైకెత్తుసరి కచట
కనుపించెను రాళ్లు-చల్దియన్నము-అనియె నిటుల మునిమౌళి ॥వి

దేవీ! నీవారాళ్లకు చల్ది దెచ్చి నైవేద్య మొసగతి వెందుకు
భావింపగాను, రాళ్లు అన్నమును భక్షించునె యెందైన?
అనగ గోవిందమాంబ భయంబున మన గ్రామంబున స్ఫోటకం బున్న
దని అమ్మణ్ణికి చల్ది యిష్టమని, అందుకు మీ రంగీకరింపరని
ఇంత చేసితిని, నను క్షమించుడన నంతట బ్రహ్మము చిరునగవుతో, నా
కంతయును దెలియు చెప్పకున్ననూ, అగదు సత్యము బయల్పడక అని
నీ కంతటి యభిలాష యున్నచో నేనా దేవిని మన యింటికి-విం
దుకు స్వయముగ రప్పించియుందుగదా! తోచదాయె నీ కెపుడు
ఐన నిపుడేమి మించలేదు నీ యభిలాష దీర్చుటయె నాకు హితము
కాన నీవు నా దేవికి యేయే మంచి వంటకములు పెట్టదలచితివో!
అవి యన్నియు త్వరితమ్ముగ చేయుము ఆ దేవిని రప్పింతునని పల్క
ప్రవిమలాహృదయ గోవిందమాంబ పరమ సంతోషముననూ
స్నానమాచరించి, వివిధ రకముల చాల పిండివంటలు గావించి
మానుగ నిరుగుపొరుగు వారి కీ సమాచారమ్మును దెలిపె ॥వి

అంతలోనె యీ సంగతి యా పురమంతయు వ్యాపింపగ, నా
వింత చూచుటకు జనులు వెంటనే వీరబ్రహ్మము సదనము జేరిరి
ఆ రోజే కర్నూలు నవాబు ఆ మార్గంబున బోవుచు స్వాముల
వారి దర్శనార్థ మతడు శ్రీవారి గృహంబున కరుదెంచియుండె
స్వామివారు తన యింటి ముందున్న గ్రామస్తులను లోనికి రండని
ప్రేమతో వారిని గూర్చొను మనియు, నా మహనీయుడు వారితో నిట్లనె ॥వి

అయ్యలారా! మీ రందఱు పోలేరమ్మకు చల్లులు బెట్టితిరి గదా!
అయ్యవి, యామె భుజించెనా? యనగ, అపు డొకరి నొకరు చూచి నవ్వుకొనిరి
వంటచేసియు గోవిందమాంబ వచ్చి మౌని కెఱిగింప
వెంటనే లేచి స్నానార్థంబై వెడలె నా మహాత్ముండు
అంతట స్వాములవారు స్నానసంధ్యానుష్టానములు దీర్చుకొని
కాంతా! నాకును, కర్నూలు నవాబుగారికిని, శిష్యులకును
అందరికిని వడ్డించి-దేవికిని యని భక్తిన్ ఒక విస్తరి వేసి
పొందుగ జేసిన వంటకములన్ని పోలేరమ్మకు వడ్డించు మనియె ॥వి

పతిదేవుని యాజ్ఞానుసార మా పడతి యటుల నొనరించి
సుతు లందరికిని-కుమార్తెకును నా సుదతీరత్నము వడ్డించె
స్వామివారపుడు పోలేరమ్మను క్షణము సేపు మనసున ధ్యానింపగ
ఆమె యొక వృద్ధస్త్రీ రూపమున నచటికి వచ్చి నిలువంబడియుండెను ॥వి

అనియె స్వామి దేవితో తల్లీ! మీ యమ్మ గోవింద నీ కొఱకు
ఘనముగ నిప్పుడు వంటకంబులను గావించినదట-భోంచేయరాదా!
అనగ నందఱతో గలసి భోంచేసి-ఆమె స్వామివారి వద్ద నిలబడి
జనకా! నా కిక ననుజ్ఞ నిచ్చిన చనెదనంచు వచియింప
తల్లీ! నేనిక కొద్ది రోజులలో తప్పక సమాధి నొందెదను, నీ
వల్ల నా సుతుడు పోతులూరయ్యకు వనర నుపకారమందవలసియుండె

కావున మా గోవింద యెపుడైన భావమ్మునన్ దలచినంతనే
నీవు వచ్చి ఆమె చెప్పినవన్నీ నెరవేర్చుచుండవలయునని కోరె ॥వి

అందులకు నామె యంగీకరించి-ననుజ్ఞ వడసి యదృశ్యయయ్యె-నా
నందంబున నవాబు సాష్టాంగ నమస్కారము చేసి మహితునకు
యోగిపుంగవా! తమ దర్శనముచే నొనర నా జన్మ ధన్యంబయ్యెను
ఆగమలోలా! నేడు సుదినంబు-అందువలన నే నిటు రాగల్గితి
మీరు సామాన్య మానవులు గారు కారణజన్ములు-భగవదాంశజులు
ఎవరికైన నింతటి సామర్థ్యం బేర్పడియుండునె? యెందున్
తలచినంతనే పోలేరమ్మ తక్షణమే ప్రత్యక్షంబై
వలసిన కార్యములు చేయ నొప్పుట నిల నెవరికైన సాధ్యమా? అనియె ॥వి

వాని కోర్కె మన్నించి యపుడు శ్రీవారు కాలజ్ఞానంబు వచియింప
బూని అచ్చోట మూగియున్నట్టి పురజనులందఱను గూర్చొనుమనెను
వారంద ఱా పూజ్యునకు సాష్టాంగ వందనము లాచరించి
వీరేంద్రుని మహిమలను గొనియాడుచు వినయమ్మున ఆశీనులై యుండ్రి
అంతట బ్రహ్మము నాయనలారా! ఆలకించండి! యిక భవిష్యత్తు
అంతరంగమున నిల్పుకున్నచో అఖిల సుఖంబులు గాంతురని నుడివె ॥వి

## కాలజ్ఞానము

మాయామాళగౌళరాగం - ఆదితాళం

వీరభోగవసంతరాయులుగ వెలసి నేనీ లోకమును
జేర వచ్చెదను అంత దనుక నివి జరుగుచునుండు నెల్లెడలన్ ॥వీ

నాలుగు దిక్కులు మహాకాంతితో నక్షత్రంబులు గన్పించి
రాలు భూమిపై ఆ చిత్రమ్మును చాల జనంబులు గాంచెదరు
అమావాస్యనాడు పూర్ణచంద్రుని గాంచి అందున కొందఱు చత్తురు
భ్రమలకు లోనై ప్రజలు స్వార్థమున భ్రష్టుత్వంబై పోవుదురు ॥వీ

తూరుపున శిరము పడమర తోకగా తోక వెడల్పున నిరువది
బారల పొడవు నల్లని ధూమకేతు వనబడు నక్షత్రము పుట్టును ॥వీ

ముప్పది నాళ్ల కందఱ కగుపించు నొప్పుగ పుణ్యాత్ములకు
తప్పకను సూర్యమండల మందున దర్శనంబౌను పురుషుడుగా

ఆకాశము నెఱ్ఱనై ఆవు లరచును మిన్నును జూచి
ఆకసమున గుభిల్లను శబ్దము లావరించు నంతటను ॥వీ

కందిమల్లాయపల్లె నవరత్న ఖచితమంటపంబుల తోడా
అందముగా పన్నెండామడ పట్నమై యలరారుచు నుండు ॥వీ

అదే గుర్తు నా రాకకు మీకు ఆ మీదట నే నూటతొం
బది యైదు వత్సరములు ధర్మముగ పాలించెద నీ భువిని ॥వీ

అని మఱియును కొన్నె ఱింగింప వారానందమున మునింగి
చనిరి స్వామి సెలవంది గృహములకు మనుజవిభున కా రేయి
కొన్ని వేదాంతధర్మములు దెల్పి కొలది దినములలో నేను
పన్నుగ సమాధి నిష్ఠ నుందున్నని పల్క నా మహారాజు
దేవా! మీరు సమాధినొందు ముందు దెల్పెదరా! నా కనగా
దీవించి మౌని అటులే యన జయలుదేరి వెళ్లె నా రాజు ॥వీ

కొంత కాల మటు గడచిన పిమ్మట గుణశోభితుడౌ మౌని
అంతరంగమున గల్గెను సమాధియం దధిక నిష్ఠ నుండ
తన జ్యేష్ఠ సుతుడు గోవిందాచార్యున కా మఠాధిపత్యం బొసంగి
ఘనముగ పట్టాభిషేక మొనరింప జనవంద్యుడు స్థిరపరచుకొని
ఆ విషయము భక్తాదు లందఱకు నందుటకై తాళపత్రంబుల పై
భావాతీతుం డిటుల వ్రాయించి పంపె శుభలేఖ లపుడు ॥వి

శ్రీమత్పరశివ విశ్వబ్రాహ్మణ చిదానంద పంచాననోద్భవులు
హేమగోత్రోద్భవులును మన్నుహితత్వష్టశిల్ప వంశోద్భవులును

నాదబిందు కళాత్మకులును అమనస్కయోగ నిష్టాగరిష్టులును
వేదవేదాంగ విశిష్టాద్వైత విధులు, భక్తజన సంసేవితులును
కడపసీమ బద్వేలు తాలూక కందిమల్లయ్యపల్లె
మఠాధిపతులు శ్రీవిరాట్ పోతులూరి మహనీయ వీరబ్రహ్మేంద్రస్వాములు
గురుపుత్రులైన అంగ-వంగ కళింగ-కుకుర-కాశ్మీర-కాంభోజ, సింధు
మరియు సౌరాష్ట్ర, సౌవీర, విదర్భ, మహారాష్ట్ర, బర్బర, కేకయ, విదేహ
అటుల సాళ్వ చేద్యాది దేశముల యందుండు శిలాస్వర్ణకృత్యాది
ఘటికులైన పాంచాననము వారికి అటుల భక్తాది సమస్త జనులకును
వ్రాయు శ్రీముఖం బేమనగా ఈ వైశాఖ శుద్ధ సప్తమీ గురువార మస్మ
దీయ జ్యేష్ఠ కుమారుండగు సుబుద్ధి గోవిందాచార్యస్వామిని
మఠాధిపతిగా పట్టాభిషేకము నా మారుగ నొనరించి
అటుల శ్రీగురు కార్యము లన్నియు నాయనకే నొప్పగించి
నేనీ వైశాఖ శుద్ధ దశమీ భానువారమున నీ లోకమును వీడి
మానుగ సమాధి నిష్ఠ నుండుటకు మదిని నిశ్చయించుకొంటిని కావున
భక్తాదులెల్ల రిటకు చనుదెంచి పట్టాభిషేక మహోత్సవంబును
భక్తిశ్రద్ధలతో నెరవేర్చి మమ్ము పరితృప్తుల గావించి
మదర్పితంబగు చందన తాంబూలాదుల గైకొని నన్ను
ముదావహునిగా గావింతు రనుచు మదిని గోరుకొనుచుంటి ॥వి

"సర్వేజనా సుఖినోభవంతుః" ఇట్లు స్వామి వీరబ్రహ్మేంద్ర గురుండని
సర్వదేశముల వారికి బంపెను-సాధులోకసేవ్యుండు
ఆ శుభలేఖలు జేరిన వెంటనె ఆయా దేశము లందుండు భక్తులు
వాసిగ తండోప తండంబులుగా వచ్చి చేరిరి కందిమల్లయ్యపల్లెకు
భాసురముగ మహమ్మదీయ చక్రవర్తులు రాజులు సద్భక్తిన్
వైశాఖ శుద్ధ పంచమి నాటికే వచ్చి గుడారములు వేసుక నుండిరి ॥వి

పరిసర గ్రామము లన్నియును గూడ పట్టాభిషేక మహోత్సవము జూడ
నరుగుదెంచి ఇసుక చల్లిన రాలని యటుల నుండె నా పురం బంతయును
కందిమల్లయ్యపల్లె యంతయును కడు శోభతో వెలుగొందుచును
అందముగా పచ్చని తోరణములు నలంకృతంబై యుండెన్ ॥ప

వైశాఖ శుద్ధ సప్తమీ గురువారమున వీరగురుడు
ప్రాశస్త్యులునై వెలయు చతుర్వేద పండితోత్తముల చేత
గోవిందయ్యకు శాస్త్రయుక్తముగ గొప్పగ పట్టాభిషేక మొనరించి
దీవించె మౌని పండితు లెల్లరు దివ్యాశీస్సుల నొసంగిరి ॥వి

ఆ రేయి నొక్క యేనుంగు మీద అంబారి గట్టి మంగళవాద్యముల
నూరేగించుచు ముప్పది రెండు బిరుదమ్ముల నామావళులన్
చక్కగ జెండాల పైన వ్రాయించి సర్వజనులు తిలకింప
ఒక్కొక్క భక్తుడు చేతబట్టుకొన నూరేగించి మఠాధ్యక్షునిగ జేసె ॥వి

మరుసటి దినమున స్వామి గోవిందమాంబను బిలిచి నేనీ
సరియగు వైశాఖ శుద్ధ దశమి ఆదివారమున సమాధి నొంద దలచితి
కనుక నీవు-నవమి రాత్రి సిద్దయ్యను బనగానపల్లెకు పుష్పములకై
పనుపు మని చెప్ప, గోవిందమాంబ, అనియె సిద్దునితో ఆ విషయమ్మును ॥వి

అంత సిద్దుడు మహాప్రసాదమని, అమ్మగారి వద్ద సెలవు దీసికొని
కొంత దూరమటులేగి, తర్వాత గురుని వద్ద సెలవు తీసికొనకయే
అరుదెంచుట న్యాయంబు గాదనియు, మఱల వెనుకకున్ వచ్చి చూడగా
గురుదేవులు నిద్రిచుచునుండిరి, మరి నిద్రాభంగము చేయ నొల్లక
మేలుకొను వఱకు వేచియుందునన చాల కాలాతీతమౌనని తలంచి
ఆలస్యం బొనరింపక గురువున కంజలి ఘటించి పాదములన్
కనుల కద్దికొని గురుధ్యానమ్మును గావించుకొనుచు పుష్పార్థంబై
బనగానపల్లెకున్ బయనంబై చనియెను సిద్దయ్య భావం బెఱింగియు
తాను సిద్ధి బొందు సమయమున దగ్గఱ లేకుండు నటుజేసి సిద్దయ్య

జ్ఞానదీక్ష భక్తి విశ్వాసంబులను జగద్విదితము గావింప నెంచియే
శుద్ధతత్త్వ వేదాంతనిధియైన జ్యోష్యుడు వీరబ్రహ్మేంద్రస్వామి
సిద్దయ్యను పుష్పంబులు దెమ్మని చెప్పి బనగానపల్లె కంపినది ॥వి

స్వామివారు సమాధి నుండుటకు చాలా కాలము క్రిందటనే
ఆ మహనీయుడు నిశ్చయించుకొనె అందువలన నంతకు ముందే
సమాధిని తయారుచేయించి సరవిగా నందు ప్రతిదినము
నిమీలిత నేత్రుడై స్వామి యోగనిద్ర జెందుచుండెడివారు ॥వి

అంత వైశాఖ శుద్ధ దశమీ ఆదివారము వచ్చినది-అ
త్యంత శ్రద్ధతో నా దినమున ఉదయంబుననే గోవిందాచార్యులను
కడకు రావించి నాయనా! నేనీ కందిమల్లయ్యపల్లెకున్ వచ్చి
మఠము నొకటి నిర్మాణ మొనరించి మఱియు నజ్ఞానమున బడియున్నట్టి

మానవులకు జ్ఞానబోధ లిడి సుజ్ఞానులుగా జేయుచు నీ రీతిగ
నే నూటడెబ్బదియైదు వర్షములు నేర్పుగ గడిపితి గాన
నేటి నుండి యీ భారమంతా నీ నెత్తిపై బెట్టుచుంటిని గావున
దీటుగ పామరులకు జ్ఞానోపదేశము గావింపుచునూ

ప్రపంచధర్మము నుద్ధరింపుమని పల్కుచున్న గురుదేవునితో
నపుడు గోవిందాచార్యుడు మౌనితో ననియెను, తండ్రీ! జ్ఞానశూన్యుడను
గొప్పదైన నీ కార్యభారంబు కోరి నా నెత్తిపై నుంచితిరి నా
కెప్పుడు వేదాంత రహస్యంబు నెఱిగింపక సిద్దయ్య యందు గల

అధిక ప్రేమచే పుత్రులమైన మా యందు దయలేక పోయినది యనగ
బుధజన నుతుండు పల్కె నిటుల నో పుత్రా! సిద్దుం డెవరనుకొంటివి
కారణజన్ముడు సార్థకనాముడు గత జన్మంబున నితడు
వీరక్షత్రియుల యింట జన్మించి నేరక గోహత్య చేయుటచే పాప
పరిహారము గావించుకొనుటకై తురుష్కుండుసై జన్మించినట్టి

పరమభక్తుండు నిర్వికారుండు బ్రహ్మజ్ఞానియగుటంజేసి
పరగ నాకు శిష్యుండుగా గల్గిన గురుసేవాదురంధరుడు
ధర నిట్టి శిష్యుండు లభించుట గురువు చేసికొన్నట్టి ఫలితమిది ॥వి

బంధరహితుండు నిష్కామి అతని భక్తివిశ్వాసము లనంతములు
అందువలననే అతనికి సిద్ధుం డనియెడి నామము గల్గెన్
అని వచించి కుమారా! మీ తల్లిని పూజించుచు భూతదయ గల్గి
అనయము ధర్మము తప్పకుండ పావనమతివై కడతేరుమని పల్కె ॥వి

వీరబ్రహ్మేంద్రస్వామి సమాధిని జేరబోవుచున్నాడని యెఱింగి
బారులు బారులుగా కందిమల్లయ్యపల్లె జేరియుండిరి భక్తాదులు
భక్తాదులందఱను గాంచి, యా భాగవతుం డిటు లనియె నో
భక్తులారా! నేనీ మధ్యాహ్నము భావికాలజ్ఞానము రెండున్నర గంటలకు
సమాధిని నుండబోవుచుంటిని, మీకే సందియములున్న నడుగు డనగ-జన
సమూహమంతయు నిట్లని పల్కెను సర్వధర్మసాక్షాత్పరమేశా!
వీరబ్రహ్మేంద్రావతారా! యీ విశ్వంబున ధర్మంబు స్థాపించి
ధారుణి భారము దీర్ప వచ్చిన దైవాంశజుడవు దేవా!
అనాచారవర్తనులమైన మా యజ్ఞానంబును తొలగించి
మనిపిన మీరలు లేక పోవుటచే మా కిక దిక్కెవరు తండ్రీ! ॥వి

అని స్వామిని అనేక విధమ్ముల కొనియాడుచు ప్రణమిల్లి
జనకా! మిమ్మిక కనలేము కదా? కావున మాపై దయనుంచి
ఒక్కసారి కాలజ్ఞానంబును నొనరగ బోధించి మాకు మా
మక్కువ తీర్చి తరింపజేయుడని మనవి చేసికొనిరి. అంత స్వాములు
అనియెను చిరునగవుతో బిడ్డలారా! అట్లే వినిపించెదను నిశ్చల
మనస్కులై వినుడనుచు వారి కా మహనీయుడు వచియింప దొడంగెను ॥వి

# కాలజ్ఞానము

భీంప్లాస్‌రాగం - ఆదితాళము

ఎఱిగింతు నీ కలియుగా వింతలు విని ధన్యత నొందుడీ! యియ్యవి యతి
సత్యములు నమ్మడీ! ॥ఎ

సరిగా నైదువేల సంవత్సరములకు సజ్జనుల రక్షింప దుర్జనుల శిక్షింప
మఱలా వీరభోగవసంతరాయలుగా నే నరుదెంతు నీ భువికి నపుడు ధర్మంబు
నాలుగు పాదముల నడిపింతునండి! చాల చిత్రము లంత వఱకు జరుగుచు
నుండు

నందికొండకు దగ్గఱా తపస్సునందూన వెలయుచున్న వీరభోగయాచార్య
స్వాములవారు
బంధరహితుడు నేటి నుండి పదమూడు ఆనందలు గడచిన తరువాత నతడు
వింధ్యపర్వతముల కేతెంచి మఱల నందికొండకు మహాత్ములతొ విచ్చేయు ॥ఎ

మఱి యైదువేలేండ్లకూ పైన నందన సంవత్సరములో కరువొకటి
జనియించును
ధర గడగడవడకు-తలప చుక్కలు రాలు మఱియు నేడూళ్ల కొక యూరౌతుంది
కలహములతో జనులు కడు ఘోరముగ జచ్చు కారుణ్యహీనులకు గలుగు
సంపదలెల్ల ॥ఎ

కనగా విరోధినామ సంవత్సరమున లింగాలపాటిలోన నొక శక్తి జనియించి
జనముల నందఱను చీకాకు పరచి పమయజేయును దక్షణదేశమంతా!
అచట నుండియు నందికొండకు నేతెంచు, నరయ గొప్పగొప్ప కోవెలల్
పాడగును ॥ఎ

వెలయ పింగళనామ సంవత్సరంబున కలహములు ప్రారంభమౌను
జగంబున
విలసితముగ కాళయుక్త వర్షమున వెలుగు ధూమకేతువను తార బుట్టి
నందికొండకు దగ్గఱగ నేగుదెంచి-అందుండి యా చుక్క యదృశ్యమౌను ॥ఎ

సిద్ధార్థనామ సంవత్సరమూలోన నద్దంకి చేరువన యవని వణకును భూమి
దద్దరిల్లగ రౌద్రనామ వర్షమున మహాధ్వని యొకటి బుట్టి నక్షత్రమ్ములు రాలు
పర్వతములు కూలిపడు నేలపైన ప్రజలందు వలన బహు నష్టమయ్యెదరు ॥ఎ

కాళి శక్తిగ మారి కడు భయంకరముగా గనుపించి ప్రజల రక్తము
గుటగుటం ద్రావు
చాలా భీతిని గల్గ జేయా పడమర దేశమున మాతంగియను శక్త్యవతరించి
ప్రజల గొంతులు నులిమి వీరావేశమున బహుదా నార్చుచు ప్రజ్వరిల్లును
మఱియు
కనకదుర్గమ్మ గుడి ముఖద్వారమున తూర్పుదిశ యేడు పుట్ల నల్లలు రాలు
ఇనుడు వణకును-అపుడు నాకసము నుండి యిల పైన నక్షత్రములు రాలి
పడుచు
వెండియు గండికోట దుర్గంబులోన మంటలు చెలరేగి మరియు కొందఱు
జత్రు ॥ఎ

అరయ శాపము చేత పాతాళగంగలో నొరిగి బండపై పడియున్న చంద్రగుప్త
ధరణీ ధవునకు కలికావతారుని చరణంబులు సోకి శాపవిముక్తుడగును
కనగ తూర్పున మూలరంగమ్మ యను శక్తి జనియించి భీకరంబుగ
నరచుచున్ దిరుగు ॥ఎ

తిరుపతి క్షేత్రమున శ్రీవేంకటేశ్వరుని దేవాలయములోన మొసళ్లు ప్రవేశించి
నిరతాభిషేకములు నిలిచి పూజలు లేక సరిగా మూన్నాళ్లు తలుపులు
వేసియుంచెదరు
ఆకసమందూన విషవాయులు బుట్టి అందువలన కొందఱు నాశమయ్యెదరు ॥ఎ

మఱల నేను వచ్చువఱకూ నీ రీతిగ ధరను నెన్నో యద్భుతములు
జరుగుచునుండు
మరువక నన్నెపుడు స్మరణ చేయుచునూ మానవధర్మమున మనలూ
కొనుడనుచు
దివ్యపురుషుడు వార్ని దీవించి యపుడు భవ్యయశంబంది భాసిల్లుడనిపల్కె ॥ఎ

ఆనందమున వార లతిభక్తితోడ మౌనీంద్రులకు ప్రణామంబు లొనరించి
దీనావనా! మాకు దిక్కు నీవయ్యు స్వామి జ్ఞానోపదేశంబు గావించి మమ్ము
కన్నబిడ్డలలా కాపాడుచుంటిరని యెన్నెన్నో రీతులన్ వినుతి
జేయుచునుండె ॥వి

అపుడు స్వామి గోవిందమాంబతో ననియె నిటుల నో దేవీ! నే
నిపుడు సమాధిని జేరు వేళాయె నేగుదెంతునటు గాన
నీవు పసుపుకుంకుమ మెట్టియలు నిండారిన గాజులు పూసలును
ఏవియు దీయక 'సుమంగళి'గానె యెపుడు నిటులనె యుండుమని పల్కి
పతి లోకంబున లేకపోయినను పసుపు-కుంకమ్ము మానలేదనుచు
నితరులెవరైన నిను దూరిన వారెక్కువ కష్టమ్ముల పాలౌదురు ॥వి

ఇపుడెటులుంటివొ యిక ముందు గూడ యిటులనే 'సుమంగళి'గా నుండుము
అపోహలకు బోకుము ఇయ్యది నా యాజ్ఞ యనుచు వచియించి
నా మఠమున సూర్యచంద్రాదు లున్నంత కాలంబు పూజలు జరుగును
క్షేమ ముడిగి మన వంశ మంత్యమగు శ్రేయంబుగ మన బిడ్డయౌ వీర
నారాయణమ్మ గర్భమున జనియించువారు మాత్రమె పీఠాధిపతులెయ్యెదరు
వారును బ్రహ్మాంశ సంభూతులునై ప్రజల చేత పూజింపబడుచుంద్రు ॥వి

అనియు బిడ్డలం గాంచి మౌని నాయనలారా! యిక మీకు జెప్పవల
సినదేమియున్ లేదు, సమాధిని జేరు ముహూర్తము దరియగుచున్నది
కనుక యిక మీకు జ్ఞానోపదేశము గావించుటకు గోవిందయ్య గర్భం
బునను పంచమహావీరమాత ఉద్భవించెదరు-వారు
ఈశ్వరమ్మ-పార్వతమ్మ-శంకరమ్మ యికను గోవిందమ్మ-గిరిరాజమ్మలు
శాశ్వత నామములతో విరాజిలుచు, సర్వజనులచే నుతింపబడెదరు ॥వి

అందు ఈశ్వరమ్మ పరమేశ్వరి అవతారమే యని తలచుడి ఆమె నోటి
యందు వెలువడెడు వాక్యములన్నియు నప్పటి కప్పుడె దృష్టాంతరము
లగును

ఆమె నా వలెనె ప్రజలకు తన మహిమాద్భుతంబులన్ జూపింపగలదు
ఆమె పుట్టుకతో బ్రహ్మజ్ఞాని-అందుచే భూతభవిష్యద్వర్త
మానంబులు నవగతమైయుండును, మఱియు నామె వీరమాతయగును
మానవాళికిన్ జ్ఞానబోధ లిడి మహాత్మురాలుగ వెలయుచునుండును ॥వి

నా వలెనే తుద కామెయును గూడ భావయుక్తముగ సమాధి నొందును
భావింపగ నా మాదిరిగానే ప్రసిద్ధ మఠమును నిర్మించుకొని
అందుండియు నాకే రీతిగ పూజ లమరుచున్నవో అదే విధంబుగ
పొందుగ నిత్యం బామెకు సైతము పూజలు జరుగుచునుండు ॥వి

అని వారలకుం దెల్పియు-సిద్దయ్యను మనస్సునం దలచుకొని
అనుకొనె నేను సమాధిని ప్రవేశించు నపుడు లేకుండునటు జేసికొంటిని
పరమ భక్తుడవు-గురుసేవాదీక్షాపరతంత్రుడవై నట్టి నీ కీర్తి
స్థిరముగ-ఆచంద్రార్కముగను ఈ ధర నుండుగాక అనియు
సిద్దయ్య వంటి శిష్యరత్నము నిద్దర నింకొకడు జన్మింపబోడని ప్ర
సిద్ధినొందెదవు గాక-యనుచు నాశీర్వదించె నంతలోన
అనియెను, గోవిందాచార్యుడు స్వామితో జనకా! మీ చేతనుండు బెత్తం
బును, శిఖాముద్రికయు, పాదుకలును, నెనయు యోగదండము,
కమండలమును

అవి నాకు ప్రసాదింపుడని వేడె, నంతట మౌనీంద్రుడు బిడ్డలారా!
అవి మీవి కావు-విశ్వాసపాత్రుడాధ్యాత్మిక నిరతాభ్యుదయశాలి
పదిరెండువర్షంబుల నుండి రేయింబవళ్లు నాకు శుశ్రూష యొనర్చుచు
పదిలంబుగ నను గాచుకొని యున్న భక్తుడు సిద్దునివే యివి యని చెప్పి
తన సుతున కివ్వ నిరాకరించి-బనగానపల్లె నుండి తిరిగి వ
చ్చిన తరువాత వాటిని సిద్దయ్యకు శీఘ్రముగా నొసంగుమని పల్కె ॥వి

అనంతరము, తనను చూడ వచ్చిన జనులందరిన్ ఆశీర్వదించి
ఘనుండా పైని మౌనంబు దాల్చి-కడసారి వారి నందఱను గాంచి

కదలి, సమాధియం దొక గొప్ప యగండము నిండుగ నేతిని పోసి
పదిలంబుగ నందొక వత్తి వేసి ప్రాజ్ఞుం డయ్యది వెలిగించి
వెలయగ తన ప్రక్కనే పెట్టుకొని కలియుగము నాల్గువేలయారువం
దలతొంబదియైదు వర్షంబున తలప క్రీస్తుశకము సరియైన
పదిహేనువందల తొంబది నాలవ సంవత్సరంబునందు
ప్రథితుడు నిష్టాగరిష్టుండునై భవ్యాసీనుండాయెన్

ఆ సమయంబున భేరీమృదంగాది వాద్యములు మిన్నుముట్టినవి
భాసురముగ ఆనంద కీర్తనలు భక్తులు పాడుచు జై-జై యనంగ
భూసురోత్తములు వేదమంత్రములు వాసిగ జదువుచునుండ
ఆసదీర నా జనసందోహం బా మహనీయుని భజించుచుండెను

అంత సమాధిని నియమిత కాలమునందున తలుపులు బిగింపబడియెను
జంతువులు మేత తినుటయును మాని, సమాధి చుట్టును దిరుగుచునుండెను
ఆహా! యెంతటి తత్త్వవేత్త, వేదాంతవేద్యుండు, మహిమాన్వితుండు
బాహాటోపము-స్వార్థంబెఱుగని బ్రహ్మజ్ఞాని యా తంత్రి
మన కిక కానంబడడుగదా? యని ప్రజలు విచారించుచును
అనంతరము శ్రీవారి నామంబు మనమున దలచుచు నిండ్లకు నేగిరి

గోవిందమ్మగారి యాజ్ఞచే పూల కొఱకై వెడలిన సిద్దయ్య
త్రోవ గానకను కటికచీకటిలో పోవుచుండె గురుధ్యానమున
కందిమల్లయ్యపల్లె నుండి బనగానపల్లెకున్ బోవు మార్గంబు
చిందరవందరమహారణ్యంబు, చెలగు కూరమృగములకు నిలయంబు
క్రూరసింహశార్దూలవరాహ ఘీంకార ధ్వనులు మిన్నుముట్టుచున్నను
చేరనీకను భయంబు మనంబున స్థిరసంకల్పము తోడ
పడుచు-లేచుచును, శ్రమ యని తలపక పలు కష్టంబుల నొందుచు-నా

యడవిలోన పయనించుచుండె నా దృఢభక్తుడు సిద్దయ్య
ఇటు లనేక కష్టముల నొందుచు నేగుచుండె కాననమందు
పటుతరముగ రెండామడ లేగగ, భానుండుదయంబందె
కాలకృత్యములు తీర్చుకొని మఱల కదలి పయనించుచుండె
బాలకునకు నా మార్గమధ్యమున ప్రసన్నుండయ్యె నొక మునీశ్వరుడు ॥వి



కాషాయాంబరధారియై భూతి కాయంబు నిండ నలదుకొని
భూషిత రుద్రాక్షమాలాగళుండయి, భూరి తాటాకుల గ్రంథము చేదాల్చి
ఆ మహనీయుం డెదురై నను సిద్దు డతని వంక జూడకనూ
స్వామికార్యదీక్షానిమగ్నుడై చనుదెంచుచుండె నపుడు ॥వి



అంత యోగి సిద్దయ్య తోడ నిట్లనియెను ఓయీ! నీవెవ్వండవ? వీ
కాంతారంబున బడి పోవుటకున్ కారణంబేమి? యనుచున్

ఏదైన నీకు కష్టము గల్గిన యెఱిగింపుము-అద్దానిన్
మోదమ్మున నిన్నాపద నుండి విముక్తుని గావింతు ననియెన్ ॥వి



దయారసంబున బల్కుచున్న యా తాపసేంద్రునితో సిద్దయ్య
దయామయా! మహానుభావా! దైవరూపా! నా నమస్కారములు
మా గురు నానతి విరులు దెచ్చుటకు నేగుచుంటి బనగానపల్లె కని
భాగవతున కా విషయం బంతయు బహు తర్వగా నెఱిగించి

ఇంతకు మించిన దేదియు లేదని యేగుచుండె సిద్దయ్య
అంత ఋషీశ్వరు డిటులనె, నోయీ! ఆగుము, బనగానపల్లె యిచ్చటకు
ఆరామడలకు పైనుండె నీ దినమంతయు నడచిన బనగానపల్లెకు
చేరలేవు ఈ దినమె నీ గురుడు జేరు సమాధి నటంచు బల్కితివే?

ఎటుల కందిమల్లయ్యపల్లెకున్ నేతెంచెద వీ రోజు విరులతో
జడమతివై యిటు చరించు నిను గన జాలి గలిగెడిని నాకు
నేను నీ కొక యుపాయము దెల్పెద-నీ గురుడఖండమహితుడంటివే?
ఐన నీ వింత దవ్వు రానేల? ఆలోచన శూన్యుడవై

జరిగిన దేదో జరిగిపోయినది-సాగకు మిక ముందునకు
స్థిరతిమవై యీ ప్రదేశమున గల తరువులలో ముండ్లు లేని చెట్టును
గని, యందు నాల్గు గుప్పెడులు ఆకులను గోసికొని పొమ్ము
ఘనుడగు మీ గురుదేవున కవియే కావలసిన పుష్పరాజంబులగు

అని బోధింపగ సిద్దయ్య అపుడు ఆ మాటలు పాటించకను
తన దారి బట్టి నాలుగడుగులు చనుదెంచి మరల వెనుకకున్ జూడ
ఆ ముని కానంబడడాయె-సిద్ధుడంత ఆశ్చర్యమంది
ఏమిది? యింతలో నేమయ్యె నతడు? ఎచటను కానంబడడు!

అదృశ్యంబై యుండనోపు-నిది యంతయు నా గురుస్వామి
సాదృశంబే యని మదిం దలచి చయ్యన తన యుత్తరీయంబునున్
జోలిగ నమర్చి ముండ్లులేని యాకులను వెదకి యందులోన
నాలుగు గుప్పెళ్లు కోసివేసికొని బాలుడు వెనుకకు మరలి చనుచుండె

అప్పటికి జాము ప్రొద్దెక్కె మార్గాయాసముచే సిద్దయ్యకు
దప్పిక కల్గగ నొక జలాశయము దగ్గఱలో గన్పింప
శిరముపై నున్న యాకుల మూటను దరిని బెట్టి యా జలాశయంబున
కరిగి, నీరంబు గ్రోలి మూట కడ కరుదెంచగ నా యాకులన్నియును

పరిమళములీను సుమరాజములై భాసిల సిద్దయాశ్చర్యమంది
గురుకటాక్షమిది, వేరు గాదనుచు స్థిరపరచుకొని, ఆనందించుచు
ఆ మూటను తలపైన నుంచుకొని యతి వేగంబున నతడు
స్వామి ధ్యాననిష్ఠాపరుండునై సాగె, కందిమల్లయ్యపల్లె జేర

ఆ విధమున సిద్దయ్య కొంతదూర మరుగు సరికి నొక వృద్ధబ్రాహ్మణుడు
త్రోవ కెదురుగా వచ్చుచుండుటచె, నావుడు వానిం గాంచి
బ్రాహ్మణోత్తమా! మీ రెట నుండి పయనించుచుంటి రనగా
అమ్మహనీయుడు సిద్ధునితో నిట్లనియె నేను బద్వేలు మొదలగు

గ్రామాలలో యాచన చేసికొనుచు కందిమల్లయ్యపల్లె జేరి యా
స్వామివీరబ్రహ్మేంద్రులవారు సమాధినొందుట చూచి
వచ్చుచుంటిని, ఆహా! యెంతటి వైభవంబు నే నెపుడు
ఎచట చూచి యెఱుంగలేదు నా కింత వయస్సయ్యె గాని

జీవసమాధి నొందుటయె గొప్ప విశేషముగాదా? మఱియు
భావాతీతుడు సమాధి యందు ప్రవేశించు సమయమున
వేదాంతోపన్యాసమ్మును గావించు నపుడు నాస్తికులే
మోదంబున తలలూపి, 'ఆహా'! యని మ్రొక్కులిడిరి బహు వింత ॥వి

అని వర్ణించుచునుండ సిద్దయ్య, అనుమానంబున బాపనితో
ననియె, నేను లేని తరి మా గురుం డటు లొనరించునె? నీవు
అసత్యంబులన్ బల్కుచు నుంటివి, అది నే నమ్మను పొమ్మన నా
వసుమతీసురుం డా సమయమ్మున వాని తోడ నిట్లనియెను ఓయీ!

యెందుండి వచ్చుచుంటి వని యడుగ నెఱింగించినాడ గాన
ఇందు నీవు నమ్మిన నమ్మకున్న ఏమి నాకు ఈ చింత
ఇంత వయసు వచ్చి బాపడినై నీతో నిట్టి యబద్ధములాడగావలసి
నంత యవసరము నాకేల? వచ్చె, అదియు గాక నా ఘను డపుడు నాకు
పట్టుశాలువ, సంభావన లిచ్చెను పరికింపు మివిగో! యియ్యవి గూడా
వట్టిదేనా? నా గాయత్రి సాక్షిగ వారు సమాధిని ప్రవేశించిరి ॥వి

ఆ సమాధి తలుపులు బిగింపబడె, అంత దనుక నే నచటనే యుండి
భాసురముగ నా వేడుకం జూచి బయలుదేరి యిటు వచ్చుచునుంటిని
అది విని సిద్దయ్య నిశ్చేష్టుండై మొదలు నఱికిన వృక్షమ్ము వోలె
పృథివి పైన బడి నేడ్చుచు, తండ్రీ! వదలిపెట్టితివ నన్ను
తల్లిదండ్రులను గూడ వదలి నా కెల్ల సుఖంబులు మీరె యనుకొని
యుల్లంబున ఆనందమందుచునుంటి మీ పుత్రునిగను ॥వి

పం[డెండేడుల నిన్నే నమ్ముకొని పగలు రేలు మిము సేవించితి గద
తం[డీ! కడకు నే లేని సమయమున తమరు సమాధిని బొందితిరా!
కన్నబిడ్డల కంటెను దయతో మిన్నగ సిద్దా! సిద్దా! యనుచును
నన్నెప్పుడు కలవరించుచుంటివే, నా తం[డీ! యెటుబోయె నా [పేమ

నేను మీతో సమాధినుందునని, అనుకొనుచుండెడివాడ
ఐన, ఈ యభాగ్యున కంతటి యదృష్టం బెటు లభించును
కడ కా వేడుకయైన కనులార గాంచు భాగ్యంబు లేదాయె నాకు
ఇటుల పుష్పముల నెపము బెట్టి నన్నట లేకుండగ చేసితివా?

అట్టి సమయమున నేనుండ సమాధి యందు మీతో నేనుందు ననుచు
పట్టుపట్టెద నటంచు మనంబున భావించితివా? జనకా!
దండి గురుడవని, నా దైవంబని, తలచి, సద్గతి కొఱకు నీ
యండ జేరి పడియుండిన నాపై నతి కాఠిన్యం బేల గల్గినది?
చెట్టు వదలిన పక్షి విధంబున చెడిపోయెను నా [బతుకు
ఎట్టులుందు నిను వీడి యింక నా కెవ్వరు దిక్కీ ధరను

[బహ్మదేవుండు నా లలాటమున [వాసినదింతే గాబోలు?
ఇమ్మహి నెవ్వరి కెట్టి కష్టములు నేర్పడునో గద! యెవరెరుంగుదురు
అని దుఃఖంబున నేలపై బొరలి, ఆ[కోశించు సిద్దయ్యను గాంచి
కనికరమున నా వృద్ధ[బాహ్మణుడు కదలిపోవ కాళ్లాడక యిట్లనె

ఓయీ! చూడగ నీకు మతిపోయినట్లున్నదే?.అందు ఫలితంబేమి?
చేయవలసిన పనికై ఆలోచించుటయే వివేకమౌనుగద!
ఇదియేనా! నీ వేదాంతము! నీ విటుల దుఃఖించుచుండుట భావ్యమా!
బుధులు సుఖదుఃఖములు సమంబుగా మది దలంచెదరు కాదా?

నీ గురుదేవుడు నీకు బోధించిన నిజ వేదాంతరహస్యము లేమాయె?
ఈ గతి నేడ్చుచు నేలపై బొరల, యెవ్వరు నిను నోదార్చువా రిచట

కనుక యికనైన దుఃఖంబు మాని, కర్తవ్యం బాలోచించుకొను
మనుచు సిద్ధయ్య చూచుచుండగనె, ఆ మహాత్ము డదృశ్యుండాయెను ॥వి

# ద్వాదశాశ్వాసము

అనంతరము సిద్ధయ్య చెదరిన మనంబును కొంత దిట్టపరచుకొని
కనుల నుండి ప్రవహించుచున్న యుదకమును తుడుచుకొనుచున్ లేచి
పొంగిపొరలి వచ్చుచున్న దుఃఖమును ఆపుకొనుచు పూలమూటను స
త్సంగహితుడు శిరంబున నిడుకొని చనుదెంచెను కందిమల్లయ్యపల్లెకు ॥వి

ఆ రీతిగ కందిమల్లయపల్లెకు నతడు గురుధ్యానమున
జేరి మఠమునకు బోవగ సింహద్వారకవాటములు బంధింపబడి యుండె
అంతట సిద్ధయ్య తలుపుల దెరువుండని యెలుగెత్తుచు నేడ్వ
నంత-లోపల నుండి యొక నౌకరరుగుదెంచి సిద్ధయ్యా!
గురువుగారు సమాధి చేరిరి-మఱి నీ కిచ్చట పని యేమున్నది?
అరయనేల మీ యింటి కేగుమని యానతిచ్చె గోవిందమ్మగారు ॥వి

అని కవాటములు తెరువకయే తా నట నుండి వెడలిపోయె
తన హృదయమ్మున కా వాక్యంబులు గునపములై బాధింప దొడంగెను
ఏమియు తోచక కడు శోకంబున హే గురుదేవా! యనుచు
స్వామి పదంబుల దృష్టి నిల్పి యిటు స్మరియించెను సిద్ధయ్య ॥వి

హిందుస్తాన్ తోడిరాగం - తిశ్రఏక తాళం

మహానుభావ! సద్గురూ! మదీయదైవమా!
యూహలన్ని నీ మీదనె యుంచుకొంటిరా! ఉంచుకొంటిరా! ॥మహా

వాసిగ సత్పథము జేర్తువనుచు నమ్మితీ! జేర్తువనుచు నమ్మితీ! నా
యాసలన్ని యడియాసలుసై పోయినవా? ఐపోయినవా? ॥మహా

క్షణము గూడ నన్ను వదలజాలని నీవూ! వదలజాలని నీవూ!
ఎనయ నింత కాఠిన్యం బేల గల్గెనూ! నాపై నేల గల్గెనూ! ॥మహా

మనోవికాస! దైవతేజా! మాన్యచరిత్రా! అసమాన చరిత్రా!
ఘనామునీ జనాభిమానకావగరావా? నన్ను బ్రోవగరావా? ॥మహా

తల్లి గోవిందమ్మగారె దయను వీడియూ! దయను వీడియూ!
వెళ్లిపొమ్మనంగ నింక నెందులకీ బ్రతుకు నా కెందులకీ బ్రతుకు ॥మహా

అని నుతించి యిక బలవంతంబుగనైన ప్రాణములు బాయుటే మంచి
దని తలంచి, మఱల తనలోన 'ఆత్మహత్య' మహాపాతకంబని
గురువరేణ్యు డొకనాడు అని యుండె నరయ జీవముల వీడుట కంటెను
స్థిరచిత్తుడనై పంచప్రాణములు వరుసగ బంధించియును

మనోమారుతంబుల రెండింటిని మఱియు నేకంబుజేసి
షడాధారంబులను భేదించి సహస్రారమందున నిల్పి
అంతరకుంభము జేసి పరబ్రహ్మమందైక్యముగావింతునని తలచి
చింత విడిచి యడుగైనను కదలక సింహద్వారము చెంతనే యుండి
తల క్రిందికి కాళ్లు పైకి పెట్టి తదేక దీక్ష వహించి ని
శ్చల చిత్తంబున ఘోరతపంబాచరించుచుండె సిద్దయ్య ॥వి

ఈ విధమంతయు సేవకుల వలన నెఱిగి గోవిందమ్మగారు-ఆ
తావునకు వచ్చి-ఆశ్చర్యమంది తలక్రిందుగనున్న సిద్దయ్యనుం గని
ఔరా! వీరబ్రహ్మేంద్రస్వామి యందెంత దృఢభక్తి యీతనికి
ఏరికైన నింతటి విశ్వాసం బేర్పడునే యని యానందించి

సిద్దా! సిద్దా! యింత కఠినముగ జేయుచుంటివేమిది తపస్సు
బుద్ధిమంతుడవు జరిగినదానికై పెద్దగ విచారించిన ఫలమేమి?

నీ గురువుల సమాధి కడకేగి నీవు దెచ్చిన పుష్పములతో పూజించి
భాగవతుని మనసార వేడి తీర్థప్రసాదములు తీసికొనివెళ్లుమనియె ॥వి

తన గురునామము చెవుల సోకి నంతనె స్పృహ గల్గెను సిద్దునకు
కనులు దెరచి చూచునంత నెదురుగ కనుపించెను గోవిందమ్మ
అంత సిద్ధయ్య యధాప్రకారంబై నిలువంబడి గోవిందమాంబ
చెంతకు జని, దండప్రణామములు చేసి నిలువబడి, తల్లీ!

నీకై నను ఈ దీనునిపై దయలేకపోయెనా? జననీ!
ఏ కరణిని బ్రతుకువాడ? నా గురున కెటిగింపలేదా? నను గూర్చి
ఇప్పటికై నను ఈ బిడ్డనిపై నేర్పడెనా దయ, అంతియె చాలని
చెప్పుచు వినయవిధేయుడై యామె చెంత దుఃఖాంబకుడై యుండెను ॥వి

అపుడు గోవిందమాంబ సిద్దునితో ననియె నాయనా! నేనేమి సేతు
విపరీతమైన ప్రేమ గలదు నీ వీరగురువునకు నీపై
కాని నీవు సమయానికి పూలతో రాలేనందున
తాను సమాధిని జేరు శుభలగ్నం దాటిపోవుచుండుట వలన
నిన్న నేక మారులు దలంచుకొని నిశ్చయించి లగ్నము మీరునంచు
తిన్నగ సమాధియందు జేరె నా ధీమతి మీ గురువరుడు ॥వి

కనుక నీవా సమాధి కడకుం జని దర్శనంబు జేసి నీవు తె
చ్చిన పుష్పములతొ నా సమాధిని పూజించి-గురుని సేవించి
ప్రసాదమును గొని నీ గృహంబునకు బయలుదేరి పొమ్మనగా-మహా
ప్రసాదమని గోవిందమాంబకు ప్రణామంబులను నొనరించి
ఆమె పల్కులను గురువాక్యములుగ నా మహనీయుడు భావించి
స్వామిధ్యానమున పూలమూటగొని సరగున లోనికి జనియెన్ ॥వి

సమాధి వద్దకు పోవు సరికి నా సాధకుండు కడు శోకమున
అమాంతము నేలపై బడి స్పృహ తప్పి యచల స్థితి పడియుండె
కొంత తడవునకు సేదదేరి యా గురుదేవునకు నమస్కరించుచు న

త్యంత దుఃఖమున తల మోదుకొనుచు తండ్రీ! వీరబ్రహ్మేంద్రగురూ!
ఎందుకు నన్నిటుజేసినావు-నేనేమి పాపమొనరించినాను-నా
యందున నీకున్న ప్రేమ యెటుబోయె నిపుడు నా దైవరాయా! ॥వి

సింధుభైరవిరాగం - ఆదితాళం

ఏమి పాపమొనరించితినని నన్నిటు జేసితి వీవు
ఓ మహనీయా! నీ పదముల నే నొనర నమ్ముకొనియుంటి ॥ఏమి

ధన్యమయ్యె నా జీవిత మనుకొని తలచి ముదమ్మున నుంటి
అన్య మెఱుగ నీ సేవయే తప్ప-ఆశ్రితజనమందారా! ॥ఏమి

ఇల్లు విడచి నీ పంచ గాచుకొని తల్లియు-తండ్రియు గురుదైవమీవే యని
యుల్ల మలర వదిరెండేడులు నీ యూడిగ మొనరించితినే!
కరుణామయ! నే మోక్షార్హుండను కానని నన్వదలితివా!
సురుచిరముగ నీ సౌఖ్యమె నీవు చూచుకొంటివా? తండ్రీ! ॥ఏమి

నీ మీదనె నా యాశ లన్నియును నిలుపుకొనియుంటి నేను
ఆ మహద్భాగ్యము అడుగంటినదా? అయ్యో! నేనెటు జేతు ॥ఏమి

పలుకవేమి? నేనెంత వేడినను, తొలగిపోదునని తలచితివా?
బలవంతముగా ప్రాణములనైన బాసెదను గాని కదల నిట నుండి ॥ఏమి

నీ మహిమలు నేనెఱుగని వాడన, నీ సామర్థ్యము నాకు దెలియదా?
క్షేమముగా నీ దరిజేర్చుకో! అటు చేయవేని నే జీవించియు ఫలమేమి ॥ఏమి

ఈ ప్రపంచ విషయంబులందు నా కెంత మాత్రంబు నాశయే లేదు
ఓ ప్రజ్ఞానిధీ! నిను సేవించుచునుండుటయే నాకు ముక్తి ॥ఏమి

అని వేడియు నిక లాభము లేదనుకొని శోకంబున సిద్దయ్య
మనమునందు నిశ్చయించుకొని యా మఠమునందున్న గండకత్తెరను

కంఠమునకు తగిలించుకొనగ, నా కత్తెర రెండుగ విరిగిపోయె-నా
తండు విస్మయంబంది, యిదియేమి? ధర్మమేదైన దప్పితినా?
లేకున్న నిట్లెందుకు జరుగును, లేకపోయె గురుదయ నాపై
ఏ కలుషమ్ములు జేసి యెఱుగనే? యెందుల కిట్టుల జరిగినది? ॥వి

ఐనను నింకొక సారి ప్రయత్నం బాచరించి చూచెద గాక, యే
మైనను నేనీ పాడులోకంబు నాశ్రయించి మనజాలనని తలచి
ప్రక్కనున్న బండరాతి పైన తల పగులగొట్టుకొని చత్తునని మఱల
చక్కగాదు ఇక్కరణి నొనర్చుట చాదస్తుల లక్షణము

మరియొక విధమున ప్రయత్నించి ఈ మహానుభావుని దరిజేరెద నని
స్థిరమనస్కుడై సమాధి కెదురుగ జేరి పద్మాసనంబేసికొని
పరమపావనా! భక్తావన! నీ చరణములకు నా నమస్కారములు
గురుదేవా! యికనైన నన్ను నీ చరణ సన్నిధికి జేర్చుకొనుమయ్యా! ॥వి

నిను విడనాడి నిమిషమైన నే మనగలనా? యీ ధరను
కనలేవా? అది నీకు తెలియదా? గడచిన దంతయు మరచితివా?
తలచినంత నీ విప్పుడు నను నీ దరికి జేర్చుకొనగలవు
తెలియనట్లు నీవుంటి వది నాకు తెలియదని తలంచితివా?

ఏదియో యొకటి యిపుడే తెలుపుము-ఇక నే నోర్వగజాలనని
తా దెచ్చిన పూలను సమాధిని తనివితీర పూజించి
సమాధి చుట్టును ప్రదక్షణంబును సల్పి మఱల సమాధి కెదురుగా
క్రమము దప్పకను నెప్పటి విధమున కదలక కూర్చొని యపుడు ॥వి

కడసారిగ నిటులని ధ్యానించెను కరుణామయు! తండ్రీ! మీ
యెడల మిక్కి భక్తితో సేవలే నొనరించితినేని
యే దోసంబులనైన గాని నా యెడల లేకుండునేని
నీ దర్శన భాగ్యంబు గల్గును నిశ్చయంబుగా నాకు

అటుల గాదేని పంచప్రాణముల నవలీలగ బంధించి
అటుల సహస్రారమును భేదించి నీ యందైక్యము నొందెదనని తలంచి
అటుల చేయుటకు ప్రారంభింపగ "ఆగుము సిద్దా!" యనెడి
పటుతర వాక్యము చెవిని బడగ తన ప్రయత్నమును విరమించి

ఆ శబ్దము గురుకంఠధ్వని వలె నున్నదని మనంబునన్ దలచి
ఆ సమాధి తలుపుల దగ్గఱ చెవి నానిచి వినునంతలోన మళ్లీ
సిద్దా! సమాధిపైనున్న బండను చిన్నగ తొలగింపుమను శబ్దము విని
అద్ది తన గురువుగారి కంఠమే యని గ్రహించి యానందమున
పేదకు పెన్నిధి యబ్బిన విధమున నేదో తెలియని సంతోషంబున
సాధుహితుడు సమాధిపై బండను క్షణములోన తొలగించె

ఆశ్రితవత్సలుడగు శ్రీవీరబ్రహ్మేంద్రావతారుం డపుడు
భాసురముగ బాలార్కతేజమున ప్రకాశితుండై యుండె
సమాధి వెడలి బయటకు వచ్చి స్వామి సిద్దునిం గాంచి
కమనీయంబగు వాక్కులతో నిక్కరణిని బల్కెను- సిద్దా!

ఎందులకీ నీ సాహసంబు నే నెఱుగని వాడనె నీ భక్తి, నీ
యందు నాకు దయలేదనుకొంటివా? యని పలుకుచున్న యా గురుదేవుని
పాదమ్ములపై సాష్టాంగముగా పడి నేత్రద్వయమున ను
త్పాదకమై ఆనందబాష్పములు పారుచునుండగా నపుడు
దేవా! నీ కృప నాపై నుంచి కావవే నన్ను కారుణ్యనిధీ!
భావాతీతా! యీ జరామరణ ప్రవాహము నుండి రక్షింపుము నను

దేహేంద్రియాదులకు జిక్కి యీ దేహము శాశ్వత మనుకొని మాయా
మోహబలగంబు నిత్యమని నమ్మి మోసపోవుచును మళ్లీ
పుట్టుచుగిట్టుచు సుఖంబు గానక భూరి కష్టముల నొందుచు నుందురు
అట్టి మాయలలో నను దగులనీయక నాకు ముక్తి నొసగుము తండ్రీ!

మఱియు నాకు మోక్షార్థతంబైన మహోపదేశములను కొన్నింటిని
నెఱిగించి నన్ను ధన్యునిజేయగ పరమపురుష! మిము వేడుకొనుచుంటి
నని ప్రార్థింపగ నా మహనీయుడు కనికరించి యో సిద్ధా!
వినుము శ్రద్ధగా చెప్పెద నటంచు వివరంబుగ నిట్లనియెన్ ॥వి

ఇంక నీవు వివాహమాడి కొన్ని యిడుమలు పడవలసిన యోగముంది
ఆ కర్మ పూర్తియైననే గాని యంత దనుక నీకు ముక్తి లభింపదు
హరిహరాదులకునైన కర్మఫల మనుభవింపకయె తప్పదు కావున
జరిగితీరవలె నీవు గృహంబున కరిగి తలిదండ్రులనుసేవించుచు
సుగుణవతియైన కన్యకామణిని చూచి పరిణయంబాడి
అగణితంబుగా రాజయోగంబునందు వర్ధిల్లుమనియు ॥వి

యోగంబుల నన్నిటిలోన రాజయోగంబే శ్రేష్ఠంబు
భాగవతుల కిది సులభమైన సుమబాట కైవల్యమునకు
జనకాదులు రాజయోగముననే ఘనులై తరింపబడలేదా?
కనగ నేను రాజయోగమ్ముననే గదా! జీవితము గడిపినది
నా వంశము నిర్వంశంబగును-నీ వంశం బభివృద్ధి చెందును
భావింప పుత్రపౌత్రాభి వృద్ధిగలవాడవై వర్ధిలు యోగంబున్నది ॥వి
కనుక నీవు రాజయోగంబునన్ మనుచు నీ లోకమందు
ఘన యశస్సును పొందవలసినదని నిన్నాశీర్వదించుచున్నాను
మరి నీ గర్భమున తపోనిష్ఠాగరిష్ఠుండైన పెదపీరయ్య యనం
బరగు సుపుత్రుండు జన్మించు నతడు బహుప్రజ్ఞానిధియౌను ॥వి

అనంతరము నీవు నా సాన్నిధ్యమందెదవుగాక-అనగా
మనంబునన్ చింతించుచు సిద్దయ్య మహనీయా! నా తండ్రీ!
తమ కరుణాకటాక్షముచే నీ దాసుని నింతగ జేసియు మళ్లీ
భ్రమలకులోనౌ సంసారంబున బడి మ్రగ్గుమనుట న్యాయంబగునే?
తల్లిదండ్రులను గూడ వదలి నీ చల్లని కృపచే నింతకాలంబు
ఉల్ల మరల మిము సేవించుకొనుచు నున్నది యిందులకేనా?

అందుకు మీ బిడ్డడు ఈ సిద్ధుం డంగీకరించునని తలచితిరా? లేక
ఇందు నన్ను పరీక్షింప నెంచి యిట్టుల బల్కుచు నుంటిరా? యనెను ॥వి

ఎన్ని చెప్పినను సిద్ధుండు వినక యున్న మరల గురువరుడు
తిన్నగ సిద్ధుని తోడ నిట్టులని దెల్పఋూనె నా ఘనుడు
నాయనా! సిద్ధా! యీ జగమంతయు మాయచే నిండియున్నది అట్టి
మాయను గ్రహించుటకు బ్రహ్మేంద్రాది మహనీయులకైనను తరము గాదు
నీవు అంతగా వేడుచుంటివి కావునన్ నీకు దివ్యదృష్టిని
కావించెద నిక మాయ చేతను గప్పబడిన యీ ప్రపంచ మెట్టిదో! ॥వి

పరాపరంబగు పరబయ లెట్టిదో పరికింపుమురా సిద్ధా! అట్టి
పరబయలును గ్రహియించుటకే యోగివరులు ఏకాగ్రచిత్తులై
అనేక వేల సంవత్సరములు తపమాచరించుచు నుండెదరు
అని చెప్పగ సిద్దయ్య పులకాంకితాంతరంగుడై తన్మయము జెంది

తన శరీరమును మరచి బ్రహ్మానందమున పరవశుండై యుండె
మునికుల తిలకుడు సిద్దయ్య కొసంగిన దివ్యదృష్టిని మఱల తీసికొన
నెప్పటి లాగున లోకజ్ఞానం బేర్పడి సిద్ధుం డపుడు
అప్పరమ భాగవతుని పదమ్ముల కంజలి గావించి-తండ్రీ!
అనంతకోటి భానుప్రకాశా! ఆశ్రిత జనమందారా!
మునీంద్రులకె సాధ్యపడని నీ దివ్యమూర్తిని దర్శింప గల్గితిని ॥వి

దేవా! నీ నిజరూప మిట్టిదని తెలియ నేరనైతిని నిన్నాళ్లు
తావక దర్శన భాగ్యముచే నే ధన్యుడ నయితిని నీ కృపచే
జననుత! యిక నా జీవితశేషంబును నీ పాదసేవలోన గడిపెద
అనుగ్రహింపవె నా గురురాయా? యని యనేక విధముల నుతియింపగ

స్వామివారు తన విశ్వరూపమును చాలించి యెప్పటియట్లు
మామూలు రూపము ధరించి సిద్దయ్యకు మఱి యిట్లని చెప్ప దొడంగెన్

పరమభక్తా! సిద్ధా! శ్రీ కృష్ణభగవానుం డుద్ధవునకు దెల్పిన
ఎఱుక పరిపూర్ణమును గురించి నీ కెఱుకపరచెదను గాన
సావధానచిత్తుడవై వినుము శ్రవణానందముగాను
భావగర్భితము, ముక్తిదాయకము-భవబంధ వినాశమ్ము ॥వి

ఈ కనుపించెడి ప్రపంచమంతయు నింద్రజాల మను మాయచే కప్పి
జోకుగా నెండమావుల విధమున చోద్యంబు గలుగజేయు
ప్రకృతి మాయ సుఖదుఃఖాలు మాయ అనుభవమందురే కాని,
అదియునున్ మాయ
వక్రితమౌ ఆ మాయకు మూలం బొనరగ లేనేలేదు ॥వి

అట్టి మాయయే భ్రమలకు లోనై ఆలవాలంబుగాను
కష్టసుఖములకు నిజ్జగంబునన్ కారణంబగుచునుండె
భావాతీతమె యచల పరిపూర్ణమని భావింపవలెర సిద్ధా!
దైవత్వము అచల పరిపూర్ణ మిట్టిదని తలంచరా బిడ్డా!
అది తప్ప జగంబున మరేమి లేదని మనంబునం దెలిసికొని
హృదయానందముగ నారూఢజ్ఞాని యుండుటె పరిపూర్ణమును
పొందుటనబడును ॥వి

అదియే నిర్మలత్వము విశ్రాంతి కదియే మార్గము జ్ఞాను లీ మాయా
స్పద ప్రపంచ విషయముల దగుల్కొనక బహు జాగ్రత్తగ మెలగు
చుందురని
ఎరుక ప్రభావంబును సిద్ధయ్యకు నెఱిగించియును మఱియు
పరమ విజ్ఞానశాస్త్రకోవిదుడు బహుపురాణపారంగతు డిట్లనె ॥వి

భావాతీతముల కతీతమైనదే పరగ నచల బ్రహ్మంబనం బడును
భావింపగ నయ్యదియే యచల పరిపూర్ణమని గూడ యనబడుచుండును
అట్టి యచల పరిపూర్ణమె సర్వత్రా యలముకొనియున్నది
షడ్వికార సహితమైనది, మఱియు స్వరూపనామక్రియులు లేనిది

పురుషుడుం గాక స్త్రీయును గాక, నపుంసకము గాక విలసిల్లుచుండు
అరయ ప్రకృతి ప్రపంచముతో నే తెరగు సంబంధములు లేనిదగును
ఆదియంత్యములు లేనిది యగు మహాసముద్రమును బోలియుండును ఆ
సుధ పరిపూర్ణాచల సముద్రమును చూడు మనుచు సిద్ధునకు జూపించె ॥వి

అంత సిద్దయ్య ద్వాదశాక్షర మహామంత్రమును జపించుకొనుచు
భ్రాంతి దొలగ చేష్టారహితుండై పరికించె నప్పు డా దృశ్యంబును
ప్రథితు డపుడు సిద్దయ్య తోడ నిటుల బల్కెను సిద్దా! చూచితివి గదా!
అదియే పరమపథంబు బట్టబయ లందేమియు గాన్పింపదు
ప్రకృతి పురుషులు మాయ, మాయ యన భ్రాంతి ఆ భ్రాంతి వలననే
ఆకృతిగ నీ చరాచర ప్రపంచ మంతయు తోచుచున్నయది ॥వి

దాని వలననే ప్రకృతి పురుషులు లేనివిగ నున్నవి-ఈ
లేని మాయాప్రకృతి పురుషులు రెండును భావాభావములను వీటికి
అతీతంబు లగుచున్నవి. కావున ఆ రెంటిని గుర్తించుటే యెరుక
హితమున నెరుకకు మూలము మాయయె ఇది మెఱుపుగ కనుపించి
మాయమగు

కలవంటిది ఈ యెఱుక స్వప్నమున కనుపించియు నేవేవో
మెలకువ రాగనె వెంటనె యవన్ని తొలగి యెటుల మాయంబగునో
ఆ విధమున నామరూపంబులు గలవన్నియు మాయంబగుచునుండును
కావున నమ్మకుము ఎఱుకను-అది యొక గారడి-లోకమునందు ॥వి

ద్వాదశాక్షరమహామంత్రంబే తలప శాశ్వతము-సత్యంబైనది
ఇదియే జన్మకు నాదర్శంబు-ఇంతకు మించిన దేదియును లేదని
ఎఱుక పరిపూర్ణవిషయంబులను ఎఱిగింపగ సిద్దయ్య
పరమ సంతోషమున గురుదేవుని పాదములకు ప్రణమిల్లి
జనకా మీ యనుగ్రహము వలన నా సంశయములన్ని తీరినవి
కనుక తమ యాజ్ఞ మీద గృహమునకు జని వివాహంబు చేసికొని

సంతతిం బడసి రాజయోగమున చరియింతును కానీ-అ
త్యంతమైన యొక కోరిక కలదని యనగనే స్వామి-సిద్ధా! ॥వి

నీ కోరిక నేనెఱుంగుదును-అవి నీకై సిద్ధము చేసియుంచితిని
చేకొనుమని చెప్పి, పాదుకలను-చేతిబెత్తమును-యోగదండమును
శిఖాముద్రికల నొసంగి ప్రేమతో శ్రీవీరగురుడు సిద్ధయ్యను
సుఖము గల్గునని దీవించి, మఱియు సుజనావను డిట్లు చెప్పదొడగెను ॥వి

నాయనా! సిద్ధా! ఆలకింపు మీ మాయాప్రపంచమునందు
ఏ యవస్థలను చేరనీక నీవెంతో జాగ్రతగ నుండవలయును
గుణహీనులైన దుష్టులు కొందఱు గురువులమని చెప్పుకొనెడివారును
ఘనముగ విభూది మేన దిద్దుకొని కడు డాంబికముగ నుండెడి వారును

జుట్టును-గడ్డము పెంచుకొని మేము దొడ్డయోగుల మనియెడివారు
పొట్టకూటికై వేషాలేయుచు పూజనీయులమనువారు
సాధులమని చెప్పికొనుచు ప్రజలను చల్లగ వంచించువారును
సాధన లేకను నితరులకు నీతినేర్పుచు నుండెడివారు

కోరికలకు బానిసలై కొందఱు గురువులుగ తిరుగువారు
పేరులను పెంచి యాటోపాలతొ పెన్నిధి నార్జించువారు కొందఱు
కాషాయాంబరములను ధరించి, కాంతాకనకంబులపైన
ఆశ వదలలేకను నెన్నెన్నో దోషంబుల నొనరించెడి వారును

పరిపూర్ణంబును బోధించెదను పంచెల చాపులు తెమ్మనువారును
ఎఱిగింతును తారకమ్ము దక్షిణ లిచ్చినచో యను వారు కొందఱును
ఈ శరీరంబ నిత్యమైనదని యితరులకు బోధచేయుచును
ఆశ వదలకయె తమ శరీరముల యందు భ్రాంతి విడలేని వారును

తనవారిని పోషింపలేకయె పనికి సోమారులై మఱికొందఱు
చనుదెంచి దేశముల తిరుగుచు భిక్షాటనచే జీవించువారును

భక్తి యన నేమొ యెఱుగని వారలు బహు శిష్యులతో నుందురు కొందఱు
యుక్తిగ కొందఱు మూగసైగలతో నెత్తులు వేయుచునుండెడివారును
చక్కగ జనులకు నీతినిష్ఠలను గుక్కతిరుగకయె చెప్పుచును-అం
దొక్కటియైనను వారొనరింపరు నిక్కువముగా మఱి కొందఱు
ఇటుల వారు వాంఛలకు దాసులై యెన్నొ విధముల వేషము లేయుచు
తాము
చెడుటయే గాక, లోకమును గూడ చెడిపివేయుచున్నారు
అట్టి దుష్టులను దరికి రానీక అతి జాగ్రతగ మెలగుచునుండి
ఇష్టముగా రాజయోగివై నే నిచ్చిన పాదుకలను నిత్యమ్మును
పూజించు కొనుచు కొంత కాల మీ పృథివీ స్థలి యందుండి సిద్ధుడవని
భూజనులలోన ప్రసిద్ధి నొంది పుణ్యచరితుండవై యనంతరము
నా వలెనే జీవసమాధిని నీవును పొందు మటంచు వచియించి
దీవించి స్వామి యథాప్రకారము తిరిగి సమాధిలో జేరె ॥వి

అనంతరము సిద్ధయ్య బ్రహ్మంగారి యాజ్ఞ శిరసావహించి
మనమున దలచుచు నెప్పటి యటుల సమాధి కవాటము బంధించి
గురువుగారు తన కొసగిన నాలుగు పరిశుద్ధమైన వస్తువులన్
పరమ భక్తుండు కనుల కద్దికొని బహు ప్రీతితో నవి తీసికొని
సమాధి చుట్టును తిరిగి మనంబున స్వామిని మళ్లీ ధ్యానించి
నమస్కరించి బయలుదేరె నా నవనీత హృదయు డపుడు ॥వి

తన గ్రామంబైన ముడుమాలకును పోవలెనను తలంపుతో
అనుకొనె శ్రీగోవిందమాంబ గోవిందయాచార్య పోతులూరాచార్యుల
వద్ద సెలవు తీసికొను తలంపుతో వారల దగ్గఱ కేగి
సిద్ధుడు భక్తితో నమస్కారంబు చేసి స్వగ్రామ మేగుచుంటి నని
వారలకు తెలిపి, సెలవునంది, శ్రీవారిని స్మరించుకొనుచు
దారి బట్టి ముడుమాల మార్గమున ధీరవరుడు చనుచుండె ॥వి

సిద్దయ్యకు తమ తండ్రి యిచ్చిన నాల్గు శ్రేష్ఠ వస్తువుల నపహరింపదు
ర్బుద్ధి బుట్టి గోవిందాచార్యుడు పోతులూరాచార్యు లిరువురును
చినబుచ్చిరెడ్డి పెదబుచ్చిరెడ్డి యనెడి యా యూరి దొంగల వద్దకు
చని వారల కా విషయ మంతయు సవిస్తరముగ నెఱిగించి

పోవుచుండె. సిద్దుడు ముడుమాలకు పోవు మార్గమున నిపుడు,
కావున మీ రిపు డచటికేగి యే కరణినైనను మా వస్తువులు మాకు
తెచ్చియిచ్చినచో మీ యిరువురకు హెచ్చుగ బహుమానంబు
ఇచ్చెదమని చెప్పంగనె వారపు డిదెంత పని యని యొప్పుకొని
వారిని పొమ్మని ముడుమాల కేగు దారిన నేగుచు తస్కరులు కొంత
దూరమేగునప్పటికి సిద్దయ్యగారు మార్గమున కనుపించెన్ ॥వి

వెనుక ప్రక్కగా జనుదెంచి సిద్దయ్యను కొట్టుటకు కఱ్ఱ లెత్తగా
కనుపించె వారి యెదుట వ్యాఘ్రంబు కడు భయంకరముగాను
ఆ పులినిం గని యా చోరులు భయమంది వెనుకన్ మరలి
తోపకేదియును, పరుగు లంఘించి త్వరితంబుగ గ్రామమునకు నేగి

ఆ విషయము గోవిందయ్యకు పోతులూరాచార్యుల కెఱిగించిరి వారలు
దేవహితుడు సిద్దయ్య వెనుకకుం దిరిగి చూడగా నా తావునందు
చోరులు బెబ్బులి యేమి లేకుండె చోద్యమంది సిద్దయ్య యిది
వీరబ్రహ్మేంద్రస్వామి మహిమయే వేరు కాదనుచు నిశ్చయించుకొని
పరమ సంతోషమున గురుదేవుని భక్తితో ప్రార్థించుచును
అరుదేరుచు ముడుమాల కేగి స్వగృహంబునకు జనె నంత ॥వి

తల్లిదండ్రులు సిద్దుని గాంచి యుల్లమలర కౌగలించుకొని
అల్లా దయచేత మా కుమారుండు మళ్లీ తిరిగి వచ్చినందులకు
అపరిమితా నందంబు నొంది వారా సిద్దయ్యతొ నుండ
అపుడు తలిదండ్రులకు సిద్దుడు సాష్టాంగ వందనం బొనరించెన్ ॥వి

గురు వొసంగి నటువంటి వస్తువులు గోప్యముగా నొక గది యందుంచి
నిరతము నైవేద్య దీపారాధన నెఱపుచుండె నతి భక్తిన్
అనంతరము సిద్దున కొక కన్యకామణిని చూచి వివాహము చేసిరి
అనుకూలంబుగ భార్యభర్తలు మనుచుండిరి, పెద్దలకు హితంబుగ
కొంత కాలమ్మునకు సిద్దయ్యకు సంతతి గల్గెను తల్లిదండ్రుల న
త్యంత భక్తితో సేవించి గురునాజ్ఞ రాజయోగంబున నుండెను ॥వి

# త్రయోదశాశ్వాసము

వీరబ్రహ్మముగారు సమాధిని జేరి పది నెలలు కావచ్చినది
ఊరులందున్న శిష్యుల నొక పరి చేరదలచి పోతులూరయ్య
బయలుదేరి 'వనిపెంట' యనంబడు పల్లె చేరుకొని తమ రాక
నయముగ నందలి విశ్వబ్రాహ్మణులకు నౌకరుల చేత నెఱింగించెన్ ॥వి

ధనమదాంధులై యుక్తాయుక్తము గనలేకను వారపుడు
అనిరి-పోతులూరయ్య భృత్యులతో నచటి విశ్వబ్రాహ్మణు లేకంబై
బ్రహ్మముగారు సమాధి నందియును పది మాసంబులు నాయె, నిప్పటికి
ఇమ్మహిలో నా స్వాములవారు నింత వఱకు జీవించియుండునే?
ప్రపంచ ధర్మము వీడి గోవిందమ్మ పసుపు-కుంకుమ-గాజులు-పూసలు
విపులంబుగ మెట్టియలు నివి యన్ని వీడకుండుటకు కారణంబేమి?

ఆమె యింకను ముత్తైదుగ నుండుట అది లోకవిరుద్ధము కాదా?
ఆమె యివి యన్ని తీసివేయు వఱ కా స్వాము లిచ్చు తీర్థప్రసాదములు
స్వీకరించరాదని మేమందఱము నేకముగా తీర్మానించుకొంటిమి
ఈ కరణి నంతయును మీ ప్రభువున కెఱింగింపు డనుచు వారితో చెప్పిరి ॥వి

అంతట నౌకరులు పోతులూరాచార్యుల కిది నెఱింగింప-న
త్యంత కోపమున మండిపడుచును ఆ గ్రామంబును వదలి

ప్రక్కనె యున్న 'మునిమడుగు' వూరునకు బయలుదేరి వెళ్లంగ
అక్కడ గూడా అదే విధమ్ముగ ననిరి విశ్వబ్రాహ్మణులు

స్వయముగ పోతులూరాచార్యుల వారె బయలుదేరి వారిండ్లకు నేగగ
దయజూపక కూర్చొనిమని యనక నయమున వారితో మాట్లాడరైరి ॥వి

శాంతి వహించి యాచార్యులవారే చల్లగ నిటులనె నాయనలారా!
ఇంత నిరాదరణ చూపుట నాపై హేతు వేమనుచు మఱియు
గురువులమై యున్నట్టి మమ్ములను పరుల రీతిగా మీరు చూచుటకు
నరయ కారణం బేమనంగ వారనుకొన్న దంతయును వివరించిరి ॥వి

అది విని పోతులూరాచార్యస్వామి యా సెంటనె యట నుండి
కదలి భృత్యులతొ మధ్యాహ్నమునకు కందిమల్లయ్యపల్లె జేరుకొనె

అనియె తల్లితో పోతులూరయ్య అమ్మా! నిన్నొక సంగతి నడిగెద మా
జనకుడు సమాధియయ్యి నిప్పటికి సరిగా పదిమాసంబులాయె గద
ఇన్ని దినము లాయన జీవించియె యున్నారని తలచుచుంటివా? నీవు
గ్రన్నన వైధవ్యమును పాటించక గాజులు- పూసలు-పసుపు కుంకమ్ము

లను మెట్టియలను ధరించుట వలన వనిపెంట విశ్వబ్రాహ్మణులు మఱియు
మునిమడుగు విశ్వబ్రాహ్మణులు మన మొసగు తీర్థప్రసాదంబులను
స్వీకరింపరాదని వారందఱు ఏకముగా తీర్మానించుకొనిరి
ఏ కరణిం జేయవలెనో మన మిపుడు నెఱిగింపుమ యీ విషయము ॥వి

అని గద్దించి యడుగ గోవిందమ్మ కనుల నీరు నింపుచును
కనులెఱ్ఱజేసి కోపంబున నిట్లనియెను ఓరీ! పోతులూరయ్యా!
కనులు కానకయె ధనమదమున వారనిన మాటలన్నియును వింటిని
వనిపెంటవారు వల్లకాడగుదురు మునిమడుగువారు ముదనష్టమగుదురు

అని శపించి, పోతులూరయ్యతో ననియె నాయనా! పసివాడవు-మీ
జనకుని మహిమ-శక్తి-సామర్థ్యంబులను గ్రహింపలే వీవు

ఆయన యింకను బ్రతికియే యుందురు-అందుకు సందియ మేమీ లేదు మీ
నాయన సమాధి నందునప్పుడు నాతో నిట్లని చెప్పెన్ ॥వి

నేను సమాధిని జేరిన తదుపరి నీవు వైధవ్యమును పాటింపక
మానుగ నెప్పటి యటు సుమంగళిగ మసలుకొనుమనుచు నుడివె
వారి యానతిని తిరస్కరించుట నేరమనుచు భావించి ఆ
తీరున నివి యన్ని యుంచుకొంటినని తెల్పి మఱియు నిట్లనియెన్ ॥వి

వినాశకాలం బావరించె నీ విశ్వబ్రాహ్మణులకు దుర్బుద్ధులు
జనియించె ననగ పోతులూరయ్య జననీ! నీ కిట్టి యభిప్రాయం
బున్నచో సమాధి తలుపులన్ ఊడగొట్టి నాన్నగారు జీవించి
యున్నారో? లేదో? చూచెద లేకున్న నీ మాటను నమ్మననియె

అపుడు గోవిందమాంబ పోతులూరాచార్యునితో బిడ్డా! నీ
విపుడు సమాధిని పగులగొట్టకుము విపరీత ప్రమాదము సంభవించు
మీ తండ్రి మహాద్భుతంబును నీ వెఱుంగలేకుంటివి- అందు
చేత నా మాటలను గూడ విశ్వసింపజాలకున్నావు కావునన్

సిద్దయ్య వద్ద కేగి నీ యిష్టము చెప్పుము-అతడు నేమి చెప్పునో
అద్ది చేయుము-మీ తండ్రి కతడు ప్రియమైనవాడు-నీ కంటె
పెద్దవాడు-ధర్మాధర్మంబులు పెక్కులు నెఱిగినవాడు
బుద్ధిమంతుడగు వాని దగ్గరకు పోయిరమ్మని వచించెన్ ॥వి

పోతులూరియాచార్యులు వెంటనె పోయి ముడుమాల చేరి
నీతికోవిదుడు సిద్దయ్యతో నీ రీతి బల్కె నాతండు
సమాధి తలుపులు నూడదీసి మా జనకునిం జూడవలెనని యున్నది
తమ యుద్దేశ్యము తెల్పు మనగ సిద్దయ్యందులకు నంగీకరింపక

అయ్యా! మీ నాయన మహిమలు నీ కవగాహన కావు-తొందరపడి
తియ్యకు సమాధి తలుపులు-అటుల తీసితివా! శాపంబు నొందెదవు

కనుక నా మాట వినుమని చెప్పగ కదలి యట నుండి పోతులూరయ్య
తన గృహంబునకు తిరిగివచ్చి సిద్దయ్య మాటలను లెక్కచేయకయె
ఒకనాటి రాత్రి అందఱు నిదురించుచున్న సమయంబునందు
ఒక పలుగును తీసికొని సమాధిపైనున్న యట్టి యా రాతిబండను

బలవంతముగా పెకలించి- అందు ప్రవేశించి జనకా! యని తండ్రిని
పలుకరించి చూచెను. బ్రహ్మేంద్రుడు పలుకకుండె సమాధి స్థితి నుండి
ఎంత పిలిచినను పలుకకుండ తానెక్కడ నుండెనో గానీ
కొంత వడికి స్పృహ గల్గి యెవడురా? కుమతి సమాధిని పగులగొట్టినది

అని వెనుకకు చూడగ పోతులూరాచార్యుడు గానంబడియె
జనకునిం గాంచి గడగడలాడుచు ననియెను తండ్రీ! నిన్ను
గాంచవలయునని యీ యపరాధము గావించితి గాన-దయ
నుంచి నన్ను క్షమింప వేడుకొనుచుంటినని యతండనగ

ననియె స్వామి ఓరీ పోతులూరాచార్యా! నీవేనా యింత
పనిచేసినది కుమారుడవని నిను కనికరించి క్షమించుచునుంటిని
అయినను నా యాన లేనిదే యీ యపరాధము గావించినందులకు
బయలుదేరి నీ భార్యతో 'మలమీదపల్లె' వద్దనున్న చిన్నకొండపై

సరస్సు దరి పూత-కాయలు లేక పరగు చింతచెట్టు క్రింద కూర్చొని
పరమ నిష్ఠతో పదిరెండ్లేండ్లు తపంబాచరింపుము, కొంత కాలమునకు
ఆ తరువున కొక కాయకాచి, అంతటది బాగాపండి నీ
చేతిలో పడును అప్పుడు నీ తపస్సిద్ధియైనదని యెఱింగి యా పండును

భుజించి పిమ్మట గృహమునకు నేగి భువిని కొంతకాలముండి తదుపరి
సజీవసమాధి నొందుమని చెప్పి స్వామి సమాధిలో ఆసీనుండై
సమాధి బండను మూసి వెడలుమని స్వామి యధావిధి నిష్ఠయందుండె ॥వి
కుమారు డవ్విధము:న నొనరించి గృహంబునకు చనుదెంచి

నిదురించుచున్న తల్లిని లేపి యీ విధమంతయు నెఱిగింప
వ్యథ నొందుచు నాయమ కుమారుని యవివేకమునకు వగచి నాయనా!

నేను నీ కెంత చెప్పినను గాని-జ్ఞాని సిద్దయ్య యెంత చెప్పినను
మానక యిటు లొనరించినావు ఆ మహనీయుని శాపంబనుభవింప
వలసి వచ్చినది. నేనేమి చేయగలను శాపమనుభవింపక తప్పదని
పలు విధముల చింతించి పోలేరమ్మను తలచి మనంబున ధ్యానించెన్

బాలికవలె నపుడు పోలేరమ్మ ప్రత్యక్షంబై అమ్మా! నన్ను
తలచిన కారణ మేమని యడుగగ తల్లీ! మా పోతులూరయ్య
జనకుని శాపము చేత తపస్సును సలుప నేగుచున్నాడు
కనుక నీవాయరణ్యమ్మున నా తనయుని కాపాడుచుండగవలయును

పదిరెండేడులు తపస్సుచేసి, తదుపరి గృహంబునకు జేరు వఱకు
పదిలంబుగ నా పుత్రుని కాపాడు భారము నీదే తల్లీ!
అని వేడుకొనగ పోలేరమ్మ ఆ విధంబుగానే కాపాడెద
ననివచించి వారిని దీవించి యామె యదృశ్యమయ్యె

తరువాత పోతులూరాచార్యులు తల్లి వద్ద-అన్నగారి వద్ద
పరగ సెలవంది భార్యామణితో పయనించె తపోవనమునకు
ఆ రీతిగ పయనించుచు పోతులూరాచార్యులు భార్యా సహితుండై
చేరె మలమీదపల్లె వద్ద నున్న చిన్నభూధరము పైకి

అందున నొకచో కొలను గట్టుపై నలరు చింతచెట్టు క్రిందకు జేరి-ప
సందుగ నచ్చటి సరోవరంబున స్నానమాచరించుచును
ఆ చెట్టు క్రింద కూర్చొని తపంబాచరించుచుండె, పోలేరమ్మ
అచటికి నిత్యము గొల్ల పడుచు వలె వచ్చి పాలుపోసి పోవుచునుండెను

పోతులూరియాచార్యుని తపస్సు పూర్తియైనది. ఒకరోజు
పోతులూరయ్య మారువేషముననున్న పోలేరమ్మను చూచి అమ్మా! మాకు

పదిరెండేడుల నుండి నిత్యమ్ము పాలుపోసి కాపాడిన రుణ మే
విధమునం దీర్చుకొనలేము, కాన సదయహృదయ! యిందులకు

ఎంత సొమ్మియమందువో అయ్యది యెఱిగింపుమనుచు పల్క
అంత నామె అయ్యా! నేను పోలేరమ్మను మీ నాయన మఠంబునన్
నను నెలకొల్పగ కోరుకొనుచుంటి ననగ పోతులూరయ్య-యి
ట్లని వచించె-తల్లీ! నీవు మా జనకుని మఠంబు నుండ వీలుకాదు ॥వి

నీకు జాతరలు జరుగవలయు గద-నిన్నొక చోట ప్రత్యేక స్థలమున
ప్రాకటముగ నుండునట్లు చేతునని పల్కి వారంద అట నుండి కదలి
దిగువ భాగమునకు వచ్చి యట నొక దివ్యమైన వేపచెట్టునుం గని
భగవతీ! యిందు వసింపు మనుచు బల్కె పోతులూరయ్య ॥వి

ప్రతి సంవత్సరము వైశాఖ శుద్ధ హితదశమినాడు నాయనగారికి
అతులితముగ నారాధన జరుగును. ఆ మరుసటి రోజునను
ఏకాదశి యుదయముననే నీకు నెంతో భక్తిగ జనులు పొంగళ్లు
పాకములను వంటజేసి పెట్టి బహు వేడుక జాతరను చేయుచుంద్రు ॥వి

మలమీద పోలేరమ్మ యనియును, మఱియు కనుమపోలేరమ్మ అనియును
పిలువబడుచుండెదవు సర్వజనములచే నని చెప్పె పోతులూరయ్య
అప్పటి నుండియు నిప్పటి వఱకును ఆ విధముననే పోలేరమ్మకు
గొప్పగ వైశాఖ శుద్ధ యేకాదశినాడు నెప్పటి వలె జాతరలు చేయుచున్నారు ॥వి

మఱియు గోవిందమ్మ శాపంబున 'మునిమడుగు' 'వనిపెంట' విశ్వ
బ్రాహ్మణులు
నరయ వంశక్షయమయ్యె, నీ రెండు పరిసరగ్రామములందు
నిప్పటికిని నీ రెండూర్లయందున నే విశ్వబ్రాహ్మణులూ నివసింపరు
ఎప్పుడైన నొకవేళ నెవరైన నేతెంచియున్న నాశమౌచుంద్రు
అప్పటి నుండియు నా గ్రామముల నిప్పటికినైనగాని
నొప్పుగ కంచరపని మహమ్మదీయులు-మరాటీలుచేయుచునుండిరి ॥వి

మునిమడుగు-వనిపెంట గ్రామమ్ముల నుండి నేటి వఱకు
ఘనముగ శ్రీవీరబ్రహ్మేంద్రస్వామిగారి యారాధనకునై
కంచరపనిచేయువారందఱును కడు భక్తితో నేయి-నూనె బుంగలు
ఇంచుక వ్యయమని తలపక తెచ్చియిచ్చుచుండిరి మఠంబునకు

అటులనే శివరాత్రికి గూడా యవి యన్నియును వారు
మఠమునకు అందజేయుచు నుండిరి మహానందంబుగాను

ముడుమాల యందు సిద్దయ్య సదా కడుబత్తిని గురుధ్యానమున
గడుపు చుండె కాలంబు రాజయోగమున నిస్వార్థముగను
వినయశీలుడౌ వాని దృఢదీక్ష విజ్ఞత సత్సంప్రదాయములు
గణనీయమైన వాని శక్తి యా గ్రామస్తులు గ్రహింపలేదైరి ॥వి

ఒక దినమున ముడుమాల గ్రామమునకు రెండుమైళ్ల దూరమునం గల
నొకపల్లెయందు తిమ్మారెడ్డి యను నొకనిని సర్పము కాటువేయుటచె
నోట నురుగులం గ్రక్కుచు బాధచె పాటు దప్పి యాతండు
మాటపలుకు లేకుండ స్పృహ తప్పి మరణస్థితిలో నుండి
మందు లెన్ని వేసినను నెన్ని మంత్రమ్ములు వేయించినను
అందువలన ఫలితంబు లేకనే యతడు దివంగతుడాయెన్ ॥వి

అంతట వాని తల్లిదండ్రులును నాలుబిడ్డలును దుఃఖింప
కొంతమంది బంధువులు పురజనులు గూడి వారలను నోదార్చి
దహనసంస్కారమునకు నా రెడ్డి దేహము స్మశానవాటికకు
బహుజనంబులుం గూడి తరలింప ప్రయత్నించుచుండగను

అంతలోన శ్రీసిద్దయ్యగారు ఆ మార్గంబున బోవుచును-తనకు
కొంత పరిచయయుండౌ రెడ్డి ప్రాణము కోల్పోయి యుండ చూచి
అనియె నచ్చోట నుండు వారలతో నయ్యలారా! యీ రెడ్డి-నా
కును కొంత పరిచయస్తుడు నీతడు చనిపోవుటకున్ కారణమేమన?

అనియె మృతుని తండ్రి సిద్దయ్యతో అయ్యా! యితనిని రాత్రి యొక
పెనుపాము కఱచినది వేవేగ పెక్కు వైద్యములు చేయించినాము ॥వి

కాని, వానిచే ఫలిత మేమియును గలుగమి సూర్యోదయమునకు
ప్రాణములు వీడె ననుచు దుఃఖమున బలుక, వెంటనే సిద్దయ్య
గురుని దలంచి, సూర్యోపాసన పరమపవిత్రంబైన మంత్రమును
స్మరియింపగ కొంత వడికి రెడ్డికి చల్లగ కదలిక గల్గె

ఆ రీతిగ మరి కొంతసేపు జపమాచరింపగ సిద్దయ్య
ఆ రెడ్డి లేచి కూర్చొని యెప్పటి యట్టులుండె నది గాంచి
ఆ వూరి జనులు సిద్దయ్యగారి కభివందనములు చేసి
దేవా! మీరలు మహానుభావులు, దీనబాంధవులు, కారణజన్ములు

పరమపురుష! మీ యనుగ్రహముచే బ్రతికెను తిమ్మారెడ్డి అని
పరిపరివిధముల స్తోత్రము చేసిరి భక్తితో నచ్చటివారు
అది లగాయతు ముడుమాల పురజనులు ఆ పరిసరగ్రామస్థు లందఱును
అధికంబుగ గొనియాడుచు దేవుని యటుల సిద్దయ్యను చూచుచునుండిరి ॥వి

ముడుమాలకు నతి తక్కువ దూరంబున పలుగురాళ్లపల్లె యన
బడు నొక గ్రామము కలదు అందు నొక బ్రాహ్మణుండు గోవిందాచార్యుం
డను నతనికి తిమ్మారెడ్డికి జరిగిన దంతయుం దెలిసి యపుడు
మనమున సిద్దుని గాంచవలయు నను మహాకోరిక జనించి వెంటనే

కదలి ముడుమాల కేగి సిద్దయ్యను గాంచి సాష్టాంగ దండమిడి, మీరు
అధిక శ్రేష్టులు భగవత్స్వరూపులు మహామహితాత్ములు కారణజన్ములు
మీ చరితము విని నప్పటి నుండియు మీ సేవ చేయవలెనను తలంపు
తోచుచున్నయది యీ మూఢుని దయతో వీక్షించి జ్ఞానోపదేశంబు

నిచ్చి నీ పాదదాసునిగా నన్నేలు కొమ్మటంచు ప్రార్థింప
సచ్చరితుడు సిద్దయ్య గోవిందాచార్యునితో నిట్లయెను అయ్యా!

నీవు బ్రాహ్మణుని వలె గన్పించుచుంటివి, నేను మహమ్మదీయుడను
కావున నన్నాశ్రయింప లోకము కడు బాధించును నిన్ను

అయినను నీ హృదయమున గల భక్తి యంతయు నే నెఱుగక పోలేదన
ఆయన శ్రీసిద్దయ్యగారితో ననియెను అయ్యా! మీరెఱుంగని
ధర్మమున్నదా? సత్వగుణమే ప్రధాన లక్షణముగానీ
కర్మబద్ధమైనట్టి కులములు గావు కదా? ప్రధానమ్ము ॥వి

మీరలెన్ని జెప్పినను గురువులుగ మిమ్మే భావించితి ననగ
గారవంబునన్ వాని నిజభక్తి గ్రహించి సిద్దయ్యగారు నాయనా!
మాటవరుస కట్లంటి గాని నీ మనసు నే నెఱుగలేకపోలేదు
దీటుగాను ముమ్ముందున నీవొక దివ్యపురుషుండవగు యోగముంది

అని పంచాక్షరి మహామంత్రంబును వానికి నుపదేశము గావించి
కనగ సాంఖ్యతారక అమనస్కంబులను బోధించి జ్ఞానిగ నొనరించెను ॥వి

సిద్దయ్యగారి భక్తివిశేషములు చెన్నొందు వాని మహిమాద్భుతములు
వృద్ధి జెంది యాచంద్రార్కమైయుండు యశమ్మును పొందెన్
ఆ మహనీయుని సిద్దయ్యయశస్సు అన్ని దిశలందు వ్యాపింప
ఆ ముడుమాల గ్రామకరణమయ్యది జూచి యోర్వలేక

అనుకొనె, దూదేకులవాడు భక్తుడా? అందఱు వీనిని పూజించుటయా?
అని సిద్దయ్యను నెటులైనగాని యవమానింప దలచి
సమయంబునకై వేచియుండె, నొక సారి సిద్దయ్యగారు ఆ
గ్రామకరణంబు నింటి ముందుగా కదలి పోరుగూరి కేగుచుండెను ॥వి

ఆ కరణము సిద్దయ్యను పిలచి అయ్యా! యెపుడు మా యింటికి రావు గదా?
ఆ కంసాలి గురువు చెంత నుంటివి, ఆయన నీకేమైన చెప్పెనా?

కంసాలాయన దప్పు నీకెవరు గన్పింపలేదా? యెచటనూ-నీ
సంశయంబులను దీర్చెనా? యతడు సమాధినొందే సమయంబునందు
నీకేమైన నొసంగెనా? యనగనే శ్రీసిద్దయ్యగారు
నాకు వారు తన పాదుకలు బెత్తము నాల్గు వస్తువులు నిచ్చిరని చెప్ప

బాగుబాగు నీవాయన్ను సేవింప పాదరక్షలను మాత్రమిచ్చెనా? యెంత
త్యాగమూర్తి మీ గురుండనుచు పరిహాసముగ బలుక సిద్దయ్య
తూరుపుగ తిరిగి 'దశా' యని యరచి యూరకుండె నది గాంచి యా
తీరుగ నరచుట కరణంబునకు, ఘోర యవమానముగ భావించి

సిద్దా! నన్నింత యమర్యాదగా జేతువు నీవని నే తలంచలేదు
బుద్ధిమంతుండవనుకొంటిని, పెడబుద్ధి వనుచు నిన్నెఱుంగనైతిని
పసువులతో మాట్లాడినట్లు నాతో బల్కుచుంటివి నీ విద్యా
పస యిదేన? అని మహా కోపమున బల్క-సిద్దయ్యగారు

ఆ మాటలు విని కరణముగారితొ నయ్యా! మిమ్ములను నే
నే మాత్రంబు నగౌరవపరచునటు లేవియు జేయగలేదు ॥వి

ఇచ్చటికి సమీపమున నొక గిరిపై పచ్చిక మేయుచున్న గోవుపై
వచ్చి పడనుండ నొక బెబ్బులి, వ్యాఘ్రము వలన ధేనువును రక్షింప
దలచి 'దశా' యని పులి నదలించితి తలప నంతియే యన కరణంబం
దులకు నాశ్చర్యపడుచు సిద్దయ్యా! తలపగ నియ్యది నిజమేనా? యని

తలారులను రావించి ఓరీ! తక్షమే మన యూరి సమీపమున
గల కొండ మీద కేగి యచట గోవులను గాయుచున్నవారి దరి కేగి-యా
కొండ మీద కేదైన పులి వచ్చి గోవును పట్టగజోయెనా యంచు
ఖండితముగ వారి నడిగి తెలిసికొని కదలి రయంబున రండని పంపెను ॥వి

వెంటనే వారు సమీపమున గల కొండపై కేగి సాయంకాలమగు
చుండుట చేతను గృహంబులకు గోవులను తోలుకవచ్చుచున్నవారిని గాంచి

అయ్యలారా! యీ కొండ మీది కేదైన యీ రోజు పులి వచ్చెనా? యన
చయ్యన వారలు తలారులతో ననిరి అయ్యలారా! యీ దినము
కొంత తడవు క్రిందట నొక పులి మా గోవును పట్టగబోయి
అంతలోనె నది వెనుకకు మరలి యతి వేగంబుగ పారిపోయినదని
అది యా విధముగ పోకున్నచొ నే విధమౌనో మా గతులని చెప్పగ
కదలివచ్చి యా విధమంతయునుం గరణమ్మున కెఱిగించిరి వారలు ॥వి

ఆ విషయము విని కరణము తనలో ననుకొనె, సిద్దయ్య యెంత భక్తుడు
భావాతీతుడు-మహిమగలవాడు-పరిహాసము చేయదలచితివానిని
అందుకు నాకే యాపద గల్గునొ యని తలంచి సిద్దయ్యతొ అయ్యా!
మందమతిని నీ మహత్వ మెఱుగక మాటలాడితిని నీతో
అవివేకముతో నేను గావించిన యపరాధమును క్షమించుడని వేడ

భవబంధరహితుడగు శ్రీసిద్దయ్య పల్కెను వానితొ అయ్యా!
యిందు నీవు నా కొనరించిన దోసమేమియును లేదు-నీకు
పొందుగను జ్ఞానదృష్టి లభించు యోగముంది-అందుచే నన్ను
పరిహాసము చేయ నారంభించితివి-పశ్చాత్తాపము వలన
కరగిపోయె నీ దోసంబని యా కరణమ్మున కుపదేశ మొసంగెను ॥వి

అప్పటి నుండియు సిద్దయ్యగారికి నా కరణము శిష్యుండై
తప్పక గురు నానతి మెలంగుచును ధన్యుండయ్యెను కడకు
సిద్దయ్యను ఆనాటి నుండి శ్రీసిద్దేంద్రస్వామివారని పిలుచుచు
శ్రద్ధగ పూజించుచుండిరి జనములు, సిద్దయ్య కీర్తి నలుమూలల
వ్యాపించె ॥వి

అనంతరము శ్రీవీరబ్రహ్మేంద్రావతారుండు చెప్పిన విధముగ
ఘనుండు శ్రీసిద్దేంద్రస్వామికి నగణ్య భక్తుండు పెదపీరను నొక
సుపుత్రుండు జన్మించెను, పిమ్మట సుజనహితుడు సిద్దయ్య
అపరజ్ఞాని ముడుమాల కీశాన్య దిశ యందొక మఠము నిర్మించుకొని

కొంత కాలమున కచట తాను తన కొమరుడైన పెదపీరుమహాత్ముడు-అ
త్యంత వైభవముగ జీవసమాధియైరి జనమ్ములు వినుతింప ॥వి

యోగాతీతుడు బ్రహ్మము సిద్దయ్య కొసగిన పాదుకలు-బెత్తంబు
యోగదండము, శిలాముద్రికలను బాగుపరచి యిప్పటికిన్
ఒక గది యందు భద్రంబు చేయబడి యున్నవి-వాటికి నేటికిని
ప్రకటితంబుగను నిత్యనైవేద్యదీపారాధనలు జరుగుచునే యున్నవి ॥వి

ఆ విధముగ గురుశిష్యుల కీర్తి యాంధ్రదేశమంతయు వ్యాపించెను-ఏ
తావు నందైన వారి నెఱుంగని తలపని కొనియాడని వారులేరు
బ్రహ్మంగారి వంటి గురుదేవుండును-పరగ సిద్దయ్యవంటి శిష్యరత్నమును
ఇమ్మహి నెవ్వరు నుండబోరనెడి యెక్కువ ప్రసిద్ధి నొందిరి వారలు

ఈ మహనీయుల నెల్లప్పుడు మది నెంచి ధ్యానింప నిహపరముల యందు
క్షేమమౌను-సంసారబంధముల జిక్కక సద్గతి నొందగల్గెదరు
వినండి జనులారా! మది గనండి నరులా! ఘనుండు వీరబ్రహ్మచరితమును
మనోరంజితము-మంజులాస్పదము-మానవాతీత మహిమాస్పదమ్ము ॥వి

సంపూర్ణము

ఓం శాంతిః - శాంతిః



# శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారికి

## మంగళహారతి

హారతి యిదె గొనుమా! మంగళహారతి యిదె గొనుమా!
వీరబ్రహ్మేంద్రస్వామీ! హారతి యిదె గొనుమా! మంగళహారతి!
కందిమల్లయపురమునందు వెలసిన భక్త
మందార భువనైక మహిమాన్వితా! నీకు ॥హా

రాజయోగవిభూష రసశిష్యపరిపోష
రాజత్కాలజ్ఞాన రమ్యప్రబోధా
పూజితావన సర్వభూతాత్మ సమభావ
భాజన వినోద శ్రీ పరతత్వనిధి నీకు ॥హా

తారకామృతసార తాత్విక మణిహార
పారమార్థికరూప పాపపరిహార
కారణ గురురూప కమనీయగుణదీప
సర్వధర్మాద్యైకసార చారువిహార ॥హా

శుద్ధతత్వవికాస సూరిజనవిజేత
సిద్ధినొందిన యట్టి చిన్మయానందా
ప్రత్యగాత్ముడవీవ ప్రణవనాదంబీవ
నిత్యమై వెలుగొందు నిఖిల వందిత నీకు ॥హా

సదమలాచారమ్ము సద్ధర్మ నిరతియను
కదళి, ఖర్జుర, నారికేళ పాకము లివిగొ
ముదముతో నిపుడారగింపవే మా తండ్రి
సదమలాభావ! నీ శరణుజొచ్చితిమయ్య ॥హా

సారపరిమళద్రవ్య సముదాయముల నింపి
తెగువ హృదయ సుమాలుదెచ్చి యర్పించాము
బిగువు జూపక మమ్ము తగ నేలుకోవయ్య ॥హా